# చతుర

మార్చి 1982

సంపుటి : 5 సంచిక : 2


## ఈ నెల సమగ్ర నవల

గాలికి పుట్టి ధూళికి పెరిగాడతను. 'నా' అనేవాళ్ళు తనకి కరువైనా అందర్నీ తనవాళ్ళనుకొని చేరదీసి ఆదరించాడు. ఆ ప్రేమ మజిలీలో ఎందరెందరో అమ్మాయిలు, స్నేహితులు అతన్ని ఆశ్రయించారు. అయితే ఆ ప్రేమించిన వాళ్లంతా అతనికి మనసు, మమతా పంచక ద్రోహం చేస్తే అతగాడేం కావాలి?

అభిమానాన్ని దోసిళ్లతో దానం చేద్దామనుకొన్న అతని మనస్తత్వానికి తీరని గాయం రేగితే నయం చేసే నాథుడెవరు ?

# బొంగరం

మల్లే పరిభ్రమించే అతడి మానసిక వేదనని అర్థం చేసుకొని అతన్ని లాలించిన దేవత ఎవరు? ఏం చేసిందామె?

## విశ్వనాథ్

క్షణక్షణం ఉత్తేజం కలిగించే శైలిలో రూపొందించిన 'బొంగరం' ఈ నెల చతుర సమగ్ర నవల.



ముఖచిత్రం: ఎన్. శివన్నారాయణ
రెండవ, మూడవ కవర్లు: బ్రహ్మదేవ్

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*

# మీకై మీరు స్వయంగా పని చేయగల్గిన శక్తి ఉన్నపుడు ఇతరుల వద్ద పనిచేయడ మెందుకు



"నేను స్వయం ఉపాధిగల సాంకేతిక నిపుణుడను.



"నేను పట్టభద్రుడను.
కాని ఉద్యోగం దొరుకుతుందని ఆశలేని వాణ్ని"

మీరు పట్టభద్రులై లేక సాంకేతికంగా మంచి అర్హతలు కలిగినవారై, తక్షణ ఉద్యోగావకాశాలు లేనివారై ఉండవచ్చు. లేక మీరు సాంకేతిక పరమైన ఉద్యోగం చేస్తూ, నిరాశ, నిస్పృహలతో దానిని వదలివేద్దామనే ఉద్దేశ్యం మీకు ఉండవచ్చు. ఈ రోజుల్లో ఉద్యోగావకాశాలు చాల తక్కువ. ఒకవేళ మీరు ఉద్యోగస్థులైనా, దానివలన తరచు పూర్తి ఉద్యోగ సంతృప్తి పొందలేక పోవచ్చు.

లభించిన అవకాశమును సద్వినియోగ పరచుకొని, పారిశ్రామిక వ్యవస్థాపకునిగా సగర్వంగా స్థిరపడగలిగే వారికొరకే స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ ఎదురు చూస్తున్నది:

భారత దేశము చాల త్వరగా అభివృద్ధి చెందుచున్నది. దేశాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చేయుటలో మీరుకూడ ప్రముఖపాత్ర వహించవచ్చు. ఆర్థిక సహాయం, ఉత్పత్తిదారులనుండి పోటీ, మరియు మార్కెటింగ్ సమస్యలతో మీరు నిరుత్సాహపడవద్దు. మీరు ఉత్సాహవంతులై లేక ఆర్థికంగా స్వయంభరణ శక్తిగల (viable) పథకము కలిగిఉంటే మిమ్ములను ఒక పారిశ్రామిక వ్యవస్థాపకునిగా తయారు చేయుటలో స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ శక్తివంచన లేకుండా కృషిచేస్తుంది. పరిశ్రమల స్థాపనకు సహాయపడే అనేక పారిశ్రామికాభివృద్ధి సంస్థలతో మీకు సంబంధాలను కల్పిస్తుంది. ముఖ్యంగా గమనించవలసిన విషయము. మీది స్వయంభరణ శక్తిగల పథకము అయితే బ్యాంకు ఆర్థిక సహాయముచేసి మీకు అండగా నిలబడుతుంది. ఇతర వివరములకొరకు మీ దగ్గరలోనున్న స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ శాఖయొక్క నిర్వహణాధికారిని సంప్రదించండి.

బ్యాంకు సహాయ సహకారాలతో మీరు మీ స్వంత గ్రామములో లేక పట్టణములో పారిశ్రామిక వ్యవస్థాపకునిగా సగర్వంగా నిలిచి, స్వయంగా అభివృద్ధి సాధిస్తూ, దేశాభివృద్ధికి కూడ తోడ్పడిన వారవుతారు. అందువలన బ్యాంకుకు వచ్చి మీ పథకాలను గురించి చర్చించండి. మీకు సహాయ సహకారాలందించుటకు బ్యాంకు సిద్ధముగా నున్నదని గుర్తించుకొనండి.

## స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్,

ప్రధాన కార్యాలయము, గన్‌ఫౌండ్రి, హైదరాబాద్–500 177.

**స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ సహాయ సహకారాలతో
మీ స్వస్థలంలోనే ఒక పథకాన్ని ప్రారంభించండి.**

Time & Space-894 Tel

# మీసం

పరాత్పరరావుకి పిల్లలంటే ప్రాణం. తన పిల్లలు పెద్దయి గొప్పవాళ్ళు కావాలంటే పసితనం నుంచీ వాళ్ళకి ఎన్నో చెప్పాలి, ఎంతో నూరిపోయాలి అన్న నమ్మకం గలవాడు.

పరాత్పరరావుకి ముగ్గురు పిల్లలు. చూడ ముచ్చటైన అందం వాళ్ళది.

పిల్లలు ఏ ప్రశ్న వేసినా విసుక్కోకుండా విడమరచి బోధించేవాడు. పిల్లలు ఏదైనా గొప్పపని చేస్తే వాళ్ళని పొగిడి గిఫ్టుగా చిన్న వస్తువు దాచుకోటానికి ఇచ్చేవాడు.



ఆరోజు రాత్రి పరాత్పరరావు శివాజీ శౌర్యగుణాలు కథగాచెప్పి తల్లి జిజియా బాయి చెప్పిన సాహసకథల వల్లనే శివాజీ అంతటి వీరుడయాడనిముగించాడు.

శివాజీ తర్వాత మరో బుల్లి కథ చెపుతూ ... "అమెరికా ప్రెసిడెంట్ అబ్రహాం లింకన్‌కి ఓ పదేళ్ళ బాలిక ఓ లేఖ రాసింది 'లింకన్‌గారూ! మీరు గడ్డం పెంచుకుంటే చాలా బాగుంటారు. మీరు గడ్డం, మీసం పెంచుకున్న తర్వాత మిమ్మల్ని చూడాలని వుంది అంటూ రాసిన ఆ చిన్నారి లేఖకి మురిసిపోయి లింకన్ ఆరోజు నుంచే గడ్డం పెంచటం మొదలుపెట్టాడు. ఒక పిల్ల కోరిక ప్రకారం గడ్డం పెంచిన లింకన్ మళ్ళీ ఎప్పుడూ గడ్డం తొలిగించలేదు. ఈ నిజం చరిత్రలో అలాగే నిలిచిపోయింది. ఆ పిల్ల జన్మ ధన్యమైంది" అని చెప్పి మరో కథ ఎత్తుకున్నాడు.

కథలు చెప్పించుకుని పిల్లలు నిద్రపోయారు. మర్నాడు పరాత్పరరావు సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చిన తర్వాత ''ఏరా పిల్లకాయలూ ఈరోజు మీరేమయినా గొప్పపని చేశారా?'' అని అడిగాడు.

"లేదండీ నాన్నగారూ!" అన్నారు మగపిల్లలిద్దరు.

ఆడపిల్ల ఎనిమిదేళ్ళ విమల "నేను గొప్పపని చేశాను నాన్నగారూ!" అంది.

"ఏంటమ్మా అది? చెప్పు చెప్పు" అన్నాడు పరాత్పరరావు.

"లింకన్‌కి ఆ అమ్మాయి ఉత్తరం రాసినట్లు నేనూ మన ప్రధానికి ఉత్తరం రాసి పోస్టు డబ్బాలో పడేశాను. మా టీచరునడిగి ఎడ్రస్ తెల్సుకున్నాను.

# కతలు

ఉత్తరం కూడా చక్కగా రాశాను."

"ఏమని రాశావు?"

"ప్రియమైన ప్రధానమంత్రిగారూ! మీరు గడ్డం, మీసం పెంచుకుంటే చూడాలని వుంది. నా కోర్కె తీర్చరా? తప్పక తీరుస్తారని తలుస్తాను. అని రాశాను. మరి మన ప్రధాని నా ఉత్తరం చదివి నా కోర్కె తీరుస్తారు కదూ నాన్నారూ!" అంటూ ముద్దుగా అడిగింది.

"మన ప్రధాన మంత్రి...మన ప్రధానమంత్రి..." అంటూ నెత్తిన చేతులు పెట్టుకున్నాడు పరాత్పరరావు- పిల్లలకి మన ప్రధానిగురించి తప్ప మిగతా అన్నీ చెప్పిన తన తెలివికి ఏడుస్తూ.

**-కురుమద్దాలి విజయలక్ష్మి**

## మిస్టర్ దండపాణి

కొత్తగా పెళ్ళయిన ఓ ఫ్రెంచి పెద్దమనిషి భార్యాసమేతంగా భారతదేశ పర్యటన వినోద కార్యక్రమంగా ప్రారంభించాడు. కార్యక్రమంలో మొదటగా ఓ స్టార్ హోటల్లో దిగాడు. భార్య ముందు బడాయికొట్టాలని డిక్షనరీలు దగ్గర పెట్టుకునీ, హోటల్ సర్వర్లని మంచి చేసుకునీ దేశీయ భాషని చిలకలా ఒక్కోముక్క పలకటం ప్రారంభించాడు. ఓ రోజు ఢిల్లీలోనే ఓ రెస్టారెంట్‌లోకి ప్రవేశించి కూర్చున్నారు భార్యాభర్తలు.

ఎండ దంచేస్తోంది - ఉసూరుమంటూ వచ్చి చతికిలబడ్డ దంపతుల్ని చూసి సర్వ్వారాయుడు దగ్గరకొచ్చి-

"ఏంకావాలి?" అని హిందీలోనూ, ఇంగ్లీషులోనూ అడిగాడు.

విదేశీయుడు దర్జాగా చూస్తూ "దండ పాణి హై?" అన్నాడు.

సర్వరు దంగైపోయాడు. దండపాణి ఆ రెస్టారెంట్ యజమాని! అలాటి మరో అరడజను రెస్టారెంట్లకీ, రెండు లాడ్జింగు లకీ కూడా అతనే యజమాని!



సాక్షాత్తూ తన యజమాని పేరు చెప్పే సరికి సర్వరు వినయంగా వంగి నమస్కరించాడు. అదృష్టవశాత్తు అంతకి అర గంట క్రితమే ఆ రెస్టారెంట్‌కి వచ్చి లోపల తన గదిలో కూర్చున్న దండపాణి దగ్గరకు పరుగెత్తాడు.

"సార్! మీకోసం ఎవరో ఓ విదే

యుడుగారు వచ్చారు. రెస్టారెంట్‌లో కూర్చున్నారు" అని చెప్పాడు. దండపాణి 'ఎవరా' అని లేచి హాల్లోకి నడిచి సర్వర్ చూపించిన టేబుల్ దగ్గరకు వెళ్లాడు.

"అయాం దండపాణి" అన్నాడు విసుగ్గా నువ్వెవరివన్నట్లు.

"నో...నో...అయ్ వాంట్ దండపాణి..." మళ్లీ ఆ పెద్దమనిషి.

దండపాణికి వళ్లు మండిపోయింది.

'కోటీశ్వరుణ్ణి దగ్గరకు పిల్చి పరాచికాలాడుతున్నాడు ఏమిటి వీడు' అనుకుని కోపంగా టేబుల్ మీదున్న మంచినీళ్ల గ్లాసు ఎత్తి విసురుగా టేబుల్ మీద కొట్టాడు "అయాం దండపాణి" అంటూ.

విదేశీ పెద్దమనిషి అదిచూసి—

"నో...నో...దిస్ పాణి యీస్ హాట్! అయ్‌వాంట్ తండాపా...ణీ" అన్నాడు!

'పిచ్చెత్తించావుగదరా నాయనా!' అనుకొని—

"కాస్త అయిస్ వాటర్ తగలెయ్యరా వీడిమొహాన!" అన్నాడు దండపాణిగారు వెనక్కి తిరిగి వెళ్తూ సర్వర్‌తో!

# పరిజ్ఞానం

కాలినడకన దేశాలు చుట్టిరావాలని బయల్దేరిన యిద్దరు యువకులు ఓ దేశం పొలిమేరలు చేరుకునే సరికి ఎండనడినెత్తికి వచ్చింది. తమ చేతి గడియారాల టైముకీ, ఆ దేశం టైముకి తేడా వుంటుందని వూహించిన ఆ యిద్దరూ ఎవర్నన్నా టైం అడిగి తమ గడియారాల్ని సరిచేసుకుందామనుకున్నారు. ఇంతలో ఓ పశువుల కాపరి ఓ చిన్న రాతిమీదకూచుని తన గేదెకి గడ్డి తినిపిస్తూ కనిపించాడు వాళ్లిద్దరూ అతని దగ్గరకు వెళ్లి—

"టైమెంత అవుతోంది యిప్పుడు?" అని అడిగారు. వాడు ఓసారి చేతులకు వాచీలున్న వీళ్ళవంక వింతగాచూసి, తన గేదె ముట్టెని పట్టి ఒక్కసారి తన వైపుకి తిప్పుకున్నాడు.



తర్వాత వీళ్ళకేసి చూసి "పదకొండూ నలభై" అన్నాడు.

వాళ్ళు తమ గడియారాలు అ్రపకారం సరిచేసుకుని నాలుగడుగులు ముందుకు వేశారు.

"అదికాదు భాయ్! వీడు గేదె తలని పట్టుకుని టైం ఎలా చెప్పాడంటావ్? వాడి చేతికి వాచీ కూడా లేదు?" అన్నా డొకడు రెండోవాడితో.

"నిజమే! ఇదేదో తమాషాగా వుంది. మళ్ళీ ప్రయత్నిద్దామా?" అన్నాడు రెండో అతను. కాసేపు తర్జన భర్జన పడ్డాక ఇద్దరూ మళ్ళీ వెనక్కి వచ్చి నిలబడ్డారు. మరి కాసేపటికి తలెత్తి వాళ్ళవైపు చూశాడు పశువుల కాపరి.

"ఏం కావాలి?" అన్నాడు.

"ఇప్పుడెంతయిందంటావ్ టైము ?" అడిగారు వాళ్ళు.

అతడు మళ్లా వాళ్ళని ఆశ్చర్యంగా చూసి మళ్ళీ గేదె మూతిని పట్టి తనవైపు తిప్పుకున్నాడు.

"పదకొండూ నలభై ఎనిమిది" అని మళ్లా తన పనిలో పడిపోయాడు.

వాచీలు చూసుకున్న వాళ్ళిద్దరికీ మూర్ఛ వచ్చినంత పనయింది.

"అరె! ఇదేం తమాషా భాయ్? గేదె తలని తిప్పితే టైం ఎలా తెలుస్తోంది? ఈ దేశంలో సాంకేతిక పరిజ్ఞానం యింత గొప్పగా డెవలప్ అయిందా?" అని ఆశ్చర్యంతో తలమునకలయ్యారు. చివరికి అతడినే ఆ కిటుకు అడగదల్చుకున్నారు.

"చూడు బాబూ! నువ్వు టైం చాలా కరక్టుగా చెపుతున్నావ్! బాగుంది. కానీ గేదె తలని తిప్పితే టైం ఎలా తెలుస్తోంది నీకు?" అన్నారు.

పశువుల కాపరి వీళ్ళ వంక మరో సారి వెర్రివాళ్ళని చూసినట్టు చూశాడు. ఆ తర్వాత అన్నాడు—

"గేదె తల ఏమిటయ్యా మీ బొంద. నేను టైం చూస్తున్నది ఆ దూరంగావున్న క్లాక్‌టవర్‌లో ! మీకు చూపు ఆనదేమో అనుకున్నాను. నాకు గేదె తల అడ్డు వస్తుండటంతో దాన్ని పక్కకి తిప్పి ఆ క్లాక్ టవర్ చూసి చెప్తున్నాను. అంతే" అన్నాడాకుర్రాడు.

# పిచ్చి కుదిరింది

పాపం, గున్నేశ్వర్రావు పరిస్థితి దయనీయంగా తయారయింది. అతడికి పిచ్చే



ఎక్కిందని నిశ్చయించేశారు డాక్టర్లు! నిండా రెండు పదులు నిండని గున్నేశ్వ్రరావుకి ఏం మానసిక బాధలున్నాయని పిచ్చెక్కిందో ఎవరికీ అర్థం కాలేదు.

ఇంతకీ అతడికి పిచ్చెత్తినందువల్ల అతను ఎవర్నీ కరవట్లేదు. కనీసం తిట్టట్లేదు. అతనిదల్లా ఒకటే లక్షణం–ఏ తాడు కనబడ్డా, గుడ్డకనబడ్డా ఓ కర్ర తీసుకుని 'కాటర్‌పుల్లర్' (ఉండేలు) తయారుచేసి ఆడటం మొదలెడతాడు. అది తప్పమరొక ధ్యాసలేదు.

"ఏంఫర్లేదు. మా పిచ్చాసుపత్రిలో ఓ ఏడాది పాటు వుండనివ్వండి. అతని పిచ్చి కుదిరిపోతుంది" అన్నారు పిచ్చి (ఆస్పత్రి)డాక్టర్లు. సరే వుంచేశారు అతని తల్లిదండ్రులు. క్రమంగా గున్నేశ్వర్రావుకి మానసిక చికిత్స ప్రారంభించారు. అది గుణాన్నివ్వటం ప్రారంభించింది. ఏడు.. ఎనిమిది...పది నెలలకే గున్నేశ్వర్రావు మామూలు ధోరణిలో పడ్డాడు. ఇప్పుడు అతను కాటర్ పుల్లర్స్ తయారు చేయటం మానేశాడు.

ఓ సాయంత్రం డాక్టర్‌గారు గున్నేశ్వర్రావుని పరీక్షించటం మొదలెట్టారు.

"చూడు బాబూ! నువ్విప్పుడు మామూలు మనిషిగా మారిపోయావ్!నేను నిన్ను పైవారం విడుదల చేసేస్తాను. నువ్వు బయటకు వెళ్లి ఏంచేస్తావ్?"

"నేను...నేను...పెళ్లి చేసుకుంటా!" అన్నాడతను. డాక్టరుగారు సంతోషించారు – అతడి ఆరోగ్యకరమైన ఆలోచనకి.

"గుడ్...తర్వాత?"

"తర్వాతేముందీ...శోభనం!"

"ఆఁ! ...గట్టివాడివే! శోభనంలో నువ్వేం చేస్తావ్?" అడిగాడాయన.

"నేను... నా భార్యని దగ్గరకు తీసుకుంటా!"

"ఊఁ... తీసుకుని?" ఉత్సుకత మొదలయింది పిచ్చి డాక్టరులో.

"ఆమె పైట తొలగిస్తాను"

"ఊఁ.. తొలగించి.?"

"బ్లౌజు గుండీలు తీసేస్తాను"

"ఊఁ. ఊఁ.. చెప్పు. ఆ తర్వాత?"

"బ్లౌజ్ తీసేస్తాను"

"కమాన్... చెప్పవయ్యా... చెప్పు.. దెన్?"

"ఆమె బ్రా... బ్రానికూడా విప్పేస్తాను"

"శభాష్.. విప్పేక?"

"ఆ బ్రాకుండే చక్కని ఎలాస్టిక్‌తో ఫస్ట్‌క్లాసైన కాటర్‌పుల్లర్ తయారుచేసుకుంటా!" ఉషారుగా అన్నాడు గున్నేశ్వర్రావ్.

పిచ్చి డాక్టరుకి స్పృహ తప్పింది!

–పి.వి.ఆర్. శివకుమార్

కుర్చీ లోంచి లేచాడు మూర్తి. ఎదురుగా ఉన్న పాడ్ మీది కాగితాల్నీ, టేబుల్ మీది కాగితాల్నీ తీసి వరుసగా పేర్చి, వొళ్లు విరుచుకొన్నాడు.

ఇంకా పూర్తిగా చీకటి పడలేదు. మసక మసగ్గా వెలుతురుంది. అయినా గదిలో లైటు వేసి వరండాలోకి వచ్చి నిల్చున్నాడు.

ఎదురింటి తలుపునానుకొని నిల్చుంది పద్మ. అతన్నే చూస్తూ నవ్వుతోంది. ఆ నవ్వులో కవ్వింపు, ఆహ్వానం కనిపించాయి మూర్తికి.

మూర్తి అటుగా ఓసారి చూసి నవ్వుకొన్నాడు. తర్వాత కొంచెం తలెత్తి ఇటుగా చూశాడు.

'సారాయి దుకాణం' పెద్ద పెద్ద అక్షరాలతో చిన్న బోర్డు కన్పించింది. కొట్టువాడు బయట స్టూలు వేసుకొని కూర్చున్నాడు. మూర్తినే తదేకంగా చూస్తున్నాడు.

"ఎంత అదృష్టవంతుడివి గురూ! బంపర్ ప్రైజ్ అంటే నీదే" లోనికి వస్తూనే అరిచాడు వాసు.

"నిండు కుండ తొణకనే తొణకదు. అది తొణికినా పదిలంగా నిలువును..." రాగం తీశాడు చక్రవర్తి.

"అసలు కథేంటి" మూర్తి వాళ్లకి దగ్గరగా వచ్చి కూర్చున్నాడు.

"ఏం లేదు గురూ! కథ చాలాచిన్నదే. ఎదురింటి అమ్మాయి నిన్ను చూస్తోంది. తప్పులేదు. ఆడ, మగా ప్రేమ! బాగానే వుంది. పోతే వాడు — ఆ సారాకొట్టు వాడెందుకని నిన్ను కొరికేసేటట్టు చూడ్డం?" ప్రశ్నార్థకంగా ముఖం వేలాడేశాడు వాసు.

"నాకూ అదే అర్థం కావడం లేదు. పెళ్లికాని పిల్ల, వయసొచ్చిన పిల్లా నిన్ను చూస్తోందంటే తప్పులేదుగాక లేదు. కాక పోతే వాడే-ఆ సారాకొట్టువాడు చూడ్డం లోనే చిక్కొచ్చింది" చక్రవర్తి ఆశ్చర్యార్థకాల్ని కళ్లల్లో క్లోజప్‌లో చూపించాడు.

"నాకేం తెలుసు" మూర్తి అమాయకంగా అన్నాడు.

" 'నాకేం తెలుసని' తప్పించుకోకు బ్రదర్! తెలిసివున్నా చెప్పటం లేదు నువ్వు.అమ్మాయిల్ని లవ్వాడు. మంచిదే. కాని, ఆ సారాకొట్టు ఆడార్ని మాత్రం లవ్వాడకు" అని పగలబడి నవ్వాడు చక్రవర్తి. శృతి కలిపాడు వాసు.

మూర్తికి చిరాకేసింది.

"కాఫీ తాగుదాం వస్తారా?"అనడిగాడు.

"ఇప్పుడే తాగొచ్చాం గురూ"అన్నారు ఇద్దరూ.

మూర్తి ఒక్కడే బయటికి నడిచాడు. పద్మ ఇంకా అలాగే అతన్ని చూస్తోంది. సారాకొట్టు వాడు కూడా అంతే!

డాబా మీది నుండి వాసు, చక్రవర్తి పరిసర వాతావరణాన్ని కన్నార్పకుండా చూస్తున్నారు.

మూర్తిని అనుసరించాడు సారా దుకాణంవాడు.

"ఒరేయ్! ఆడారివాడు మూర్తి వెంట వెళ్తున్నాడ్రోయ్" అన్నాడు వాసు.

"వెళ్లనీ వెధవని! వాడి వూసు మన కెందుకు? ఈ పద్మ విషయం ఆలోచించు" చక్రవర్తి దిల్‌ఖుషీగా అడిగాడు. ఆలోచనలో పడ్డాడు వాసు.

మూర్తి కాఫీ హోటల్లోకి దారి తీశాడు. వెంట సారాదుకాణం వాడు కూడ వున్నాడు.

మూర్తి పక్కగానే కూర్చుని నవ్వా

దతను.

"నా పేరు సీతరాజు. అన్యథా భావించకండి. ఆ రూమ్‌లో వున్న పోకిరీ కుర్రాళ్లలో మీరు కొంచెం నమ్రతగా వుంటారు.అందుకని మీరంటే అభిమానం. అంతేగాని మరోటికాదు. నన్ను వాళ్లు గేలిచేస్తుంటారు" బాధపడ్డాడతను.

దాదాపు ఏభై యేళ్ల వయసులో వున్నాడు. అతనలా బాధపడుతుంటే మూర్తికి అదోలా అన్పించింది.

"థథ" అన్నాడు నవ్వుతూ. తనకి ప్రత్యేకతనిస్తూ మాట్లాడుతోంటే గర్వంగా వుంది.

కాఫీ తాగి బయటికి వచ్చారు.

"మీతో ఓసారి తీరిగ్గా మాట్లాడాలి! వస్తాను" సీతరాజు గబగబా వెళ్లిపోయాడు.

మూర్తికి ఏమీ అంతుపట్టలేదు.

బాగా చీకటి పడింది.

సీతరాజు గురించి ఆలోచిస్తూ నడుస్తోంటే సత్యం తారసిల్లాడు.

"నిన్ననల్లా వూర్లో లేవట కదా! ఎప్పుడొచ్చావు?" పలకరించాడు.

"మధ్యాహ్నం వచ్చాను. కొంచెం డబ్బు అవసరంగావుంది వీలైతే ఓ వంద సర్దగలవా?" మూర్తి అడిగాడు.

"నాన్నగారు లేరింట్లో! రేపు చూద్దాం ఆవిషయం.సినిమా కొస్తావా?"అన్నాడు.

"ఇంట్రెస్ట్ లేదు"

సత్యం వెళ్లిపోయాడు.మళ్లీ ఒంటరిగా నడవక తప్పింది కాదు మూర్తికి.

దగ్గరగా వున్న దేవాలయంలోని గంటలు శ్రావ్యంగా నినదిస్తున్నాయి.

సారా కొట్టుముందు సీతరాజు కూర్చుని వున్నాడు. జనం అట్టేలేరు.

మూర్తి అక్కడికి వెళ్లాడు. అతన్ని చూస్తూనే ఆశ్చర్యపోయాడు సీతరాజు.

"రండి!రండి!" ఆహ్వానించాడు.

లోపలకి వెళ్ళి కూర్చున్నాడు. ఓ పక్క ఖాళీ అయిన సారాటిన్నులు పడి వున్నాయి. ఇంకో పక్క కొంలగ్లాసు, రెండు మూడు కుర్చీలు, టేబుల్ అస్తవ్యస్తంగా వున్నాయి.

మూర్తిని చూస్తూనే ఓ అమ్మాయి చరచరా బయటకి నడిచింది.

"ఎవరీ అమ్మాయి?"అనడిగాడు వుండబట్టలేక.

"మా అమ్మాయే! ఇంటర్ చదువుతోంది. చిన్నప్పుడే పెళ్ళి చేసేశాం! మొగుడు పోయాడు" అన్నాడు సీతరాజు బాధగా.

"ఎందరు పిల్లలు?"

"ఇద్దరూ అమ్మాయిలేనండి! పెద్దదాన్ని ఈ వూర్లోనే ఇచ్చాం. ఇది రెండోది. దీని బతుకిలా అయింది"

"చదివిస్తున్నారా?"

"తప్పక చేసేదేముంది"

"ఎక్కడ వుంటున్నారు?"

"ఈ పక్కనే. ఓసారి మా ఇంటికి రండి!"

'సరే'నన్నట్లుగా తలూపి, లేచి బయటపడ్డాడు మూర్తి. పద్మ ఇంటి వెపు యథాలాపంగా చూశాడు.తలుపులు వేసి వున్నాయి.

వాచీ చూసుకున్నాడు.

ఎనిమిది గంటలు!

గదిలో వాసు, చక్రవర్తి, మురళి బోర్లాపడి అప్పుడే నిద్ర తీస్తున్నారు. మూర్తి అలికిడికి వాసు మేల్కొన్నాడు.

"రసికప్రియ శిఖామణీ! ఆసీనులు కండు" అన్నాడు.

"ఆహా! ఏమి సుదినం! ఏమి సుదినం! మగలాడితో మనవాడి సంభాషణ ఎంత మధురం ఎంత మధురం" చక్రవర్తి వంత పాడాడు.

"శిష్యా" పిల్చాడు వాసు.

"యస్ గురూ" లేచి కూర్చున్నాడు చక్రవర్తి.

"సిగరెట్ దానము సేయుము"

వాసు సిగరెట్ అంటించుకొన్నాడు.

"దేశమున నాలుగు జాతులు గలవు. ఒకటి ఆడ! రెండు మగ! మూడు మగ ఆడ! నాలుగు ఆడమగ! అయిన మన వాడు మగఆడతో స్నేహము సేయుటలో ఆంతర్యము?"

మురళికి వళ్లు మండింది.

"నోరు మూస్తారా తన్నమంటారా? మరేం పన్లేదురా మీకు? నిశ్శబ్దంగా వుండలేరేమిట్రా మీరు?" లేచి కూర్చున్నాడు.

"వుండుట అసాధ్యము" వాసు అన్న మాటలకి–

మురళి యుద్ధాన్ని ప్రకటించేడు. చక్రవర్తి ఇద్దర్నీ విడిపించాడు.

"వాడు ఆడారి కావచ్చు. అయితే మాట్లాడకూడదా?" అనడిగాడు మూర్తి.

"కూడదు అని మేం అన్లేదు. కూడుకో. కాదనం. వాడి స్నేహంవల్ల చాలా లాభాలున్నాయిలే"

"ఏమిట్రా?"

"సారాయి దండిగా పోసాడు. ఇంకా చాలా లాభాలున్నాయి కాని నేను చెప్పను. సశేషం" వాసు నీల్గాడు.

"వున్నాయా? వుంటే వాడి బాధలు వాడు పడతాడు. మీకెందుకు?" కోపగించుకొన్నాడు మురళి.

దాంతో అంతా నిశ్శబ్దమయిపోయారు.

* * *

"ఎక్కడికి వెళ్తున్నారు?" సీతర్రాజు మూర్తి వెళ్తుంటే అడ్డుపడి ప్రశ్నించాడు.

"పోస్టాఫీసుకి. ఏం?"

"ఈరోజు మా ఇంట్లో చిన్న ఫంక్షన్ వుంది. మీరు భోజనానికి రావాలి! వీలైతే మీ మిత్రులందర్నీ తీసుకురండి"

"అలాగే" అన్నాడు నవ్వి.

"తప్పక రావాలి" బతిమాలాడు.

సాయంత్రం ఆరుగంటలకి సీతర్రాజు ఇంటికి చేరుకున్నాడు మూర్తి. ఫంక్షనేమిటో తెలీదు. ఆడవాళ్లు మాత్రం చాలా మంది వున్నారు.

సీతర్రాజు మర్యాదగా పలకరించాడు వస్తూనే. కుర్చీ తెచ్చి వేశాడు. ఎవరో పిలిస్తే "వస్తానండి" అని వెళ్లిపోయాడు మళ్లీ గాబరాగా.

జనం పల్చబడ్డారు క్రమంగా.

"మా పెద్దమ్మాయి కమల" సీతర్రాజు పరిచయం చేశాడు.

"నమస్కారం" అన్నాడు మూర్తి.

"మన కొట్టుకు ఎదురుగానే వీళ్ళ రూం! అందరూ స్టూడెంట్లే"

"కాని, నేను స్టూడెంటును కాను" అని నవ్వాడు మూర్తి.

ఇంతలో ఓ అమ్మాయి వచ్చిందటు!

"ఇది మాచెల్లెలు అరుణ" పరిచయం చేసింది కమల.

"మొన్న వోసారి కొట్లో చూశాను"

"మీరు తాగుతారా?" కమల విత్తరపోయింది.

"అబ్బే" గొల్లుమన్నాడు మూర్తి.

కమల సిగ్గుపడింది.

"ఇష్టం లేకపోయినా అక్కడ పని చేయక తప్పదు. నెలకి రెండువందలు జీతం ఇస్తారు. కాదంటే మరో గతిలేదు" సీత్రాజు తన బాధ వెళ్ళబోసుకున్నాడు.

"నేను మీ వృత్తిని కించపరచడం లేదు" అన్నాడు సముదాయింపుగా మూర్తి.

"మరైతే మీరేం చేస్తున్నట్టు" ప్రశ్నించింది కమల

"నాటకాలు రాస్తాను. వేస్తాను" అన్నాడు నవ్వి.

"భోజనానికి లేవండి" అరుణ కల్పించుకొంది. మూర్తి కాళ్లు కడుక్కున్నాడు.

పరాయి ఆడవాళ్ల ముందు కూర్చుని భోజనం చేయడమంటే ఇబ్బందిగా ఉంది మూర్తికి. పైగా అంతా కొత్త!

భోజనం అయింతర్వాత బయటకు నడిచాడు. అరుణ తువ్వాలందించి—

"కిళ్లీ వేసుకుంటారా?" అనడిగింది.

లేదన్నట్టుగా తలూపాడు.

రాత్రి తొమ్మిదయింది!

"వెళ్ళొస్తానండీ!" అందరి దగ్గరా శలవు తీసుకున్నాడు మూర్తి.

"అప్పుడప్పుడూ వస్తూండండి" అంది కమల.

"అలాగే" అన్నట్టుగా నవ్వి బయలేరాడు.

"మితభాషిలా వున్నాడు" కమల నవ్వింది.

"అంతే! నెమ్మదస్తుడు! ఆ పోకిరీ వెధవల మధ్య ఎలా నెట్టుకొస్తున్నాడో అర్థం కావడంలేదు" సీత్రాజు సమాధానం ఇచ్చాడు.

"అవున్నాన్నా? నాతో చదివే వాళ్లలో ఇద్దరుఅతని రూములోనే వున్నట్టున్నారు" అంది అరుణ.

సీత్రాజు మరి మాట్లాడలేదు.

మూర్తి రూం చేరుకొనే సరికి—

మిత్రులంతా పుస్తకాలతో కుస్తీ పడుతూ కన్పించారు.

"వచ్చేశావా?" అన్నారుముక్తకంఠంగా అతన్ని చూస్తూ.

వాసు సిగరెట్ అంటించాడు. చదవాలని లేదతనికి.

"చెల్లియో చెల్లకో" అని రాయబారంలోని పద్యాన్ని ఆలపించడం మొదలెట్టాడు.

మురళికి కోపం నసాళానికి అంటింది.

"అలా కాదు! నీకు సరిగ్గా రాగాలాపన తెలీదు. చూడు..." చక్రవర్తి అందుకోబోయాడు.

మురళికి చిర్రెత్తుకొచ్చింది. తమాయించుకో లేకపోయాడు. వెళ్లి చక్రవర్తిని 'గుభీ గుభీ'మంటూ పట్టుకు వుతికేశాడు. తర్వాత వాసుని కూడా 'దభీ దభీ' మంటూ...

"చచ్చాన్రో" వాసు కేకేశాడు.

మూర్తికి అసహ్యంగా వుందీ వాతావరణం. ముఖం చిట్లించుకున్నాడు.

కొద్దిసేపట్లోనే మళ్ళీ అంతా సద్దుమణిగింది.

ఇది ఎప్పుడూ వుండేదే! ఒకడంటే ఒకడికి పడదు. తిట్టుకొంటారు. కాసేపు కొట్టుకొంటారు. మళ్లీ మామూలే. అది వాళ్ళకి సరదా.

అదంతా భరిస్తూ మూర్తి తన పని తాను చేసుకుపోతాడు.

అంతా ఒకే వూరివాళ్లు కావడంవల్ల ఒక్కుమ్మడిగా వుండడం తప్పింది కాదు. కొందరు చదువుతున్నారు. కొందరు బలాదూర్గా తిరుగుతున్నారు.

హోటల్ తిండి, రూమ్ నిద్రా వాళ్ళ

పని. చదవడం అంటే పిచ్చివాళ్ళ చేష్టలా వుంటుంది వాళ్ళకి.

సత్యం వచ్చాడు

ఆపాటికే మూర్తి పడుకోబోతున్నాడు.

"సినిమాకా గురూ!" అనడిగాడు వాసు.

ఆ సమయంలో సత్యం వచ్చేడంటే సినిమా వ్యవహారమే!

"సినిమాకే. వస్తావా?" అన్నాడు సత్యం.

"ఓ! భేషుగ్గా"

"ఈ వెధవలతో సినిమా ఏమిట్రా? అక్కడ కూడా 'గొల్లు'మంటూ తన్నుకు ఛస్తారు" అన్నాడు చక్రవర్తి.

మూర్తి నవ్వుకొన్నాడు అతని మాటలకి.

వాసు, చక్రవర్తి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"వస్తారా రారా?" సత్యం నిలదీశాడు.

"రానన్నవాడు ఎవ్వడా? వస్తాం. అందరం సకుటుంబ సమేతంగా విచ్చేయుదుము" అంటూ వాసు దారి తీశాడు.

అంతా 'హోలుహోలో'మని వెళ్లిపోయారు.




మూర్తిది చాలా చిన్న వయసు. ఆ వయసుకే అతడెన్నెన్నో అనుభవాలు రుచి చూశాడు. అన్ని అనుభూతుల్నీ జీర్ణించుకున్నాడు. అందుకే పొంగక కృంగక నెమ్మదిగా వుంటాడు.

ఆస్తి లేదు. వున్న బంధువులు చేరదియ్యలేదు. గాలిపటంలా తిరిగాడు. దాంతో బతుకుమీద శ్రద్ధ పెరిగింది.

ఒంటరిగా జీవితంతో పోరాడాలనుకున్నాడు. ఏదో వ్యాపారం చెయ్యాలన్నా పెట్టుబడి అవసరం. డబ్బు లేనిదే ఏమీ సాగదు.

అదే ఆలోచన మూర్తిది.

ఆ రోజు సాయంత్రం సీతరాజుని కలిశాడతను.

సారాయి దుకాణం హౌస్‌ఫుల్ కలెక్షన్లతో నడుస్తోంది. కాసేపటికి జనం పల్చబడ్డారు. రద్దీ తగ్గింది.

"సాయంత్రం లేబర్ ఎక్కువగా వస్తారు. క్షణం తీరిక వుండదు" అన్నాడు సీతరాజు.

"లేబరంతేనండీ! పగలంతా చేసిన కష్టాన్ని మరిచిపోవాలంటే ఇదే దిక్కు వాళ్లకి"

"గొప్పగా చెప్పారు" సీతరాజు నవ్వాడు. ఆ నవ్వులో వ్యంగ్యం తొణికినట్టయింది మూర్తికి. అయినా మరేం మాట్లాడలేదు.

"నాకు ప్రత్యేకించి ఓ రూమ్ కావాలి. మీ ఎరికలో వుంటే చూడండి! ఆ విషయం చెబుదామనే వచ్చాను" అన్నాడు మూర్తి.

"ఏం? ఇప్పుడున్న రూమ్ బాగా లేదా?" అనడిగాడు సీతరాజు.

"నేనింతో అంతో రచయితగాణ్నండీ! అప్పుడప్పుడూ ఏదో గెలుకుతూంటాను. రాసుకోవడం ఆ రూంలో కుదరడంలేదు.



అంతా అల్లరి చిల్లరగా వుంది"

"అయితే మా ఇంట్లో ఓ రూమ్ ఖాళీగా వుండాలి..." అంటూ మధ్యలో ఆగిపోయాడు సీతర్రాజు.

"ఎక్కడైనా సరే! ప్రశాంతంగా వుంటే చాలండి"

"మా ఇంట్లో ఎవరున్నారు? నేనూ, అరుణా! అంతే!
ఎంతో మంది ఆ రూంని అడిగేరు. నేనివ్వలేదింతవరకూ. కారణం ఆడపిల్ల ఒంటరిగా వుంటుంది. అల్లరి పాలవడం ఇష్టంలేదు"

ఇబ్బంది ఫీలయ్యాడు మూర్తి.

"మీరంతగా కావాలంటున్నారు కాబట్టి నేను సహాయం చేయక తప్పదు. అద్దె మీ ఇష్టం! ఇస్తే ఇవ్వండి. లేదా అక్ఖర్లేదు. మీరుంటానంటే కాదనను" అన్నాడు మళ్ళీ సీతర్రాజు.

మూర్తి ముఖం విప్పారింది.

"రూమ్‌చూద్దురుగాని రండి'' అన్నాడు సీతర్రాజు.

మూర్తి బయల్దేరాడు.

అరుణ గుమ్మం దగ్గరే ఎదురై పలకరించింది.

తాళంచెవి తీసుకొచ్చాడు సీతర్రాజు. తలుపులు తీసి రూమ్ చూపించాడు.

రూమ్ పెద్దదిగా లేదు. ఫర్వాలేదు-సదుకోవచ్చునన్నట్టుగా వుంది. వంట చేసే ప్రసక్తి లేదు గనుక, పడుకోవ

కాపీని రాసుకోవడానికి హాయిగా వుంటుందనిపించింది.

"బాగుందండి! అద్దె చెప్పండి" అనడిగాడు మూర్తి.

సీతన్రాజు నవ్వాడు.

"చెప్పాగా! ఇస్తే ఇవ్వండి, లేదా లేదు. అయితే చిన్న షరతు! మీ వానరమూకను మాత్రం ఇక్కడికి రానివ్వకండి''

తలూపి, నవ్వాడు మూర్తి.

"భోజనానికి రండి" ఆహ్వానించింది అరుణ. బిత్తరపోయాడు మూర్తి.

"లేదండి! నేను హోటల్లో భోంచేస్తాను"

"చూడు నాన్నా! పిలుస్తే బెట్టు చేస్తున్నారు"

"రండి బాబూ! ఇక మనం మనం ఒకటి. మొహమాటాలు వుండకూడదు" అన్నాడు సీతన్రాజు.

తప్పింది కాదు. భోజనాలు అయిన తర్వాత తనఖర్చుతో సినిమా ప్రోగ్రాం వేశాడు మూర్తి. అరుణని కూడా రమ్మన మన్నాడు. తండ్రీకూతుళ్లు ఇద్దరూ అంగీకరించారు.

* * *

పాత రూంకి వెళ్లి అందర్నీ పలకరించాలనిపించింది మూర్తికి. తీరా వెళ్తే నిద్ర సీన్లో వున్నారంతా. మూర్తిని చూసి లేచికూర్చున్నారు తర్వాత.

వున్నట్టుండి చక్రవర్తి—

"ఏమీ బహుకాల దర్శనం! మేము ఈ ఈనాటికి గుర్తొచ్చామా?" అన్నాడు.

"నోర్మూయ్!" విసుక్కున్నాడు మురళి.

"నీ లీలా మానుష లీలలు ప్రవచింపుము నాయనా!" వాసు వంత పాడేడు.

"చెప్తుంటే మీక్కాదురా" రెట్టించి అరిచాడు మురళి.

తమాషాగా తయారయింది పరిస్థితి. మూర్తికి నవ్వు తోసుకు వస్తోంది.

"ఒరే! వీళ్ళకి నాటకాలంటే గొప్ప మోజుగా వుంది. ఓ నాటకం ఆడి చూద్దామా?" అనడిగాడు మురళి.

"తప్పకుండా చూడుము. మేము బహుచక్కగా రక్తికట్టించెదము" అన్నారిద్దరూ.

మూర్తి తనివితీరా నవ్వుకున్నాడు.

"నిజంరా మూర్తీ! నాటకం వేద్దాం" వాసు ప్రాధేయ పడ్డట్టుగా అన్నాడు.

"నిజం గురూ! వేసి మన తడాఖా చూపిద్దాం" చక్రవర్తి కుతూహలం చూపాడు.

"ఏ నాటకం?" మూర్తి అడిగాడు.

'' ఏ నాటకమా? ఇంకొకరిది మనం ఎందుకు వెయ్యాలి! నువ్వేరాయి. నువ్వు రాసిందే వేద్దాం. ఇంకొకడిదైతే మానుకుందాం" మురళి వుత్సాహం చూపాడు.

మూర్తికి ఎందుకో ఈ పథకం బాగున్నట్టనిపించింది. కొద్దిగా మొగ్గాడు.

ఇంతలో సత్యం వచ్చాడు కృష్ణారావుతో కలసి. వాళ్ళిద్దర్ని కూడా సంప్రదించారు. అందరికీ అమితోత్సాహంగా వుంది. సరదాగా వేయాలనుకొంటున్నారు.

"మీరు రడీ అంటే నేనూ రడీ! డబ్బులు ఖర్చంటే నా వాటా నేనిస్తాను'' అన్నాడు సత్యం.

"చేతి చమురొద్దు గురూ! టిక్కెట్టు పెడదాం. లాభాలు రాకపోయినా, నష్టాలు రాకపోతే చాలు. ఇలా అయితే కొంత వూసూ పోతుంది. తర్వాత అనుభవం సంపాదిస్తే పరిషత్తు లెవల్లో వెళ్లి ఆడొచ్చు" మురళి మాట కలిపాడు. మూర్తిని చూశాడు 'ఏమంటావు' అన్నట్టుగా.

మూర్తి 'సరే' నన్నట్టుగా తలూపాడు.

"మీరంతా ఓకే అంటే నేనూ ఓకే! నేరాసిందే ఓ నాటకం వుంది. వేద్దాం! నేను డైరక్షన్ చేస్తాను" అన్నాడు.

ఉద్రేకం ముంచుకొచ్చింది. మిత్ర బృందానికి. అందరూ "జై" అన్నారు ఒక్కసారిగా.

"నాటకం వేయడమంటే తమాషా కాదు. ఇలాంటివి నేను చాలా చూశాను. అనుభవంతో చెప్తున్నాను. ముందు ముఖ్యంగా డబ్బు వుండాలి. తర్వాత నటించే స్థాయి, ఉత్సాహం వుండాలి. హీరోయిన్ వుంటుంది గదా! దాన్తో జాగ్రత్తగా మసలాలి. ఇవన్నీ ఓ ఎత్తు-తెరవెనుక పనిచేసే వాళ్లతో సఖ్యంగా వుండడం ఓ ఎత్తు. వాళ్లతో ఏమాత్రం అజాగ్రత్తగా ప్రవర్తించినా నాటకం అభాసు పాలవుతుంది. ఏదో సరదాగా వీధినాటకం వేయడం అయితే ఫర్వాలేదు. టిక్కెట్లు పెట్టి ప్రదర్శిస్తున్నాం అంటే బాగుండకపోతే చెప్పుచ్చుకు కొడతారు" అన్నాడు మూర్తి.

సత్యం కూడా అదే అన్నాడు.

"అవును గురూ! నిజమే" అన్నాడు వాసు.

"హీరోయిన్ని అనుభవంవున్నదాన్ని పిలిస్తే చాలా ఛార్జి చేస్తుంది.ఎంత లేదను కొన్నా అయిదారు వందలు గుంజుతుంది. కాబట్టి కొత్త అమ్మాయిని ఎన్నుకొంటే ఖర్చు తగ్గుతుంది" అన్నాడు మూర్తి.

మూర్తికిదికొంచెంలాభసాటివ్యాపారంలా కన్పిస్తున్నది. ఇదిలా సక్సెస్ అయితే డ్రామాకంపెనీ పెట్టుకొని బతుకుబండిని లాగించవచ్చునని ఆలోచిస్తున్నాడు.

అంతా మూర్తి మాటల్ని కిందా మీదా ఆలోచించారు. తర్వాత మరికొంత మంది మనుషులు అవసరమని తెలుసుకొని, కొత్త వాళ్ల కోసం గాలించాలనుకొన్నారు.

భోజనాల వేళయింది. తలోదారీ పట్టారు.

మూర్తి తన రూమ్వైపు దారి తీశాడు.

వీధంతా నిర్మానుష్యంగా వుంది. తాళం తీసి లోనికివెళ్లాడు.

ఆ పాత రూంలోనైతే ఏదో కొంత ఎప్పుడూ రాసుకునేవాడు. ఇప్పుడు అసలు లేదు. వారం రోజులై ఏమీ రాయ లేదు. ఎంతసేపూ హోటల్కీ, పాత రూమ్కీ, రోడ్లంట తిరిగి రావడానికీ కాలం వెళ్లిపోతోంది. లేదా అరుణతో వూక దంపుడు కబుర్లతో కాలక్షేపం అవుతోంది.

నిద్ర వస్తోంది మూర్తికి. పడుకుందా మనుకున్నాడు. తలుపు వోరగావేసి కళ్లు మూసుకున్నాడో లేదో నిద్రాదేవత ఆవరించేసింది.

మెలుకువ వచ్చేసరికి అరుణ గదిలోని పుస్తకాల్ని సర్దుతూ కన్పించింది.

కళ్లు బాగా విప్పార్చి చూశాడు.

అరుణ నవ్వుతోంది.

"లేవండి! కుంభకర్ణుడిలా ఎంత నిద్ర తీస్తారు" అంది.

ఆ మాటలకి నవ్వి లేచాడు మూర్తి. వెళ్లి కాళ్లూ, చేతులూ, మొహంకడుక్కొని వచ్చాడు.

అరుణ కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకాన్ని చదువుతోంది.

"బయటకి వెళ్తున్నారా?" అంది అతని కళ్ళల్లోకి చూస్తూ.

"లేదు. చదువుకో" అన్నాడు తల దువ్వుకొంటూ మూర్తి.

"ఇదుగో నవల చదువుతున్నాను. చాలాబాగుంది" అందిఅరుణ కళ్లింతలుగా చేస్తూ.



"అలాంటివి నువ్వు చదవకూడదు. పాడయిపోతావు. ఈ పుస్తకం చూడు. చదివి అభిప్రాయం చెప్పు" అంటూ ఓ పుస్తకాన్ని అందించాడు.

'పగిలిన హృదయాలు' ఆ పుస్తకం పేరు. దాని రచయిత మూర్తే. దానిని ఇప్పటికి నాలుగైదుసార్లు చదివింది అరుణ. ఆ విషయాన్నే చెప్పింది. తర్వాత మళ్ళీ–

"ఇదో చెత్త నవల" అంది.

"ఆడవారి మాటలకి అర్థాలు వేరులే అన్నారు పెద్దలు! కాబట్టి నువ్వు చెత్త అంటే చాలా గొప్పది అని అర్థం" విడమర్చాడు మూర్తి. ఈ వారం రోజుల్లో చాలా సన్నిహితమైంది అరుణ.

"బోడి" అంది అరుణ నాలుక బయట పెట్టి వెక్కిరిస్తూ. నవ్వాడు మూర్తి.

"ఈవాళ ఫస్ట్‌షోకి వెళ్దాం! వస్తారా?" అంది అరుణ పుస్తకాల్ని వరుసగా పేరుస్తూ.

"ఈ రోజు వద్దు. రేపు వెళ్దాం. అయితే ఓ షరతు. మీ నాన్న మనతో రాకూడదు" అన్నాడు మూర్తి.

"అమ్మ దొంగా" అంటూ అరుణ చీర కొంగుతో అతని ముఖాన్ని కప్పింది. కొంగు మించే అతని బుగ్గని ముద్దు పెట్టుకొంది.



మూర్తి ఆమెను వళ్ళోనికి లాక్కొన్నాడు.

"మా నాన్న దయవల్లే మనమిలా వున్నాం! లేకపోతే నువ్వెవరివో, నేనెవరినో" అంది అరుణ.

"నిజమే. కాదన్న దెవరు?"

"మీరే"

"క్షమించయితే" అన్నాడు.

"క్షమించను! ముద్దు పెట్టుకొంటాను" అరుణ అతని ముఖాన్ని ముద్దుల్తో ముంచెత్తింది.

"ఈ విషయం మీ నాన్నకి తెలుసా?" సంశయంగా అడిగేడు మూర్తి.

"ఎందుకు తెలీదనుకొంటున్నారు" మూతిని సున్నాలాచుట్టి అరుణ వెళ్ళింది.

ఆలోచిస్తూ కూర్చున్నాడు మూర్తి.

మొన్న సినిమాలో అరుణ ప్రవర్తనంతా కళ్ళకు కట్టినట్టుగా వుంది. అరుణ తనంత తానుగానే మూర్తిని దగ్గరగా రానిచ్చింది. చేతుల్లో చేయి కలిపింది. గిచ్చింది.

సీతారాజు ఎక్కడ చూస్తాడోనని ఓ పక్క భయం. ఇటుఅరుణ చిలిపి చేష్టలు!

భరించలేకపోయాడు మూర్తి. కాని, ఆ మర్నాడు ఉదయమే ఆమె కావాలనే మూర్తికి చేరువయింది. కాదనలేదు అతడు. వలచి వచ్చినదాన్ని పొమ్మనడం భావ్యం కాదనుకొన్నాడు. అందుకే ఆమెను అక్కున చేర్చాడు. దీని వెనుక తండ్రి ప్రోత్సాహం వుందా అని అనుమానించాడు. వుంటే ఎందుకుంటుందని ఆలోచించాడు.

చాలా చిన్న వయసులో పెళ్ళయింది అరుణకి. అపుడే భర్త పోయాడు. మహా వుంటే ఆమె వయసు ఇరవైకన్నా ఎక్కువ వుండదు. కోరికలు అణుచుకోలేకపోతోంది. చెడతిరిగితే అప్రతిష్ట! అందుకని ఏరి కోరుకొని తనని ఆహ్వానించారన్పించింది.

ఆడదాన్ని రెండో పెళ్ళి చేసుకోవడానికి ఈ వెధవ దేశంలో ఎవరూ ముందుకు రారు. అటువంటప్పుడు విచ్చలవిడి వయసుకు అడ్డు ఎలా యేర్పడుతుందనుకొన్నాడు.

అయితే అరుణ ఆ విధంగా ప్రవర్తిస్తుందని ఆశించలేదతను. అయినా ప్రవర్తిస్తోంది. ఆ వయసులో గుట్టు బయట పడకుండా వుండే అవకాశం వుంటే ఏ ఆడదైనా తనంతతానుగానే చొరవ తీసుకొంటుందేమో! వయసు ప్రభావం అది! కాదనడానికి వీల్లేదు. అందుకని తగిన వ్యక్తి దొరికితే సంతోషంగా వుంటుంది.

—మూర్తి ఆలోచనలకి ఆనకట్ట లేకపోతోంది. అయితే తండ్రి ప్రోద్బలం లేదని వూహించలేక పోతున్నాడు. తనతో కావాలని పరిచయం చేసుకోవడం, ఇంటికి భోజనానికి పిలవడం, రూమ్ అద్దెకివ్వడం – ఇవన్నీ సీతారాజు ముందు జాగ్రత్తగా ఆలోచించే చేశాడన్పించింది.

కొంపదీసి పెళ్ళి ఏర్పాట్లు చేస్తున్నాడా అన్పించి జడుసుకొన్నాడు మూర్తి.

తనీ స్థితిలో ఎవర్నీ పెళ్ళి చేసుకోలేడు! ఆ ప్రస్తావన గనుక వస్తే తెగేసి చెప్పేయాలనుకొన్నాడు.

అరుణ కాఫీ తీసుకొచ్చింది.

"నాన్నకూడా కాఫీ తీసుకుపోయి అందించాలి! అట్నుంచి అటే కాలేజీకి వెళ్లొస్తాను" అంది.

"ఎంతసేపట్లో" కొంటెగా ప్రశ్నించాడు.

అరుణ సిగ్గుగా తల దించుకుంది.

కాలి బొటన వేలితో నేలపై సున్నాలు చుడుతోంది.

అంత అందంగా వుండదు అరుణ. కాని వయసుకి తగ్గ వంపుల్తో అందంగానే కన్పిస్తుంది. కొంచెం లావు కావటంవల్ల పొట్టిగా అనిపిస్తుంది.

ఆమెను చూస్తూ కాఫీ తాగాడు మూర్తి.

"నేను నీ కూడా వస్తాను" అన్నాడు.

ఫ్లాస్కులో కాఫీ పోసుకొని వచ్చిందామె. మూర్తి రూముకి తాళం వేశాడు. తాళంచెవి ఆమె చేతికందించాడు.

"నాకన్నా మీరే ముందు వస్తారేమో"

"రాను. రాత్రి చాలా పొద్దుపోతుంది వచ్చేసరికి" అన్నాడు.

బయల్దేరారు ఇద్దరూ. అతణ్ని ఆనుకొని మరీ నడుస్తోంది అరుణ.

సారాయి దుకాణం దగ్గరికి వచ్చారు. రద్దీగాలేదు. తండ్రికి ఫ్లాస్కు అందించి బయటకి నడిచింది అరుణ. అనుసరించాడు మూర్తి.

ఆ ఇద్దర్నీ చూస్తూ సంతోషించాడు సీత్రాజు.

ఆమెను కాలేజీకి వెళ్ళిరమ్మని చెప్పి పాత రూమువైపు వెళ్లాడు మూర్తి.

రూంలో వాసు తప్ప ఎవరూలేరు. కారంబోర్డ్ ఒక్కడే ఆడుకొంటున్నాడు వుబుసుపోక. మూర్తిని చూసి సంతోషంగా—

"రా గురూ! ఎవడొస్తాడా అని చూస్తున్నాను. ఓ చెయ్యి వెయ్యి" అన్నాడు.

బోర్డు ముందు కూర్చున్నాడు మూర్తి.

అరగంట గడిచింది. తర్వాత—

మిడతల దండులా ప్రవేశించారు మందంతా. మొత్తం తొమ్మిది మంది వచ్చారు - నాటకం గురించి చర్చించడానికి.

"ఏ నాటకం వేద్దాంట?" అనడిగారు.

"గురుడు చెప్తాడు వినండి" అన్నాడు వాసు. సరేనన్నారందరూ.

"నేను రాసిన నాటకం 'దోపిడీ' అనేది వుంది. మీకు నచ్చితే అదే వేద్దాం! ఈ సమాజంలో 'దోపిడీ' ఏ రకంగా జరుగుతూందో వివరించే ఇతివృత్తం అది. హీరోయిన్‌తో కలుపుకుని ఆరు కేరక్టర్స్ వున్నాయందులో"

"ముందు మనం దోపిడీకి గురి కాకుండా చూడు" చక్రవర్తి తల గోక్కుంటూ అన్నాడు.

"నా వుద్దేశంలో నష్టంరాదు! అయితే రెండువేల రూపాయలు ఖర్చవుతుంది. ముందు కొన్ని టిక్కట్లు అమ్ముదాం. తొమ్మండుగురం వున్నాం. ఆ పాటి చేయగలం. థియేటర్ దగ్గర అమ్మకం జరిగినా జరక్కపోయినా ఫర్వాలేదు. కాబట్టి భయపడనవసరంలేదు. పోతే హీరోయిన్ కావాలి. చాలా తక్కువ మరీ తక్కువగా వచ్చే హీరోయిన్ కావాలి"

"వూరకనే వస్తే బాగుణ్ను"

"ఎవరొస్తారు? కర్రికుక్క కూడా రాదు"

"అరుణ వేస్తుందేమో కనుక్కోరా! మనిషి కూడా ఫర్వాలేదు" చక్రవర్తి ఉత్సాహంగా అడిగాడు మూర్తిని.

"చెప్పుచ్చుకు కొడుతుంది ముందు. తర్వాత రూమునుండి గెంటిస్తుంది".

"అయిడియా! నాకో అమ్మాయి తెలుసు. వెళ్ళి మాట్లాడదామంటే మాట్లాడదాం" అన్నాడు కృష్ణారావు.

"పేరు చెప్పవోయ్! వెళ్ళి వప్పించుకు తీసుకొస్తాం" డంభాలు పలికాడు వాసు.

"ఎవరు?" మూర్తి అడిగేడు.

"సావిత్రి! నంబర్ వన్ కాల్‌గర్ల్! ఏవేవో కొన్ని నాటకాలు వేసిందట. తర్వాత ఛాన్సులు మరి దొరకలేదు. మానుకుంది. మనం అవకాశమిస్తే తప్పకుండా వొప్పుకొంటుంది"

"ఛార్జి ఎంత చేస్తుందో?"

"ఆ విషయం నాకు తెలీదు. చాలా తక్కువకే వస్తుందనుకుంటాను. మనం ముందు లిఫ్ట్ ఇస్తే తర్వాత్తర్వాత మిగతా నాటకాలకి కూడా పనికొస్తుంది"

"అయ్య బాబోయ్! అదే హీరోయిన్ అయితే నేను యాక్ట్ చెయ్యను. నేను కాదుకదా ఎవరూ చెయ్యరు. అదసలే నంబర్‌వన్ సాని! మనం కక్కుర్తి పడక తప్పదు. తర్వాత రోగాలూ.... రొచ్చులూ..." చక్రవర్తి ఏడుపు మొహం పెట్టాడు.

"నోరు ముయ్యరా!" గదమాయించాడు వాసు. చక్రవర్తి తమాషాగా నోరు మూసుకొన్నాడు.

"సరే. అయితే తప్పకుండా మాట్లాడదాం. ముందు ఛార్జి ఎంతో తెలుసుకోవడం బెటర్. తర్వాత కనీసం ఇరవై రోజులైనా రిహార్సల్స్‌కి రావాలి. రాత్రి పూటే రిహార్సల్స్. కాబట్టి, వ్యాపారాన్ని



కాలదన్నుకొని మనం ఇచ్చే బోడి డబ్బుల కోసంవస్తుందంటావా!" మూర్తి విశదంగా అడిగేడు.

"వస్తుందని నాకు బాగా నమ్మకం గురూ! ఆ అమ్మాయికి ఆ వృత్తి నచ్చట్లేదు. కాకపోతే కడుపు జరక్క చేస్తోంది కాని, లేకపోతే మానేసే రకం. హీరోయిన్ ఛాన్స్ వదులుకోదు. కొద్దిగా పేరొచ్చిందంటే గుడ్డిలో మెల్ల నయం గదా అనుకొని ఈ రూటునే పట్టుకొంటుంది" కృష్ణారావు నచ్చజెప్పాడు.

"ఆలోచిద్దాం అయితే" అన్నాడు సత్యం. మిగిలిన వాళ్లెవ్వరూ మాట్లాడ లేదు మరి.

నాటకానికి పెట్టుబడిదార్లు - మూర్తి, సత్యమే! అందుకే గొడవంతా తాము పడితేనే అదే బెస్ట్ అనుకొన్నారంతా.

"ఇప్పుడు వెళ్దామా?" అనడిగాడు కృష్ణారావు.

రాత్రి పది గంటలయింది. ఆ సమయంలో అక్కడికి వెళ్లడం మంచిది కాదనుకొన్నారు.

ఉదయం వెళ్దామని నిశ్చయించుకొన్నారు.

"మేం కూడా వస్తాం" సరదాపడ్డాడు వాసు.

"అంత మంది ఎందుకు? అనవసరం. నేనూ, సత్యం, కృష్ణారావూ వెళ్తాం" అన్నాడు మూర్తి.

వాసు, చక్రవర్తి చిన్నబుచ్చుకున్నారు.

'నిజమే' అన్నారు మిగతా వాళ్లు. తర్వాత విడిపోయారు.

చాలా రోజులకి మూర్తి కన్పించాడు.

పద్మకి సంతోషంగా వుంది. గుమ్మం దగ్గర నిలబడి ఎదురు చూస్తోంది అతని రాకకోసం.

మూర్తి నవ్వాడు ఆమెను చూసి.

ఉదయాన్నే మూర్తి, సత్యం, కృష్ణారావు సావిత్రి ఇంటికి వెళ్లారు.

అదంతా సానివాడ. అమ్మాయిలు వస్తోన్న ముగ్గుర్నీ వింతగా చూస్తున్నారు- 'ఉదయం పూట సరసాలేమిటా' అని. అందులో ఇద్దరు వాళ్లకి చిరపరిచితులే! మూర్తి ఒక్కడే వాళ్ళెరుగనివాడు.

ఓ ఇంట్లోకి వెళ్ళారు. ముందుగా అక్కడి ముసలమ్మ వచ్చి పలకరించింది. చాప వేసి కూర్చోమంది. పక్కగా హార్మోనియం పెట్టె పడివుంది.

"సావిత్రి వుందా?" అనడిగాడు కృష్ణారావు.

"పంపించమంటారా" అంది వయ్యారాలుపోతూ ముసల్ది. తర్వాత పిల్చుకు రావడానికి వెళ్లింది.

"ఇదీ తంతు" అన్నాడు కృష్ణారావు.

నవ్వాడు మూర్తి.

అక్కడి వాతావరణానికి అలవాటు పడ్డవాడిలా నిశ్శబ్దంగా కూర్చున్నాడు సత్యం.

సావిత్రి వచ్చింది. అంత పొడవుగా లేకపోయినా సమాన ఎత్తులో వుంది. జబరుగా బాగానే వుంది. నల్లని శరీరం. కృష్ణారావు ఆమెను చూసి -

"వీడే మా డైరక్టర్! నిన్న నీకు చెప్పాగా" అన్నాడు.

నమస్కారం చేసింది సావిత్రి.

ప్రతి నమస్కారం చేస్తూ-"ఏ ఊరు మీది?" అనడిగాడు మూర్తి.

చెప్పిందామె.తల వంచుకొని కూర్చుంది తర్వాత.

"మేం ఓ నాటకాన్ని టేకప్ చేద్దామను

కొంటున్నాం. ముందు బాగా వస్తే తర్వాత తర్వాత పరిషత్తులకు వెళ్ళాలన్న వూహ వుంది. నీ గురించి కృష్ణారావు చెప్పాడు. అందుకని మాట్లాడదామని వచ్చాం!" అన్నాడు మూర్తి ముక్తసరిగా.

సరేనందామె.

"ఇంతకు ముందు నాటకాల్లో నటించావా?"

నటించానందామె.

"పాటలు పాడగలవా?"

"పాడగలను. ఆ హార్మోనియం నాదే. కొన్నాళ్ళు బాగానే సాధన చేశాను. తర్వాత అదీ మూల పడింది."

"హీరోయిన్‌కి ఛార్జి ఎంత చేస్తావు?"

"నేను 'ఇంత' అని చెప్పలేను. మీ ఇష్టం. మీరెంత ఇస్తే అంతే" అంది నమ్రతగా సావిత్రి. మాట్లాడుతున్నప్పుడు ఆమె చెవి రింగులు అటు ఇటు కదలాడుతున్నాయి.

"నూట ఏభై కన్నా ఎక్కువ ఇచ్చుకోలేం. ఎందుకంటే కేవలం డబ్బు సంపాదన కోసమే మేమీ నాటకం ఆడట్లేదు. మాకందరికీ సరదాగా వుంది వెయ్యాలని. దానికోసం ఇదంతా! ఆలోచించి చెప్పు"

"రెండొందలు ఇప్పించండి" సావిత్రి మూర్తి కళ్ళల్లోకి చూసింది.

"ఆలోచిద్దాం. పోతే ఇరవై రోజుల పాటు ఠంచన్‌గా రిహార్సల్స్‌కి హాజరు కావాలి. రాత్రి ఏడు నుండి పది గంటల వరకూ చెయ్యాలి"

మూర్తి మాటలకి సావిత్రి బెదురుగా చూసింది.

"నా గురించి మీకు బాగా తెలుసు. అటువంటప్పుడు అంత రాత్రి వరకూ వుంచేస్తారంటే భయంగా వుంది" అంది.

బాధపడ్డాడు ఆమె మాటలకి మూర్తి.

"నీకా భయం అక్కర్లేదు. నిన్నెవ్వరూ ఏమీ చేయరు. కో ఆర్టిస్ట్‌గా నిన్నంతా గౌరవించేటట్టు నేను చూస్తాను" హామీ ఇచ్చాడు మూర్తి.

"మీరలా అంటే నాకేం భయం లేదు! తప్పకుండా వస్తాను" అంది సావిత్రి.

"రెండు పాటలు పాడి వినిపించు" అన్నాడు కృష్ణారావు.

సావిత్రి హార్మోనియం దగ్గరగా వెళ్ళింది. దానిమీది దుమ్ము దులిపింది. చాలా రోజులైంది అది వాడక.

రెండు త్యాగరాజ కీర్తనలు పాడి వినిపించింది. కంఠం శ్రావ్యంగా వుంది.

"అడ్వాన్సు కావాలా?" అనడిగాడు మూర్తి లేచి వెళ్తూ.

"మీ ఇష్టం" అంది సావిత్రి తలుపు దగ్గరగా నిలబడి.

ఓ ఏభై రూపాయలు తీసి అందించాడు మూర్తి. డబ్బునుజాకెట్లో దాచింది. వాళ్ళు చూస్తుంటే నవ్వింది.

ముగ్గురూ బయటకి నడిచారు.

"నచ్చిందా?"అనడిగాడు కృష్ణారావు.

"ఏమిటి" కోపగించుకున్నాడు మూర్తి. మళ్ళీ కృష్ణారావు ఏదో చెప్పబోయేలోగా—

"హీరోయిన్ అందంగా వుండాలని ఏం లేదు. గ్లామర్ కాదు కావల్సింది. నటన కావాలి. అదెంత వరకూ వుందో తెలుసుకొంటే అప్పుడు చూడొచ్చు" అన్నాడు మూర్తి.

రూముకి వెళ్ళి చక్రవర్తికీ, వాసుకి చెప్పారు.

"సావిత్రిని మాట్లాడాం! అడ్వాన్సు కూడా ఇచ్చేశాం.ఇక మనం ఎవరి స్క్రిప్ట్ వాళ్ళు రాసుకొని బై హార్ట్ చేసేస్తే మంచిది"

"మేం రడీ గురూ!" అందరి తరఫునా వకాల్తా పుచ్చుకొన్నాడు చక్రవర్తి.

హోటల్లో భోజనంచేసి రూంకి బయల్దేరాడు మూర్తి. రూమ్ ముందు కమల కన్పించింది.

"ఎప్పుడొచ్చావు?" అనడిగాడు నవ్వుతూ.

సమాధానంగా నవ్విందామె. తర్వాత మరేం మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

తాళం తీసి లోనికి వెళ్లాడు. నిద్ర ముంచుకొస్తోంది;నిద్రపోవాలనుకొన్నాడు మూర్తి.

సీతన్రాజు అప్పుడే భోజనానికి ఇంటికొచ్చాడు. కమలని చూసి -

"ఎప్పుడొచ్చావు?" అనడిగాడు.

చెప్పింది కూతురు.

"ఆ అబ్బాయి రూముకి అద్దె ఎంత?" కమల నిగ్గదీసింది తండ్రిని. భోజనం చేస్తోన్న సీతన్రాజు అయోమయంగా చూశాడు.

"మాట్లాడుకోలేదా వివరాలు? ఏం?"

"ఏం లేదు! మనిషి మంచివాడా కాదా అని? మనుషుల్ని
ఏరేరి అద్దెకివ్వాలి నాన్నా! ఎందుకంటే అరుణ ఒక్కతే ఇంట్లో ఉండేది. ఏ బుద్ధిపుట్టి ఏ అఘాయిత్యం చేస్తాడోనని ఆలోచించాలి"

సీతన్రాజు నవ్వాడా మాటలకి.

"ఆలోచించే పెట్టాను. అబ్బాయి ఇష్టపడాలేగాని, అమ్మాయిని ఇవ్వడానికి మనం వ్యతిరేకిస్తామా?" అంటూ వివరించాడు. అంతా విన్న కమల ముఖం ఆశ్చర్యంగా విప్పారింది.

"ఏమో! చెల్లిని పెళ్లి చేసుకొనే సాహసం చేస్తాడంటే నేను నమ్మలేక పోతున్నాను. ఈ రచయితలన్నా, నటులన్నా నమ్మశక్యం కాదు"

"ఏం ఫర్వాలేదమ్మాయ్!"

"దాని జీవితం బాగుపడితేసంతోషమే. చెడిపోతే బాధపడ్డంకన్నా ముందు జాగ్రత్తలు తీసుకోవడం మంచిదని..."

"ముందు జాగ్రత్తలు ఆలోచించి ఏం చెయ్యలేం! నువ్వుచూడు. లక్షణంగా ఉంటావు. అయినా కట్నం తీసుకోకుండా పెళ్లి చేసుకొన్నాడా మీ ఆయన. సరే - పెళ్లి చేసుకొని నిన్నేరకంగా సుఖపెడుతున్నాడంటావు ? ముందూహించామా మనం చెప్పు! అంతే అరుణ జీవితం కూడా. ఏవేవో వూహిస్తూ అన్నీ చేస్తున్నాను. అదో దారినపడితే నాకు సంతోషంగా ఉంటుంది. అందుకే చదువంటున్నాను....మళ్ళీ పెళ్ళి అంటున్నాను" అన్నాడు సీతన్రాజు చేయి కడుక్కుంటూ.

కమల ఆలోచిస్తూ కూర్చుంది. తండ్రి అరుణకి మేలుచేస్తాడా? కీడు చేస్తాడా? ఆలోచిస్తోన్న ఆమెని వాటేసుకొంది అరుణ ప్రేమగా.




రాత్రి రూములో అందరూ కలిశారు. 'దోపిడీ' నాటకం ముందు వేసుకొని కూచున్నారు. చక్రవర్తి అందరి పోర్షన్సూ కాపీ చేస్తున్నాడు. మురళి

అప్పుడే సిటింగ్ రిహార్సల్ మొదలెట్టాడు.

"నువ్వో కేరక్టర్ తీసుకోరా!" అన్నాడు మూర్తి సత్యాన్ని బలవంతం చేస్తూ.

"వద్దులేరా! నాకు స్టేజి ఫియర్ వుంది" అన్నాడతను. మరి మాటల్ని సాగదీయ్యలేదు మూర్తి.

"నాటకం ఎక్కడవేద్దాం?" చక్రవర్తి రాసుకొంటున్నవాడల్లా ఓ నిమిషం ఆగి ప్రశ్నించాడు.

"మన వూర్లో వేద్దాం! మనం అంతా కలసి నాటకం వేయబోతున్నామంటే సహాయం చేయకపోరు మనవాళ్లు. టిక్కెట్లూ అమ్ముడవుతాయి" అన్నాడు మూర్తి చక్రవర్తి మాటకి సమాధానంగా.

'కరక్ట్' అన్నారంతా. అందరి పోర్షన్స్ రాసేసుకొన్నాక మూర్తి స్క్రిప్ట్ తీసుకొన్నాడు. సావిత్రికి ఇవ్వాలది. ఆమె రాసుకొంటే సరిగ్గా మరో వారం రోజుల కల్లా రిహార్సల్స్ ప్రారంభిద్దామని ఆశిస్తున్నాడు. తర్వాత రూమువైపునడిచాడు.

రూముకి చేరుకునేసరికి రాత్రి పదకొండు గంటలైంది. సీతన్నాజు వాళ్లంతా గాఢ నిద్రలో వున్నారు. తాళం తెరచి లోనికి వెళ్లాడు. రాత్రి ఒంటిగంట వరకూ సావిత్రి కోసం పోర్షన్ రాశాడు. తర్వాత పడుకొన్నాడు.

తెల్లారింది—

తలుపు చప్పుడుకి లేచి కళ్లు తెరిచాడు మూర్తి. అప్పటికే ఎండ బాగా ఎక్కింది. వెళ్ళి తలుపులు తెరిచాడు. ఎదురుగా అరుణ నవ్వుతూ కన్పించింది.

"ఏమిటి ఇంకా నిద్రపోతున్నారు?"

"రాత్రంతా నాటకంలోని పోర్షన్ రాస్తూ కూర్చున్నాను. నిద్రలేదు" అన్నాడు.

చిందరవందరగా వుంది గది. మళ్లీ మామూలే! అరుణ పుస్తకాలు సర్ది వెళ్ళిపోయింది. తర్వాత కాఫీ తెచ్చి అందించింది.

"మీ నాన్న లేరా?" అనడిగాడు.

"ఆయనకి వుద్యోగం వుంది. మీలా బలాదూర్ మనిషికాదు తొమ్మిది గంటలకి లేవడానికి" అంది కవ్వింపుగా.

మూర్తి ఆమెను దగ్గరగా లాక్కొన్నాడు.

"రాత్రి ఎంతసేపో మీకోసం కాచుకూర్చున్నాను" అంది అరమోడ్పు కళ్ళతో.

"నాటకం వేస్తున్నామని చెప్పానుగా. దానికోసం ఎక్కడ లేని టైం చాలడం లేదు"

"తమరే వేషం వేస్తున్నారు?"

"నేను యాక్ట్ చేయడం లేదు. డైరక్షన్ చేస్తున్నాను. నీకేదైనా వేషం కావాలంటే చూడు—వేద్దువుగాని"

"అయ్య బాబోయ్! నాటకాలా? అవేవీ నాకొద్దు. సినిమాకి వెళ్దామా?"

"నీ ఇష్టం"

"అయితే రూములోనే వుండండి! ఎక్కడికీ వెళ్లిపోకండి. హాయిగా కాసేపు కబుర్లాడుకొని భోజనం చేసి వెళ్ళొచ్చు" అంది.

"ఎక్స్‌క్యూజ్‌మీ! చిన్న పనివుంది. వీలైతే భోజనానికొస్తాను. లేదా ఏకంగా సినిమాకే వస్తాను. మరోలా అనుకోకు" అన్నాడు ఆమె చెంప మీద సుతారంగా దెబ్బవేసి. కోపంతో తుర్రుమంది అరుణ.

నాటకాన్ని, పోర్షన్ని తీసుకొని రూముకి తాళం వేయకుండానే బయటకి నడిచాడు మూర్తి. సరాసరి సావిత్రి ఇంటి వద్దకు

వచ్చాడు.

ముసలమ్మ నవ్వుతూ రమ్మంది.

"సావిత్రిని పిలవండి. మాట్లాడాలి" అన్నాడు.

"సావిత్రి ఇక్కడ ఉండదు. ఆ ఇంట్లో" అంటూ మరి కొంచెం దూరంలో వున్న పూరిపాకను చూపించింది ముసలమ్మ. అక్కడికి వెళ్ళాడు. అయితే ఆ పూరి పాకల్లో కూడా రెండు మూడు పోర్షన్స్ వున్నాయన్పించింది.

ఓ వైపు సావిత్రి వుంటోంది. ఆ గది తలుపులింకా తెరుచుకోలేదు. వోరగా వేసి వున్నాయి. వెళ్ళామా, వద్దా అని ఆలోచిస్తున్నాడు మూర్తి. తర్వాత సాహసించాడు. సావిత్రి మంచి నిద్రలో వుంది. తలుపు చప్పుడుకి లేచింది.

మూర్తిని చూసి నవ్వి - "రండి" అంది.

"ఇంకా నిద్రేనా?" అనడిగాడు.

"రాత్రిపూట మేం చాలా బిజీ" అని నవ్వింది. పక్కనున్న కుర్చీని తుడిచి శుభ్రం చేసింది అతనికోసం.

ఓ వైపు మంచం, ఇంకో వైపు ఏవేవో గిన్నెలూ అవి...! మీద దండానికి వేలాడుతూ బట్టలు... బూజుపట్టిన మూలలతో చీదరంగా వుంది ఆ ప్రదేశం.

"మా బతుకులింతే. ఇలా చీదర చీదర కొంపల్లోనే మేం వుండాలి. లేకపోతే మంచి ఇల్లు దొరకవు కదా" అంది సావిత్రి అతన్ని గమనిస్తూ.

"రోజుకి ఎంత సంపాదిస్తావు సావిత్రీ" ఆమెను పరీక్షిస్తూ అడిగాడు మూర్తి.

"అలా చెప్పలేమండీ! ఒక్కోసారి ఓ పాసింజర్ కూడా రాడు. అటువంటప్పుడు పస్తు పడుకోవాలి. ఒక్కోసారి ఎక్కిరి తొక్కిరి! వంద పైబడి సంపాదిస్తాను. నిజానికి చెప్పాలంటే తినీతినని బతుకులు మావి"

"నీ జీవితాన్ని గూర్చి ఓ నాటకం రాద్దామని వుంది. ఏమనుకోకుండా వివరాలు చెప్తావా?"

చేతులెత్తి నమస్కరించింది సావిత్రి. ఆమె కళ్ళల్లో నీళ్ళు! ఆశ్చర్యపోయాడు మూర్తి.

"మా జీవితాలు స్టేజి ఎక్కడం మంచిది కాదు. మా బతుకులు ఇక్కడీ మురికి కూపంలోనే సమాధి కావాలి. అంతే తప్పా తేటతెల్లం జరక్కూడదు. అందరి లాగే మామూలు చరిత్రే నాది. విశేషించి చెప్పుకోదగ్గ వేమీ లేవు" అంది.

మూర్తి క్షణం ఆలోచించాడు-

"ఈ జీవితం అంటే అసహ్యంగా లేదూ? ఇక్కడినుండి బయటపడాలని లేదూ?"

"ఎందుకు లేదు. కాని ఆదరించే వాళ్ళేరి? అందరూ క్షణికోద్రేకంలో మమ్మల్ని పెళ్ళాడతామంటారు. శరీర సుఖం తీరిపోయిందంటే మళ్ళీ మామూలే. వెళ్ళిపోతారు. ఆ మాటలు నీటి మూటలయిపోతాయి.

"నాకూ ఇక్కడి బతుకంటే అసహ్యం. కాని బతక్క తప్పదు. బాధల్లోంచి కొంచెం బయట పడొచ్చునన్నట్టుగానే మీ నాటకాన్ని వొప్పుకున్నాను. కాసేపు కాలక్షేపం. లేకపోతే మీరిచ్చే డబ్బుని నేను కొన్ని గంటల్లో సంపాదిస్తాను" అంది.

మాటలు పొడిగించలేదు మూర్తి.

"నీ పోర్షన్ తెచ్చాను. చదివి చూడు" అన్నాడు అందిస్తూ.

అందుకొందామె. పది పేజీలు!


"ఎప్పట్లోగా కంఠస్థం చెయ్యాలి?"
"వారం రోజుల్లోగా! స్టాండింగ్ రిహార్సల్ నాటికి పక్కాగా వచ్చితీరాలి"
"అలాగే" అంది సావిత్రి.

మూర్తి లేవబోయాడు.

"ఉండండి. కాఫీ తాగి వెల్దురుగాని"

"వద్దు. ఇప్పుడే తాగి వచ్చాను"

"ఒప్పుకోను. మీరు కాఫీ తాగి వెళ్ళాల్సిందే"

తప్పింది కాదు మూర్తికి.

"మీరు రాసిన మిగతా నాటకాలు ఏమైనా వుంటే ఇవ్వండి. చదివిస్తాను" అతన్ని తదేకంగా చూస్తూ అడిగింది సావిత్రి.

తలూపాడతను.

ఎప్పుడు చెప్పిందో ఏమో పన్నెండేళ్ళ కుర్రాడొకడు ఫ్లాస్కుతో కాఫీ, మరేదో పొట్లం తెచ్చి సావిత్రికి అందించాడు. లోపలికెళ్ళి ప్లేటులో మైసూర్ పాక్ పెట్టి తెచ్చి అతనికి అందించిందామె.

"ఇవన్నీ ఎందుకు చెప్పు"అన్నాడు.

"ఏం! మాలాంటివాళ్ళ ఇళ్లల్లో మీరు తినకూడదా?" బాధపడింది.

ఫీలయ్యాడు మూర్తి.

"తినకూడదని కాదు. తినొచ్చానని చెప్పానుగా"



"ఏమైనా తినాల్సిందే!"

"లేదు సావిత్రీ! క్షమించు. కాఫీ ఇవ్వు చాలు"

కాఫీ గ్లాసులో పోసి అందించింది. కాఫీ తాగేసి వెళ్లడానికి సిద్ధపడ్డాడు.

"మళ్లీ ఎప్పుడొస్తారు?" అనడిగింది.

సమాధానం ఇవ్వలేదు. నవ్వి వెళ్ళిపోయాడు మూర్తి. బయటకి వచ్చిన తర్వాత చాలా మధనపడ్డాడు.

మరికొంతసేపు వుండాల్సింది. తొందరపడి వచ్చేనేమోననుకొన్నాడు.

తన డబ్బును ఆశించలేదు. తననీ ఆశించలేదు.తనను ఆమె అలా గౌరవంగా చూసుకొంటుంటే తనే తొందరపడి వచ్చేశాడు.

కుర్చీలో కూర్చుని సావిత్రిని గురించి ఆలోచిస్తున్నాడు మూర్తి.

ఆ మురికి కూపంనుండి సావిత్రిని బయటకులాగాలంటే ఖర్చు నెలకి కనీసం నూటఏభై అవుతుంది. అంత సొమ్మంటే చాలు. మర్యాదగా బతక గలుగుతుంది. లేదా ఎవర్నైనా పెళ్ళి చేసుకొన్నా బాగుణ్ను. హాయిగా జీవితాన్ని నెట్టొచ్చు!

ఆ అవకాశాన్ని ఆమెకు కలిగిస్తే!? ఈ జీవితాన్ని ఆమె అసహ్యించు కొంటోంది. ఆ అసహ్యం స్పష్టంగా తెలుస్తూనేవుంది. అయితే అవకాశమే అందుబాటులో లేదు.

ఒకవేళ బయటపడినా, సంఘం వెంటాడితే ఏంకావాలి ఆమె.

వేశ్యని సాటిమనిషిగా చూడలేని సమాజంలో ఆమె భవిష్యత్తు ఏమిటి?

చక్రవర్తి ఆవులించి లేస్తూనే మూర్తిని చూశాడు.

"ఎప్పుడొచ్చావు?" అనడిగాడు.

"చాలాసేపైంది"

"కాలేజీకి టైమవుతోందే" అన్నాడు గాబరాపడి అతని మాటలు విన్పించుకోకుండానే. తర్వాత అందర్నీ లేపి తెమలగొట్టాడు.

అంతా కాలేజీకి వెళ్ళిపోయారు.

మూర్తి ఒక్కడే గదిలో కాపురం వుండాలి. అదతడికి నచ్చలేదు. లేచి బయటపడ్డాడు.

దారిలో సత్యం కలిశాడు.

"ఎక్కడికి?" అనడిగాడు.

"అందరూ కాలేజీకి పోయారు. నేనేం చెయ్యాలి ఆ శ్మశానంలో? అందుకని వూరకనే తిరుగుదామని వచ్చేశాను"

"కృష్ణారావు వుంటాడేమో చూద్దాంరా! నాకక్కడ పనివుంది" అన్నాడు సత్యం. వాళ్ళింటికి వెళ్లారు.

కృష్ణారావు ఇంట్లోనే వున్నాడు.

"కాలేజీకి పోలేదా నువ్వు?" అనడిగాడు సత్యం.

"వెధవ చదువు లెద్దూ! సరదాగా కబుర్లాడండి" అన్నాడు కృష్ణారావు.

"మీ నాన్నంటే చూడు: డబ్బులు కావాలి"

"ఏం డబ్బులు?"

"మాకివ్వాలిరా బాబూ! అప్పుగా కాదు. మా దగ్గరే మీ నాన్న అప్పుగా తీసుకొన్నాడు" అన్నాడు సత్యం.

"నేన్నమ్మను"

"నమ్మకపోతే పో: సాయంత్రం మళ్లీ వచ్చి కలుస్తాం" అంటూ లేచాడు సత్యం. మూర్తి అతన్ని అనుసరించాడు. తర్వాత ఇద్దరూ కాసేపు కబుర్లాడుకొని విడిపోయారు.

సాయంత్రం ఆరు గంటలకి రూములో అందరూ సమావేశమయ్యారు.

నాటకాన్ని గురించి మాట్లాడదామను కున్నాడు మూర్తి. కాని వాళ్ళకి ఆ ధ్యాసే లేదు. సినిమా ప్రోగ్రాం వేశారు. మూర్తి రానన్నా పట్టుబట్టి లాక్కువెళ్లారు.

రాత్రి తొమ్మిదిన్నరకు రూముకి చేరాడు మూర్తి. తాళంచెవికోసం తలుపు పక్కగా వున్న గూడులో చెయ్యి పెట్టాడు.

తాళంచెవి లేదు.

రాత్రి ఎవర్నీ లేపి బాధపెట్టకుండా వుండడానికి తాళంచెవి ఆ గూడులో దాచుకొంటాడు. నిద్రపోతున్నవాళ్లని లేపడం బాధాకరం అన్పిస్తుందతనికి.

మరయితే తాళంచెవి ఎందుకు లేదో అర్థం కాలేదు.

అరుణతో సినిమా ప్రోగ్రాం వేసి-రానందుకు కోపం వచ్చింది కాబోలు ! తాళంచెవిదాచివుంటుందనుకొన్నాడు. వెళ్లి ఆ ఇంటి తలుపులు తట్టబోతూ గొళ్లెం వైపు చూశాడు.

లాక్ చేసివుంది.

అయితే తండ్రితో కలిసి సినిమాకి వెళ్లుంటుందని వూహించి పాత రూముకి మళ్లీ వెళ్లాడు మూర్తి.

రాత్రి అక్కడే పడుకున్నాడు.

ఉదయం దుకాణంలో సీతన్నాజుని కలిసి అడిగాడు.

"రాత్రంతా ఎక్కడికి వెళ్లారు?"

"కమల వచ్చింది. సినిమాకి వెళ్లాం. మీకోసం చాలా సేపు ఎదురు చూశాం. రాలేదు"

సరేనని రూముకి బయల్దేరాడుమూర్తి.

అరుణ ఇంట్లోనే వుంది. దగ్గరగా వెళ్లి చెవి మెలిపెట్టాడు.

"నాతో సినిమా ప్రోగ్రాం వేసి, నేను రాకుండానే వెళ్లిపోతావూ!" అనడిగాడు.

"మీలాంటి మాటలనకండి. వస్తానని చెప్పి మీరే రాలేదు" అంది ఎదురు తిరిగి.

"వచ్చాను. కాని మీరే తొందరపడి వెళ్లిపోయారు. పైగా తాళంచెవి కూడా తీసుకుపోయావు"

"లేకపోతే చెప్పిన మాట వినరని" అంది నవ్వి.

"ఏయ్!" కోపం నటించాడు.

"అక్క వచ్చింది. సినిమా అంది. వెళ్లక తప్పిందికాదు. నాకైతే ఇష్టం లేదు"

"అన్నీ అబద్ధాలే"

"మీరే అబద్ధాలు"

నవ్వుకున్నారిద్దరూ.

*   *   *

రిహార్సల్స్ ప్రారంభించారు.

ప్రత్యేకంగా ఓ పెద్ద రూముని అద్దెకు తీసుకొన్నారు. నెలకి వంద రూపాయలు అద్దె. ఒక నెలే గనుక అంతా భరిద్దామన్నారు.

హార్మోనిస్టును, తబలిస్టును, వయోలినిస్టును కూడా పురమాయించారు.

ఆ రోజు మొదటి రిహార్సల్. అందరూ ఏడు గంటలలోపే రావాలనుకొన్నారు. సావిత్రిని పిలుచుకురావడానికి కృష్ణారావును పంపారు.

ఓం ప్రథమంగా కొబ్బరికాయ కొట్టి పూజ చేశారు దేవుడికి.

సరిగ్గా ఏడు గంటలకు సావిత్రి వచ్చింది. మూర్తి కనబడగానే నమస్కారం చేసింది.

"మళ్లీ రాలేదు మీరు" అంది.

నిజమేనన్నట్టు మూర్తి తలదించుకొన్నాడు.

అవును. వెళ్లనే లేదు. తరచూ వెళ్లి

ఆమెలో ఏవేవో ఆశలు కల్పించకూడదనే వెళ్ళకూడదనుకొన్నాడు.

తనని ఆశిస్తే కాదనలేదు. కాదని ఆమెను నిరాశ పరచడం భావ్యం కాద నుకున్నాడు.

తనని ఎవరు ఆదరించినా ఏదో ఆశించే నన్నది అతడికి అనుభవాలు నేర్పిన గుణ పాఠాలు! అందుకనే స్నేహాలుఎక్కువగా పెంచుకోకూడదనుకున్నాడు. అదే సావిత్రిని కలుసుకోకుండా చేసింది అతన్ని.

సత్యాన్ని కేకేశాడు మూర్తి.

సావిత్రి డైలాగ్స్ గురించి కోచింగ్ ఇవ్వమన్నాడు. ఆమె డైలాగ్స్ చెబు తోంది.

వింటున్నాడు సత్యం. కాని సరిదిద్ద ట్లేదు. ఆమె ముఖాన్ని తన్మయంగా చూస్తున్నాడు. ఏమాత్రం అడ్డు చెప్పక కూర్చున్న అతన్ని చూసి-

"నేను కరెక్టుగానే చెప్తున్నానా?" అంది తనే చివరికి సావిత్రి.

సత్యం తెప్పరిల్లి "బ్రహ్మాండం" అన్నాడు.

"మీరసలు వింటున్నారా!" అంది నవ్వుతూ.

"ఎందుకు వినడంలేదు. మొద ట్నుంచీ శ్రద్ధగా వింటూనే వున్నాను"

అంతా గమనించి వాళ్ళ దగ్గరగా వచ్చాడు మూర్తి.

సావిత్రి అందంగా అలంకరించు కొని వుంది. కంచి జరీచీర కట్టింది. వెడ ల్పాటి జరీ అంచుకు తగినట్లు అంతే వెడల్పాటి జరీ అంచు వున్న జాకెట్టు వేసుకుంది. నిండుగా కన్పిస్తోంది.

నొసట గుండ్రంగా పెద్ద బొట్టు.

చేతులనిండుగా గాజులు.

ముత్తయిదువులా మెరిసిపోతోందను కున్నాడు మూర్తి.

రిహార్సల్స్ ప్రారంభించడానికి ముందు సావిత్రితో ప్రార్థన చేయించారు. తర్వాత మొదటి సీను రిహార్సల్స్ వేశారు.

అప్పటికే తొమ్మిది గంటలయింది. ఎంతసేపైనా అది ముగించితీరాలను కున్నారు.

పిచ్చివాడుగా మురళి నటిస్తున్నాడు. నాటకానుభవం లేనందువల్ల అతను సరిగ్గా నటించలేకపోతున్నాడు. ఒక్కో డైలాగ్ చెప్పడానికి భయపడుతున్నాడు.

మూర్తి అతన్ని సరిదిద్దడానికి తెగ ప్రయాసపడ్డాడు.

రాత్రి పదయింది.

మురళి నటనతో చాలా విసిగి పోయారు అంతా. ఇంకా ఎవరూ భోజ నాలు చేయలేదు. ఆకలి వేస్తోంది అందరికీ! దాంతో ఆపేశారు రిహార్సల్. రేపటి నుండి ఠంచన్‌గా ప్రారంభించి ఎంత పొద్దుపోయినా నీట్‌గా వచ్చేవరకూ వుండాలనుకున్నారు.

మూర్తి సరేనన్నాడు.

అందరూ వెళ్ళిపోయారు.

సావిత్రి, మూర్తి మిగిలారు.

రూమునుండి బయటకు వస్తూ-

"పుస్తకాలు ఇస్తామన్నారు. ఇవ్వనే లేదు" అంది సావిత్రి నవ్వుతూ ఆమె వైపు చూశాడు.

"మరిచిపోయాను. గుర్తు లేదు" అన్నాడు.

రోడ్డుమీదకి వచ్చాక రిక్షా పిలిచి సావిత్రిని ఎక్కమన్నాడు.

"రేపు తొందరగా వచ్చేయ్! డైలాగ్

బెహార్ట్ బాగా చెయ్యి. మరో ఇరవై రోజు ల్లోగా నాటక ప్రదర్శన జరిగిపోవాలి" అన్నాడు. వెళ్ళమని చెయ్యూపాడు.

అతనిచేతిని ఆప్యాయంగా నొక్కుతూ—

"ఇంటికి రాకూడదూ!" అంది మెత్తగా.

ఆమె వైపు చూశాడు మూర్తి. ఆ కళ్ళలో భావాల్ని చదివాడు. తప్పర్థను కున్నాడో ఏమో! రిక్షా ఎక్కి ఆమెను వొరుసుకుంటూ కూర్చున్నాడు.

రిక్షా దిగి ఇంటి తలుపు తీసింది సావిత్రి. లోపలికి వచ్చి లైట్ వేసింది. వెలుతురు మసగ్గా వుంది.

"కూర్చోండి!" అంది. అని గబగబా వీధిలోకి వెళ్ళి తిరిగొచ్చింది. కంచాలు కడిగి శుభ్రం చేసింది. కుర్రాడు కారియర్ తీసుకొచ్చాడు. కారియర్‌ని చూస్తూనే—

"ఇదంతా ఏమిటి? నేను రూముకి పోదామనుకుంటుంటే" అన్నాడు ఇబ్బందిగా మూర్తి.

సమాధానమేమీ ఇవ్వలేదు సావిత్రి. అతన్నే గుచ్చి గుచ్చిచూస్తూ—

"వెళ్ళిపోవాలనే వచ్చారా?" అంది నవ్వుతూ.

ఆమె నవ్వును చూసి తత్తరపడ్డాడు మూర్తి.

అవును! ఆమె వెంట తనెందుకొచ్చి నట్లు? తిరిగి వెళ్ళడానికా? అలా అయితే వెంటనే అదేరిక్షాలో వెళ్ళిపోవాల్సింది. కాని, తనకా వుద్దేశం కలుగనే లేదు.

—ఆలోచిస్తున్నాడతను.

సావిత్రి తనని కోరుతోంది. తనూ సావిత్రి కావాలనుకొంటున్నాడు. మరి ఇందులో బిడియాలు ఎందుకు?

భోజనం సిద్ధంచేసి—

"రండి" అని పిల్చింది.

భోజనం ముందు ఇబ్బందిగా కూచ్చు న్నాడు. సావిత్రి అతన్ని అణువణువునా పరీక్షిస్తోంది.

"నువ్వూ వడ్డించుకోరాదూ!" అన్నాడు ముకసరిగా.

"తర్వాత తింటాను"

భోజనం అయిందనిపించాడు మూర్తి. వెంటనే అదే పళ్ళెంలో సావిత్రి భోజనం చేసేసింది. అది చూసి తెల్లబోయాడు మూర్తి.

భోజనం అయిన తర్వాత మంచంమీది పరుపు సరిజేసి — తెల్లని దుప్పటి దాని మీద పరిచింది.

ఆమె పనుల్ని — వాటి ఆంతర్యాన్ని అంచనా వేస్తున్నాడతను.

డబ్బు సంపాదన తప్పా, కోరి మగ వాణ్ని ఆహ్వానించడం వేశ్యలకి చేతకాదు. అటువంటిది సావిత్రి ఎందుకిలా చేస్తున్నదీ అర్థం కావట్లేదు.

"సరదాగా మాట్లాడుకొందామా?" అనడిగింది.

"మాటలాడడానికి పిల్చావా?" అన్నాడు.

సిగ్గుతో తల వంచుకొందామె. అతన్ని ఆహ్వానిస్తున్నట్లుగా ఆమె జడలోని మల్లెలు విచ్చుకొంటున్నాయి.

సావిత్రిని కౌగిలిలోనికి తీసుకొన్నాడు మూర్తి.

తెల్లవారు జామునే లేచాడు. సావిత్రిని లేపాడు. ఉలిక్కిపడి లేచిందామె.

"అప్పుడే తెల్లారిందా?" అంది మత్తుగా.

"ఇంకా రాత్రే అనుకొంటున్నావా?" అన్నాడు నవ్వి.

తిరిగి — "నేను వెళ్తాను" అన్నాడు.

"కాఫీతాగి వెళ్ళండి! తొందరేమిటి"

"చాలా పనులున్నాయి. వెళ్లాలి" అంటూ బయటికి నడిచాడు. రూమ్ దగ్గరకి వచ్చేసరికి అరుణ ప్రశ్నార్థకంగా చూసిందతన్ని.

"రాత్రంతా ఎక్కడున్నారు?" అనడిగింది.

అలా అడగడం నచ్చలేదు అతనికి. జవాబు చెప్పకపోతే బాధపడుతుంది అనుకొన్నాడు.

"పాత రూంలో గడిపాను" అంటూ తాళం తీసి గదిలోకి వెళ్ళాడు.

స్నానం చేసి వచ్చేసరికి సీతన్రాజు ప్రత్యక్షం!

"చాలా పొద్దున్నే లేచారేమిటి" అన్నాడు పలకరింపుగా.

"పట్నం వెళ్లాలండి! అందుకని..." అన్నాడు.

డ్రస్ మార్చుకొని, రూంకి తాళం వేసి అరుణకిచ్చాడు.

"మళ్లీ ఎక్కడికి?" అంది అతని వేషం చూస్తూ.

"పట్నం వెళ్తున్నాను"

"ఎప్పుడొస్తారు?"

"రాత్రి లేదా రేపు ఉదయం"

"కాఫీ తాగి వెళ్ళండి"

"వద్దు. వెళ్ళొస్తాను" అని బయట పడ్డాడు.

పాత రూంకి వచ్చేసరికి – అప్పుడే నిద్రాదేవతను వదిలించుకొంటూ కుస్తీలు పడుతున్నారు మిత్రులంతా.

"పట్నం వెళుతున్నాను. వస్తే రాత్రికి వస్తాను. లేదా రేపుదయం" అన్నాడు చక్రవర్తితో మూర్తి.

"సత్యానికి తెలుసా?" అనడిగాడు మురళి.

"అందరికీ నిన్ననే చెప్పానుగా"

"మంచి కర్టెన్లు మాట్లాడు. అలాగే కాస్ట్యూమ్స్ విషయం కూడా తెల్సుకో" అన్నాడు వాసు.

సరేనన్నాడు మూర్తి. బస్సులో బయల్దేరి పట్నం వెళ్ళేసరికి పన్నెండు గంటలయింది.

అక్కడ పేరున్న డ్రస్ కంపెనీని కన్సల్ట్ చేశాడు. అంతకుముందే ఆ కంపెనీ వాళ్లతో పరిచయం వుండడం వల్ల మూర్తికి

ఏవేవి కావాలో చెప్పమన్నారు వాళ్లు.

కర్టెన్స్, మేకప్ సామగ్రి, రెండు వందల కుర్చీలు, మైక్స్, చుట్టూ కట్టే దేరాగుడ్డలూ మాట్లాడుకుని అడ్వాన్స్ ఇచ్చాడు.

"ఎలా తీసుకెళ్తారు?" అనడిగాడు కంపెనీ యజమాని.

"వీలైతే బస్సులో తీసుకువెళ్దామనుకుంటున్నాను"

"సాధ్యంకాదండి. లారీ మాట్లాడుకోండి. అన్నట్టు నాటకం వేసేచోట కరెంటు సప్లయి వుందా?" అనడిగాడు.

ఆ ఆలోచనే రానందుకు తననితానే మందలించుకున్నాడు మూర్తి. ఆదమరిచి వుండే ఇబ్బంది పడాల్సి వచ్చేది. వాళ్లూరికి ఇంకా కరెంటు రాలేదు. ఇప్పుడిప్పుడే ఆ ప్రయత్నాలు చేస్తున్నారు వూరి పెద్దలు.

జనరేటర్ ఛార్జీ ఎక్స్ట్రా అవుతుందన్నాడు యజమాని. సరేనని దాన్ని కూడ కుదుర్చుకున్నాడు. రేపు నాటకం అంటే ఆ ముందురోజు వచ్చి సామానంతా తీసుకువెళ్తామని చెప్పాడు.

తిరిగొచ్చాడు.

పట్నం నుండి మూర్తి రాగానే

అందరూ చుట్టేశారతన్ని విశేషాలు చెప్పమంటూ.

అన్నీ వివరించి చెప్పాడు.

ఏ తేదీన నాటకం వేసేది నిర్ణయించాడు. బాగానే వుందన్నారంతా.

పాంప్లెట్స్, టిక్కెట్స్ ప్రెస్‌కిచ్చారు ప్రింట్ చేయమని. వాల్ పోస్టర్స్ పట్నం నుండి తెప్పించారు.

చుట్టుపక్కల ప్రాంతాలలో పోస్టర్స్ అంటించారు.

రిహార్సల్స్ యధాప్రకారంసాగుతూనే వున్నాయి.

వారం రోజుల ముందుగానే టిక్కెట్ల అమ్మకం ప్రారంభించారు. నాటకానికి రెండు రోజులు ముందుగా గుర్రంబండి ఏర్పాటుచేసి మారుమూల పల్లెల్లో ప్రచారం చేయాలనుకున్నారు. ఎనౌన్స్ చేయడానికి చక్రవర్తిని నియమించారు.

మొదటిరోజే అపశకునం.

చక్రవర్తి ఎనౌన్స్ చేస్తూంటే వూరి పోలీసులు పట్టుకున్నారతన్ని.

యస్.ఐ. దగ్గర హాజరుపరిచారు.

"ఏ వూరు మీది?" ప్రశ్నించాడు యస్.ఐ.

చెప్పాడు చక్రవర్తి.

"మా పర్మిషన్ లేకుండా నిన్నెవడు ఎనౌన్స్ చేయమన్నది?" గాండ్రించాడు.

"మాకు ఇవేవీ తెలీద్సార్?"

"తెలీకుంటే తెలుసుకోవాలి. ఇక చెయ్యకు. చేసేవో నువ్వూ, నీ గుర్రబ్బండీ లాకప్‌లో వుంటారు"

ఓ నమస్కారంచేసి వెనుతిరిగాడు చక్రవర్తి. వచ్చి వివరాలు చెప్పాడు అందరికీ.

నాటకానికి పర్మిషన్ తీసుకోలేదు.

పోలీస్ లైసెన్స్ తీసుకోలేదు.

ఫైర్‌సర్వీస్ లైసెన్స్ కూడాలేదు.

పల్లెల్లో ఇవన్నీ ఎవడిక్కావాలన్న చిన్నచూపుతో ఇలా చేశారు. ఇప్పుడు ఇలా కథ అడ్డం తిరిగింది.

"ఏం చేద్దాం" అన్నారు.

సత్యాన్ని రూంకి పిలిచాడు మూర్తి.

"నా దగ్గర డబ్బు మరేమీ లేదు. టిక్కెట్ల అమ్మకం కూడా సరిగా జరగలేదు. థియేటర్ దగ్గర కలెక్షన్ ఎంత వుంటుందో చెప్పలేం. అందువల్ల ఓ రెండు మూడు వందలుంటే ఇవ్వు. తర్వాత లెక్కలన్నీ చూసుకుందాం" అన్నాడు.

చూస్తానన్నాడు సత్యం. సైకిల్‌మీద ఇంటికి వెళ్లాడు.

వాసు వచ్చాడు.

"గురూ!డాన్సర్ వుంటేకానిప్రోగ్రాం రక్తికట్టదు" అన్నాడు.

"నిజమే! నిజమే!" అన్నారు మిగతా వాళ్లు.

"అవును నిజమే!డబ్బెక్కడిది?డాన్స్ ఏర్పాటు చేస్తే డాన్సర్‌కే నూరు, నూట ఏభై ఇవ్వాలి. డబ్బేది?" అన్నాడు మూర్తి.

"ఈ టిక్కెట్లు కూడా అమ్ముడుపోవట్లేదే" అన్నాడు చక్రవర్తి సిగరెట్ దమ్ము లాగుతూ.

"సరే చూద్దాం! మీ ఉత్సాహాన్ని ఎందుకు కాదనాలి. పట్నంలో ఎవరైనా వుంటే మాట్లాడదాం" అన్నాడు మూర్తి.

నీరసంగా రూముకి వెళ్లాడు మూర్తి.

అతన్ని చూస్తూనే అరుణ–"ఎక్కడికి వెళ్లారు? రెండ్రోజులుగా కన్పించనే లేదు. నాన్నకి గుండెపోటు వస్తే ఆస్పత్రిలో జాయిన్ చేశాము. అక్కడికి వెళ్లాలి" అంది ఆతృతగా.

తెల్లబోయాడు మూర్తి.



"నేనూ వస్తానయితే" అన్నాడు.

ఇద్దరూ రిక్షా ఎక్కి జనరల్ ఆస్పత్రికి వెళ్లారు. అక్కడ కమల, ఆమె భర్త కూడా వున్నారు.

"ఎలా వుందిప్పుడు?" అనడిగాడు మూర్తి.

"ఫర్వాలేదు. నిన్ననయితే చచ్చే పోతారనుకొన్నాం" అన్నది కమల.

"మీరు కన్పించనే లేదేమిటి?" అంది మళ్లీ.

"నాటకం ఒకటి వేస్తున్నాం. దాన్లో తలమునకలుగావుంది. తిరుగుతున్నాను"

"మీకెందుకిలాంటివన్నీ" కమల విసుక్కొంది.

మూర్తి మాట్లాడలేదు.

"నిద్రపోతున్నారా?" అన్నాడు సీతారాజుని చూస్తూ.

"ఇప్పుడే నిద్రపట్టినట్టుంది. మిమ్మల్ని గురించిఇప్పటికినాలుగైదుసార్లు అడిగేడు.

శ్రేరని చెప్తే విన్పించుకోడు"

"అయ్యయ్యో!" దీర్ఘంగా నిట్టూర్చాడు.

"మరిప్పుడు ఎక్కడికీ వెళ్లకండి"

"అలాగే"

"మీతో ఏదో మాట్లాడాలన్నాడు"

"సరే. ఇప్పుడు నిద్రపోతున్నారుగా



సాయంత్రం మళ్లీ వస్తానయితే" అని బయటపడ్డాడు మూర్తి. అరుణ కూడా అతన్ని అనుసరించింది.

రిక్షాలో ఇంటికి చేరుకొన్న తర్వాత అంది అరుణ-

"నాన్న మనిద్దరికీ పెళ్లి చేయాలను కొంటున్నాడు. అక్కకేమో ఇష్టం లేదు"

"వివరంగా చెప్పు" అన్నాడు మూర్తి ఆమె కళ్లల్లోకి చూస్తూ.

"మనిద్దరికీ పెళ్లి చేయాలని నాన్న కోరుకొంటున్నాట్ట! అందుకే మీతో నేను ఎంత చనువుగా వున్నా కాదనలేక పోయాట్ట!"

"మీ అక్కకి ఎందుకు ఇష్టం లేదు?"

"మీకు ఆస్తిపాస్తులు లేవట. పోనీ ఉద్యోగం కూడా లేదట. అందుకని అక్క వద్దు అంటున్నది. నాన్న మాత్రం ససేమిరా అంటున్నాడు. నా ఉద్దేశం చెప్పమన్నారు. నా కిష్టమే నన్నాను. అక్క మండిపడింది. ఆవిడ దృష్టిలో ఎవడో వున్నాట్ట. ఉద్యోగం చేస్తున్నాట్ట. ఒక్కడేనట! కట్నం అక్ఖర్లేదన్నాట్ట! నా గురించి చెప్తే పెళ్లి చేసుకొంటానని చెప్పేట్ట. వాడికిచ్చి కట్టబెట్టాలని అక్క చూస్తోంది.

నాన్నకివన్నీ చెప్పాలని అనుకొందట అక్కయ్య. కాని ఆయనకి గుండెపోటు రావడంతో చెప్పలేకపోయిందట. ఏది ఏమైనా నాన్నా, నేనూ మిమ్మల్నే కోరు కొంటున్నాం" అంది నేల చూపులు చూస్తూ.

ఆమెను దగ్గరగా తీసుకొన్నాడు మూర్తి.

"నీ ఇష్టం అరుణా! నువ్వు ఏదంటే నేనూ అదే అంటాను" అన్నాడు.

"కాదంటే ఒప్పుకొంటానా" అంది గోముగా.

ఆమెను బిగికౌగిలిలోకి తీసు కొన్నాడు. బుగ్గలు చుంబించాడు.

అరుణ అతన్ని అల్లుకుపోయింది.

సాయంత్రానికల్లా ఆ ఆనందం ఎగిరి పోయింది.

సీతన్రాజు మళ్లీ వచ్చిన గుండెపోటుకి చనిపోయాడని తెలిసింది. అరుణ ఏడుస్తూంటే, ఓదార్చి ఆస్పత్రికి తీసుకు వెళ్లాడు.

సాయంత్రమే దహనం జరిగిపోయింది

కమలతో పాటు అరుణ ఆమె ఇంటికి వెళ్తూ -

"మీరు రోజుకొక సారైనా కలుస్తుంటారు కదూ!" అంది ఏడుస్తూ.

"తప్పకుండా" అన్నాడు ధైర్యం చెపుతూ.

రిహార్సల్స్‌కి వెళ్ళడానికి మనస్కరించలేదు. ఆ రోజు చిరాగ్గా, బాధగా వుందనిపించింది. అయినా తప్పదు.

రిహార్సల్ రూముకి వెళ్లాడు. అతని ముఖం చూసి ఆదుర్దాగా ఏం జరిగిందని అడిగారు అంతా. విషయాలు చెప్పాడు మూర్తి.

సత్యం రెండొందల రూపాయలు తెచ్చిచ్చాడు.

"రేపు ఎవరైనా నాతో పట్నం వస్తున్నారా?" అనడిగాడు.

"రమ్మంటే వస్తాం" అన్నాడు మురళి.

"సత్యం, నువ్వు వెళ్లండి సరిపోతుంది" సలహా ఇచ్చాడు చక్రవర్తి.

"అయితే సరే" అన్నాడు మూర్తి. సత్యం వస్తానన్నాడు.

రిహార్సల్స్ మొదలయ్యాయి. ప్రాంప్టింగ్ లేకుండా డైలాగ్స్ ఎవరూ

చెప్పలేకపోతున్నారు. ఎవరికీ ఇంకా బైహార్టు రాలేదు.

"ఇలా అయితే లాభం లేదు. రేపొక్కరోజే రిహార్సల్. అందరూ జాగ్రత్తగా చదువుకురండి— ఆఖరు సారిగా" అన్నాడు మూర్తి హెచ్చరిస్తూ.

అందుకు సిద్ధపడ్డారందరూ.

అప్పటికే ఒంటిగంట అయింది.

ఎవరి దారిన వాళ్లు పోయారు. రిక్షా పిలిచి సావిత్రి, మూర్తి ఎక్కారు.

జంక్షన్ దగ్గర దిగిపోయాడు మూర్తి.

"నువ్వు ఇంటికి వెళ్ళు. నాకు పనులున్నాయి" అన్నాడు.

టింబర్ డిపోకు వెళ్లి అంత రాత్రి మనిషిని లేపి యాభై పాతుడుకొయ్యలకి ఆర్డరిచ్చాడు. వెదుర్లు కూడా కావాలన్నాడు. డెభై అయిదు రూపాయలు అద్దెకి వప్పుకున్నాడు. అడ్వాన్స్ పాతిక చేతిలో పెట్టాడు.

నటీనటుల్ని, టెక్నీషియన్సునీ తీసుకు వెళ్ళాలంటే వ్యాను వుండాలి. లేకపోతే నానా బాధలు! అందుకని వ్యానుకూడా మాట్లాడదామని అక్కడికి వెళ్ళాడు.

"ఎప్పటినుండి కావాలి?" అనడిగాడు డ్రైవరు.

"ఎల్లుండి సాయంత్రం నుండి మర్నాడుదయం వరకూ"

"రానూ, పోనూ వంద రూపాయలివ్వండి".

పాతిక రూపాయలు అడ్వాన్సు ఇచ్చాడు అతడికి.

కళ్లు మండుతున్నాయి మూర్తికి. రూమ్ వైపు సాగాడు. ఇల్లంతా బోసిగా వుంది ఎవరూ లేకపోవడంతో.

సీత్రనాజు గుర్తుకొచ్చాడు.

పాపం! కన్నతండ్రి అంతకన్నా ఏం చేయగలడు? వయసొచ్చిన పిల్ల చెడు తిరుగుళ్లు తిరిగితే భరించలేదు. అందుకనే తనని ఆదరించి చేరదీశాడనుకొన్నాడు.

అరుణ జ్ఞప్తికొచ్చింది.

'తనకోసం సర్వస్వాన్నీ ధారపోసింది. కల్లాకపటం తెలియని మనిషి. ఆమెకు అన్యాయం చేయకూడదు. పెళ్లి చేసుకోవాలి' అని నిర్ణయించుకొన్నాడు.

నాటకం జరిగిపోతే—తిరిగ్గా కమలతో మాట్లాడి అరుణను తనదాన్ని చేసుకోవచ్చు ననుకున్నాడు.

అప్పటికే మాగన్నుగా నిద్రపట్టింది. ఉదయం లేచేటప్పటికి పదిగంటలయింది.

వేగంగా తెమిలి పాతరూంకి వెళ్లాడు. సత్యం వచ్చి ఉన్నాడు.

రిహార్సల్ ఈరోజు రెండు సార్లు వెయ్యాలని చెప్పి, సావిత్రి కోసం కృష్ణారావును పంపారు.

మూర్తి, సత్యం పట్నంవెళ్లారు.

"ఇంకా రాలేదేమా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు కంపెనీ యజమాని.

"మీ ఎరికలో ఎవరైనా మంచి డాన్సర్ ఉందా?" అడిగాడు మూర్తి.

"ఉంది. ముంతాజ్ బాగానే డాన్స్ చేస్తుంది. పైగా ఛార్జీ కూడా తక్కువ"

"సరే అయితే! లారీలో సామాను లోడ్ చేయండి. ఈలోపు ఆమెతో మాట్లాడి వస్తాం" అన్నాడు మూర్తి.

కనీసం యాభై రూపాయలక్కాని ముంతాజ్ డాన్స్ చేయనంది. ఒప్పుకోక తప్పింది కాదు. ప్రయాణానికి సిద్ధంగా ఉండమన్నాడు.

తిరిగి వచ్చేసరికి లారీ లోడ్అయి పోయింది. అందర్నీ వెంటబెట్టుకొని

ఊర్లో కొచ్చేసరికి—

దేరాలూ, కర్టెన్లూ అవీ కడుతూ హడావుడిగా తిరుగుతున్నారంతా.

రాత్రి పదిగంటలకి టికెట్ బుకింగ్ ప్రారంభించారు.

అయిన ఊరు కావడంతో టిక్కెట్లు ఎవరూ కొనలేదు. ఫ్రీగానే చూడవచ్చని వచ్చారంతా.

హౌస్‌ఫుల్ అయింది. జనం కిటకిటలాడిపోయారు థియేటర్ నిండా. కాని, టిక్కెట్లు మాత్రం ఏ ఏభైయ్యో అమ్ముడయ్యాయి.

ముంతాజ్ సొమ్ము అంతా ముందిస్తేనే కాని కాలికి గజ్జెకట్టనంది. చచ్చినట్టు సమర్పించుకున్నారు.

నాటకం అయిపోయింది.

విజయవంతమైనట్లే కాని, మూర్తికి మాత్రం కాళ్లు చేతులు ఆడలేదు. అందరికీ డబ్బులు చెల్లించేసరికి చేతిలో ఓ ముప్పై రూపాయలు మాత్రం మిగిలాయి. ఇంకా సావిత్రికి డబ్బు అందనేలేదు. ఆ సొమ్ము ఆమె చేతిలో ఉంచాడు. మూర్తి మొహాన్ని చూస్తూ ఆడబ్బును తీసుకొంది సావిత్రి.

అందరూ వానునెక్కి తిరుగు ప్రయాణం కట్టారు. ఊర్లోకి రాగానే ఎవరిదారిన వాళ్లుపోయారు.

సావిత్రిని రిక్షాలో ఎక్కించి వెళ్లమన్నాడు.

"మీరు రావా?" అడిగింది.

చేతిలో పైసాలేదు. రిక్షాఛార్జీ కూడా చెల్లించలేని స్థితిలో ఉన్నాడు.

రానన్నాడు.

సావిత్రి అతని దగ్గరగా వచ్చింది. అతని చేతిలోముప్ఫైరూపాయలూ నొక్కిపెట్టింది.

"ఇదేమిటి ?" ఆశ్చర్యపోయాడు మూర్తి.

"ఉంచండి"

"నీకింకా చాలా ఇవ్వాలి! ఇది కూడా ఇచ్చేస్తే నువ్వు..."

"ఫర్వాలేదు" అంది. రిక్షా ఎక్కి వెళ్లిపోయింది.

శరీరాన్ని అమ్ముకొన్న వేశ్యకయినా నీతి ఉంది. జాలి ఉంది. అది మిగతా వాళ్లకి లేకపోయింది. సక్రమంగా ఎవరి పనులు వాళ్లుచేసి, టిక్కట్లు మొహమాటం లేకుండా అమ్మితే లాభాలు రాకపోయినా నష్టాలు రాకపోను. కాని అందరూ తమదేమన్నట్టుగా ఊరుకొన్నారు. తనుమాత్రం దీనివల్ల అప్పుల పాలయ్యాడు.

రూమ్‌కివెళ్లాలంటే అరుణ గుర్తొస్తోంది. బాధగా ఉంది. చివరికి పాత రూమ్ వైపే దారి తీశాడు.



## 4

అప్పటికి అయిదు రోజులయింది అరుణని చూడక. ఆమె కంగారు పడుతుందనుకొన్నాడు మూర్తి.

ఒక వైపు తండ్రి మరణం—

మరొక వైపు తనది అనుకొంటున్న వ్యక్తి దూరమవ్వడం బాధాకరంగానే ఉంటుందన్పించింది.

వెళ్లి ధైర్యం చెప్పాలనుకొన్నాడు.

సాయంత్రం అయిదు గంటలకి కమల ఇంటికి వెళ్లాడు. ఆ సమయానికి కమల, ఎవరో మరో వ్యక్తి కలసి హాలులో కులాసాగా కబుర్లాడుకొంటున్నారు.

మూర్తిని చూసింది కమల.

"రండి"అంది ఆహ్వానిస్తూ.

వచ్చి కుర్చీలో కూర్చున్నాడు— అపరిచిత వ్యక్తి ఎవరై ఉంటారా అని ఊహిస్తూ.

"ఇతను మీకు పరిచయం లేదనుకొంటాను. మా మరిది. అరుణ భర్త" కమల నాజూగ్గా కేకును కోసినట్టుగా మెల్లగా చెప్పింది.

మూర్తి తమాయించుకోలేకపోతున్నాడు. తను కమలతోనేనా మాట్లాడుతోంది? లేక మరెవరితోనైనా...

"ఈ రోజు ఉదయమే అరుణ పెళ్లి జరిగింది"

హతాశుడయ్యాడు మూర్తి.

"ఈ పెళ్లికి అరుణ వొప్పుకొందా?" అనడిగాడు. అలా అడుగుతున్నపుడు అతని కళ్లల్లో ఎర్రజీరలు కదలాడాయి. వాటిని చూసి భయపడింది కమల.

"వొప్పుకొంది కాబట్టే చేశాం!అయినా వొప్పుకోవడం, వొప్పుకోక పోవడం ఏమిటి? దాన్ని చక్కదిద్దాల్సిన బాధ్యత అక్కగా నాకుంది. ఆ హక్కును సద్వినియోగం చేశాను"

"అరుణని గూర్చి ఇతడికి పూర్తిగా తెలుసా?"

తెలుసునన్నట్టుగా తలూపింది కమల.

"అన్ని విషయాలూ చెప్పాం. అయినా మంచిమనసుతో ఆదరించారు మమ్మల్ని.ఇంతకన్నా మాకింకేం కావాలి"

మూర్తి ఇక నిలుచోలేకపోయాడు.

"అరుణని ఓసారి పిలవండి. మాట్లాడి వెళ్తాను" అన్నాడు అర్థింపుగా.

"నాతోరండి"

కమలని అనుసరించాడతను.

వంటింటి గడపనానుకొని, చేతుల్లో ముఖాన్నుంచుకొని రోదిస్తోంది అరుణ.

కమల ఆమెను తట్టింది. కళ్లెత్తి చూస్తే —మూర్తి! నిర్విణ్ణురాలైంది. ఆమె కనుకొలకల్లోంచి కన్నీరు 'టపటపా' మంటూ కిందపడి ఇంకిపోతున్నాయి.

"ఈ పెళ్లి నువ్వు ఇష్టపడే చేసుకొన్నావా" అరుణ దగ్గరగా వస్తూ అడిగాడు మూర్తి.

"నేను నీకు చెప్పానుగా— దాని ఇష్టాయిష్టాలతో పనేముంది" కర్కశంగా అంది కమల.

మూర్తి మరేమీ మాట్లాడలేదు.

అరుణ కొయ్యబొమ్మలా నిలబడింది. ఉలకదు! పలకదు!

తలవంచుకొని బయటకు దారితీశాడు.

వెళ్తున్న అతన్ని చూసి— నా జీవితాన్ని నాశనం చేశావు అక్కా" అంది అరుణ.

"అలాగే ఉంటుంది మంచిచేస్తే. ఏడవకు. రేపు నువ్వే సుఖపడ్డానంటావు" అంటూ ఆమెను దగ్గరగా తీసుకొంది కమల.

కమల ఇంతగా దౌర్జన్యం చేస్తుందని ఊహించలేకపోయాడు. ఆ రోజే అరుణని తనతో ఇంటికి తీసుకువెళ్లుంటే ఇంత అనర్థం జరిగేది కాదు.

ఈ నాటకం తనని నాశనం చేసేసింది. ప్రేమించిన వ్యక్తిని దూరం చేసింది.

బలవంతంగా పెళ్లిచేశారు అరుణకి. అయినా బలమయిన తాళిముడే పడింది. ఇహ తెంచుకోలేదు. అందుకే రాలేక పోయింది అరుణ.

— రకరకాలుగా ఆలోచిస్తూ రూమ్‌కి వచ్చాడు మూర్తి.
సీతారాజుగారి గదిని ఖాళీచేసేశాడు. సామానంతా రిక్షాలో వేసుకొని పాత రూమ్‌కి వెళ్ళిపోయాడు.

తనకి మనశ్శాంతి కావాలి. ఈ గాయం నుండి వేగంగా కోలుకోవాలి.

—ఆలోచించాడు మూర్తి.

ఎవరున్నారు తనని ఆదరించడానికి? ఎవరున్నారు తన బాధను పంచుకోవడానికి?

సావిత్రి కళ్ళల్లో మెదిలింది.

వెంటనే లేచి బయల్దేరాడు.

అతని ముఖాన్ని చూస్తూనే భయపడింది సావిత్రి. పరిచయమయిన ఈ నెల రోజుల్లోనూ అతడెప్పుడూ అలా ఉండలేదు.

"ఏంచేస్తున్నావు?" అనడిగాడు. ముఖంలో బాధ కొట్టొచ్చినట్టున్నా కంఠంలో ఏమాత్రం కన్పించటం లేదు.

సమాధానం ఇవ్వలేదు సావిత్రి.

"ఏం ఈ రోజు ఇంకా అలంకరించుకోలేదు?" ముఖాన్ని తేరిపార చూసి అడిగాడు.

చిన్నగా నవ్వింది సావిత్రి. "అలంకరించుకోమంటారా?" అనడిగింది. నవ్వలేక నవ్వాడు మూర్తి.

జేబులో చెయ్యిపెట్టి డబ్బు తీశాడు. మూడు పది కాగితాలు!

మంచమ్మీద ఉంచాడు. "తీసుకో. మొన్న నువ్వు ఇచ్చింది" అన్నాడు.

"నాకింకా డబ్బు రావాల్సివుంది"

ప్రశ్నార్థకంగా ఆమెను చూశాడు.

"మొన్న రిక్షా ఛార్జీ కూడా ఇవ్వాలి"

చిత్రంగా చూశాడు.

"నా ఇంటికి మీరు రావడం ఇది ఏడో సారి. రోజుకి కనీసం పాతిక రూపాయలు నా రేట్! ఆ మొత్తముకూడ చెల్లించండి"

జేబులో చెయ్యిపెట్టాడు మూర్తి. చిల్లర చిల్లర కాగితాలు — అయిదులూ, పదులూ ఉన్నాయి. అన్నిటినీ మంచ మీద పోశాడు.

"తీసుకో. నీకు రావాల్సి ఉన్నదంతా తీసుకో" అన్నాడు.

వాటిని పురుగుల్లా చూసింది సావిత్రి. అతని దగ్గరగా వచ్చింది.

"ఎందుకలా ఉన్నారు? కారణం ఏమిటి?నాటకంలో దెబ్బ తిన్నందుకేనా?" ప్రశ్నించింది.

"అవును. నాటకంతో ఆర్థికంగా బాగా దెబ్బతిన్నాను. మిత్రులనుకొన్న వారంతా నన్ను డబ్బు దగ్గర అన్యాయం చేశారు. అయినా నేను బాధపడ్లేదు. కాకపోతే నన్నే వేలెత్తి చూపి— నా వల్లనే నాటకం కలెక్షన్లు అభాసుపాలయాయి అనడం బాధగా ఉండదూ!"

ఆవేశంగానూ, బాధతోనూ అతను మాట్లాడుతోంటే విచిత్రంగా చూస్తోంది సావిత్రి.

"అదలా ఉంచే—నన్ను ప్రేమించి, పెళ్ళి చేసుకొంటానన్న వ్యక్తి నన్ను వెర్రి వెధవని చేసి ఇంకొకర్ని కట్టుకొంది" అన్నాడు.

తర్వాత అరుణ గూర్చి చెప్పాడు వివరంగా.

"ఆ పెళ్ళి తనకిష్టంలేదంటుంది. కాని నిజానికి ఇష్టపడే చేసుకొంది" అతని గొంతు వణుకుతోంది.

సావిత్రి అతని ముఖంలోకి చూసింది. ఏడుస్తున్నాడతను. లేచి దగ్గరగా వెళ్ళింది. పైట చెంగుతో అతని కళ్ళనొత్తింది.

"జీవితంలో అనేక అనుభవాలు రుచి

చూడాల్సి ఉంటుంది. వాటిని నెట్టుకొంటూ పోక తప్పదు. అందుకని బాధపడి లాభం లేదు. నాకంటే మీరు చిన్న అయినా రచయితగా మీకివన్నీ బాగా తెలుసను కొంటాను" బాధగా అంది. అతని తలపై చేయివేసి నిమిరింది.

తనదే నేలబారు జీవితం అనుకొంది ఇన్నాళ్లు. కాని ఇంకా చాలా మంది జీవితాలు అలాంటివేనని తెలుస్తోంది. ముఖానికి నవ్వు పులుముకొంటూ బాధలశతఘ్నులను కళ్ళల్లో దాచుకొనే వారెందరో!!? అయితే వారికీ, తనకీ ఎక్కడ తేడా?

సంఘంలో ఉన్న గౌరవంలో! అంతే! అనిపించింది.

"సావిత్రీ!" పిల్చాడు మూర్తి.

"ఎక్కడికి వెళ్తున్నావ్?" అనడిగాడు. ఆమె చరచరా బయటకు వెళ్లడం గమనిస్తూ.

"పని కుర్రాణ్ని పిలుద్దామని! కారియర్ తెప్పిస్తాను. భోజనం చేసి, ఈరోజు ఇక్కడే ఉండండి"

చిన్నగా నవ్వాడు.

"నువ్వు వెళ్లమన్నా వెళ్లను సావిత్రీ! నాకు మనశ్శాంతి కావాలి. అది నీ దగ్గరే దొరుకుతుందనివచ్చాను. నన్ను కాదనకు" అన్నాడు ఉద్వేగంగా.

సావిత్రి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. అత డంతగా బాధపడుతోంటే సహించలేక పోతోంది.

"లేవండి భోజనం చేద్దాం" అంది కాసేపు పోయిన తర్వాత.

"వద్దు! నాకు ఆకలిగాలేదు"

"అయితే నేనూ భోంచేయను"

తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు. ఆర్ద్రంగా ఉంది. మారు మాట్లాడక కాళ్లు కడుక్కొని వచ్చాడు.

అన్నం పెట్టి, పీట వాల్చింది సావిత్రి.

"నువ్వు కూడా పెట్టుకోరాదూ! ఒకే సారి తినొచ్చు" అన్నాడు.

"నేను తర్వాత తింటాను. ముందు మీరు తినండి. కంచం ఒకటే ఉంది"

"అయితే ఇద్దరం ఒకేదాన్లో తింటే పోలా" అంటూ ఆమెను ముందుకు లాక్కొన్నాడు.

"నువ్వుకూడా నన్నెందుకు మోసం చేస్తున్నావు?" అన్నాడు కోపంగా భోజనం చేసింతర్వాత.

"నేనేం చేశాను?"

"నేను తిన్న అన్నంలో నాలుగోవంతు కూడా నువ్వు తినలేదు. పైగా పెరుగు ఇంకా ఉందంటూ నాకంతా వేసేసి నీకు లేకుండా చేసుకొన్నావు"

నవ్వింది సావిత్రి. వెళ్లి పరుపు సరి చేసి దుప్పటి దులిపి పరిచింది.

"ఇక పడుకోండి. పొద్దుపోయింది" అంది.

మంచమ్మీదకి వచ్చి వాలాడు మూర్తి.

"నెలకి నీకు ఖర్చెంత?" అనడిగాడు.

"నూటఏభై రూపాయలలా అవుతుంది"

"ఆ సొమ్ము నేను సర్దుతాను. ఈ వృత్తి నువ్వు మానుకో" అన్నాడు ఆమె చేయిపట్టుకొని అభ్యర్థనగా. ఆమె కళ్లు వర్షిస్తూంటే అతని కళ్లల్లోకి చూసింది. వెక్కి వెక్కి ఏడుస్తూ అతని గుండెలపై వాలింది.

"ఎంత మందికో సహాయం చేసినట్టు గానే నాకూ మీరు సహాయం చేస్తారు. నేను ఆ కృతజ్ఞత ఉంచుకోను"

మూర్తి పెదవులు చిన్నగా విచ్చు కొన్నాయి—

"నా ఈ మాట కాదనకు. ఈ రోజు నా కెవరున్నారు నువ్వుతప్ప"

"వద్దండి! నేను మీకు భారంగా ఉండలేను. ఇక్కడే ఉంటాను. మీకోసం ఎప్పుడూ ఎదురు చూస్తూంటాను" అందామె.

"అలా అయితే నేనిక్కణ్నుంచి ఇప్పుడే వెళ్ళిపోతాను. నా మాటకి విలువ ఇవ్వవుకదూ?"

ఆమె మాట్లాడలేదు. అతన్ని కరచుకొని అలాగే ఉండిపోయింది.

"చెప్పు సావిత్రీ! నాకు దూరంగా ఉండాలనుకొంటున్నావా? వద్దు. నన్ను దూరం చేయకు"

ఆమె జవాబు ఇయ్యలేదు. వెక్కి వెక్కి ఏడుస్తూనే వుంది.

కాదంటే వెళ్ళిపోతాడు. చేరదీస్తానంటున్నాడు. ఆదరిస్తానంటున్నాడు. ఇంతకన్నా మంచి జీవితాన్ని ఎవరు ప్రసాదిస్తారు? ఔనంటే తప్పేముంది?

తప్పదనిపించింది. అతని మెడచుట్టూ చేతులు వేసి దగ్గరగా లాక్కొంది.

లేచేసరికి ఉదయం అయిదు గంటలయింది. దేవాలయం నుండి సుప్రభాతం వినవస్తోంది. బయటకు నడిచి— పనికుర్రాణ్ని లేపి, ఓ అరగంట తర్వాత రమ్మనమని చెప్పి తిరిగొచ్చింది.

మూర్తి ఇంకా నిద్రలోనే ఉన్నాడు.



తట్టిలేపింది. లేచి కూర్చున్నాడు. ఆమె ముఖంలోకి చూశాడు. ఏ భావం గోచ రించటం లేదు.

"లేవండి. లేచి ముందు స్నానం చేయండి" అంది.

స్నానంచేసి వచ్చాడు. పనికుర్రాణ్ని పంపి ఫలహారం తీసుకురమ్మంది. వాడెళ్లి పావుగంటలో తిరిగొచ్చాడు.

ప్లేటులో నాలుగు ఇడ్లీలుపెట్టి అందిం చింది మూర్తికి.

"నువ్వు తినవా?" అనడిగాడు.

"తింటాను. ముందు మీరు తినండి" అందామె నవ్వుతూ.

నిన్నటి బాధలూ, భయాలూ అతని మొహంలో ఇప్పుడు కన్పించటం లేదు. ప్రశాంతంగా వుంది.

కాఫీ అందించింది.

తాగుతూ కూర్చున్నాడు.

"ఓ పని చేస్తే" అన్నాడు ఆమె మొహంలోనికి చూస్తూ. 'ఏమిటి' అన్న ట్టుగా తల తాటించింది సావిత్రి.

"ఎలాగూ నాకూ రెండు మూడు వందలు హోటల్‌కు ఖర్చు అవుతోంది. అదే మొత్తాన్ని మనిద్దరం సర్దుకుందాం! నువ్వు వండి పెడతానంటే సరే! కలిసి వుందాం"

ఆలోచిస్తోంది సావిత్రి.

"అయితే ఓ షరతు" అన్నాడు తిరిగి.

అతని వైపు చూసింది.

"ఇక్కడ కాదు. వేరేచోట కలిసి వుందాం"

ప్రశ్నార్థకంగా చూసింది అతనివెపు.

"ఈ ప్రాంతం నాకు ఇష్టంలేదు"

"నేను మాత్రం కాదంటానా" అంది సావిత్రి. సంతోషంగా అంగీకరించింది ఆమె ఆ ప్రతిపాదనకు.

"నన్ను నీట ముంచినా, పాల ముంచినా మీదేభారం" అరమోడ్పు కళ్లతో అతన్ని చూస్తూ అంది.

మూర్తి మరి మాట్లాడే అవకాశం ఇవ్వ కుండా వుక్కిరి బిక్కిరిగా ఆమె పెద వుల్ని అందుకున్నాడు. అతన్ని కరుచుకు పోయింది సావిత్రి.

"సాయంత్రం మళ్ళీ వస్తాను. రడీగా వుండు. ఈలోపు ఏదైనా ఇల్లు చూసొస్తాను" అని లేచాడు.

"తొందర దేనికి? భోజనం చేసి వెల్దురుగాని"

"పని వుంది వెళ్ళాలి. మళ్ళీ కలు స్తాగా"

రాత్రి అతనిచ్చిన డబ్బును తిరిగి అతనికే అందజేసి నడిచి వెళ్ళిపోతూన్న అతన్ని తదేకంగా చూస్తూ నిలబడింది.

'తన జీవితమంతా పోరాడినా ఇటు వంటి వ్యక్తి లభించడం కష్టం!' అనుకొంది.

ఆ వీధిలో ఇల్లు ఖాళీగా వుందంటే వెళ్లి చూశాడు మూర్తి.

ఇల్లుబాగానే వుంది. వంటగది, ఎటాచ్డ్ బాత్ రూమ్, లెట్రిన్, ఓ హాలు ఉన్నాయి.

అద్దె న్నూరురూపాయలు చెప్పారు. కరెంటుకి మరో పదిహేనురూపాయలు ఎగస్ట్రా. అయినా సౌకర్యంగా వుందను కొన్నాడు.

సాయంత్రం—

సావిత్రికి ఇంటిగురించి చెప్పాడు. సంతోషించిందామె.

"నా జీవితం ఇలా అందమెన మలుపు తిరుగుతుందని నేనేనాడూ వూహించలేదు. కాని తిరిగింది. దానిక్కారణం, మీరు. జీవితాంతం మీకు కృతజ్ఞతగా వుంటాను"

అంది మూర్తి పాదాలపై మోకరిల్లి.

వారించాడతను.

ఆ రాత్రే—

కొత్తఇంటికి మారారు. దాంతోపాటు సావిత్రి వేషధారణ కూడా మారింది. ఇంతకు ముందు అందాల్ని బహిర్గతం చేసే దుస్తుల్నే వాడేది. ఇప్పుడవన్నీ మూట గట్టింది. దాచి పెట్టిన పట్టుచీర తీసి కట్టింది. దానికి తగ్గ జాకెట్టు తొడిగింది. సంసారుల మధ్య సంసారికంగా ప్రవర్తించాలని ఆశిస్తోంది.

ఇంకా పచారీ ఏం తీసుకురాలేదు. అందుకని రాత్రికి హోటల్ భోజనం తప్పలేదు.

"నా గురించి ఏమిటి అనుకొంటున్నావు" అనడిగాడు మూర్తి హఠాత్తుగా. క్షణం కూడ ఆలోచించలేదు సావిత్రి. వెంటనే అంది—

"మీరు మూర్తీభవించిన దేవుడను కొంటున్నాను"

నవ్వాడతను ఆ మాటలకి. ఆమెను దగ్గరగా తీసుకొన్నాడు.

"నిన్నేదో నేను ఉద్ధరిస్తున్నానని అనుకోకు. పొరపాటు! నేను చాలా స్వార్థపరుణ్ని - ఒంటరిగా బతకలేను! నాకు తోడు కావాలి. అరుణ తోడుగా నిలుస్తుందనుకొన్నాను. కాని మోసం చేసింది. నా నుంచి దూరంగా వెళ్లిపోయింది. ఇప్పుడు నిన్ను ఆశిస్తున్నాను. నన్ను మోసం చెయ్యవు కదూ?"

"మూర్తీ!" అంది ఆర్ద్రంగా అతన్ని పెనవేసుకుపోతూ సావిత్రి.

అదే సమాధానమైంది అతనికి.

• • •

పాత రూములో కూర్చుని వుంటే - ఎవరో వ్యక్తి "మూర్తిగారు ఎవరంటూ" వచ్చాడు. వాసు వేలుపెట్టి చూపించాడు మూర్తి వైపు.

అతని దగ్గరగా వచ్చి నమస్కారం చేశాడావ్యక్తి.

"మీ పేరు విన్నాను. నటుడిగా, రచయితగా మీ గురించి నాకు బాగా తెలుసు. మరేమీలేదు! నేను కొత్తగా ఓ హోటల్ పెట్టబోతున్నాను. రేపు మీరు దాని ప్రారంభోత్సవం చెయ్యాలి" అన్నాడు.

చక్రవర్తి అతగాడి మాటలకి పకపకా నవ్వాడు.

"మేమేమన్నా రాజకీయ నాయకులం అనుకున్నారా?" అని ప్రశ్నించాడు.

"మీ పేరు?" అనడిగాడు వాసు.

"జనార్ధన శెట్టి"

"శెట్టిగారన్నమాట మొత్తానికి! ఎక్కడ పెడుతున్నారింతకీ హోటల్?"

"మీ రూముకి ఎదురుగా డాబా వుంది చూశారూ... అందులోనే ఏదో చిన్న వ్యాపారం చేద్దామని ఈ ప్రయత్నం! నేనూ, నా భార్య, మా బావమరిదీ కలిసి చేసుకొంటే రోజులు కలిసొస్తాయని ఆశ"

"అతిథులుగా ఎవరెవరొస్తున్నారు?" అనడిగాడు చక్రవర్తి సిగరెట్ ముట్టించుకుంటూ.

ముసిముసి నవ్వులు నవ్వాడు శెట్టి.

"మేం అయిదుగురం అతిథులుగా వేంచేస్తున్నాం. కాఫీ ఫలహారాలు మస్తుగా అందిస్తే ఆశీర్వదిస్తాం" అన్నాడు వాసు.

"తప్పకుండా! మూర్తిగారూ మీరొస్తున్నట్టేకదా!" అనడిగాడు శెట్టి.

"వాణ్ని అడిగేదేమిటి! నేను చెప్తున్నా విను. రేపు మీ హోటల్ ప్రారంభోత్సవం జరిగి తీరుతుంది. వెళ్లు" అన్నాడు వాసు.

"వెళ్లిరండి. తప్పక వస్తాను"

అన్నాడు మూర్తి.

శెట్టి ఆనందంగా వెళ్ళిపోయాడు.

"ఏమేమి! సుస మూర్తిగాడి దశ తిరిగినట్టుందే? తిరిగినా తిరిగినబో అందరూ వాడిని ఏల గుర్తించవలె! గుర్తించినా గుర్తించినబో ఆ శెట్టి ఏల ఆహ్వానించవలె! ఆహ్వానించినా..."

"నోరుముయ్యి గురూ!" చక్రవర్తి వాసు నోరుని మూశాడు. ఇంతలో సత్యం వచ్చాడక్కడికి.

"రేపు హోటల్ ప్రారంభోత్సవం చేయబోతున్నాను. ఉదయం పెందరాళే రా!" అన్నాడు మూర్తి.

"నువ్వు చేస్తున్నావా!" ఆశ్చర్యపోయాడు సత్యం. నవ్వుతూ వివరాలు అడిగాడు తర్వాత.

"ఏంటి గురూ! ఈమధ్య సావిత్రి కన్పించటంలేదు. ఆమధ్య ఎవర్నో అడిగితే వూరొదిలి పోయిందన్నారు. నిజమేనా?" అనడిగాడు సత్యం— వెంటనే మాట మారుస్తూ.

మూర్తి మాట్లాడలేదు.

అందరూ ఎవరికివారే వూరుకున్నారు— పెద్ద విషయం కాదన్నట్టుగా.

"మరో నాటకం ఏదైనా వేద్దామా?" అన్నాడు వాసు.

"వద్దు బాబోయ్! వద్దు. ఒకటి వేశాం, నష్టాలు నసాళానికి అంటాయి. చాలు"

"మరోసారి ట్రై చేద్దాం గురూ!"

"నోరు ముయ్యి" వాసు చక్రవర్తి నోరు మూశాడు.

మర్నాడు—

ఉదయం ఏడుగంటలకి శెట్టి వచ్చి పిలిచాడు. అప్పటికే అంతా రడీగా కూర్చున్నారు. పిలవడమే తరువాయి వానర సైన్యంలా ముందుకి వురికారు.

మూర్తిచేత కొబ్బరికాయ కొట్టించి ప్రారంభోత్సవం జరిపించాడు శెట్టి.

ప్రారంభోత్సవానికి పద్మ కూడా వచ్చింది. పద్మని చూసి వాసు పళ్ళికిలించాడు. అయినా పట్టించుకోలేదామె. శెట్టి భార్యతో మాట్లాడుతూ కూర్చుంది.

పద్మ పెద్దింటి పిల్ల! ఆమెకు తగిన గౌరవం ఇస్తోంది శెట్టి భార్య.

ఫలహారాలయ్యాక మూకంతా బయటకి నడిచింది. మూర్తి ఒక్కడే మిగిలాడు.

"భోజనం చేసి వెళ్ళండి" అన్నాడు శెట్టి అతని దగ్గరగా వస్తూ.

"వద్దండి!" అంటూ మొహమాట పడ్డాడు మూర్తి. పద్మ అతని ముందుగా వెళ్తూ — కళ్ళెత్తి అతన్ని చూసి నవ్వింది. జవాబుగా మూర్తీ నవ్వాడు.

తర్వాత సత్యం వచ్చి కలిశాడు.

"సావిత్రితో కాపురం పెట్టావట" అన్నాడు నవ్వుతూ రహస్యంగా.

"నీకెవరు చెప్పారు?"

"నేను ఆరా తీశాను. అయితే అందరి ముందూ నిన్ను అడిగితే బాగోదని నిన్న అలా మాట్లాడాను"

మూర్తి వివరించి అంతా చెప్పుకొచ్చాడు.

"ఆమెను ఓ గట్టుకు చేర్చాలనే నా తాపత్రయం. అంతేగాని మరో దురుద్దేశం లేదు"

"పోనీలే! మంచి పనే చేస్తున్నావు" అన్నాడు సత్యం.

ఇద్దరూ శెట్టి దగ్గర శలవు తీసుకొని బయటపడ్డారు కాసేపటికి.

ఇంటికి వెళ్తుంటే ఏవేవో ఆలోచనలు మూర్తిని వాటేసుకొన్నాయి.

నాటక ప్రదర్శనను కాక గాన

కచేరీలు ఏర్పాటు చేయాలని ఉందతనికి. పెద్దగా ఖర్చు కాకుండా, లాభసాటి వ్యాపారంలా కన్పిస్తోందది! పెట్టుబడి కూడా తక్కువగా ఉంటుందనుకొన్నాడు.

ఇంటికి చేరుకొన్నాడు.

సావిత్రి కింది హాల్లో కూర్చుని చేతి సంచీ మీద ఎంబ్రాయిడరీ అల్లుతోంది. అతన్ని చూసి లేచి నిల్చుంది.

"ఏమిటిది?" అనడిగాడు ఆమె చేతి లోని సూదుల్నీ...వాటినీ చూస్తూ.

"ఉబుసుపోక" అని నవ్వింది.

"మనింటావిడకి ఎంబ్రాయిడరీ వచ్చునట! పొద్దున్నొచ్చి కలిసింది. మాటల మధ్యలో ఈ ప్రసక్తి వస్తే నాకు నేర్పమన్నాను"

''మంచిదే. ఇలాంటివి నేర్చుకుంటే! పొద్దు గడుస్తుంది.కాకపోతే ఒక విషయం ఇంటావిడతో మన విషయాలేవీ చెప్పకు. విషయాలన్నీ ఆరా తీశాక హీనంగా చూస్తారు''

అలాగేనన్నట్లుగా తలూపి లోనికి వెళ్ళింది సావిత్రి.

''ఆకలిగా ఉంది'' అన్నాడు మూర్తి ఆమెను అనుసరిస్తూ.

''కాళ్లు కడుక్కోండి''

భోజనాలయ్యాయి. హాలులోకి వచ్చి కూర్చున్నాడు.

''ఓ ఆలోచనలో ఉన్నాను'' అన్నాడతను.

''చెప్పండి''

"ఈ ఊళ్లో పాట కచేరీ ఏర్పాటు చేద్దామనుకొంటున్నాను. ఇదో రకం వ్యాపారం. అయితే గాయని ఎవరో తెలుసా? నువ్వే!! దీనివల్ల నీకూ, నాకూ మంచి జరుగుతుందనే ఆశిస్తున్నాను''

''ఆలోచించండి! నేనంత బాగా పాడలేనేమో!" అంది నవ్వుతూ.

"బాగా పాడగలవనే నమ్మకం నాకుంది. ప్రోగ్రాం సక్సెస్ కాక తప్పదు. ఈ రకంగా నువ్వు అభివృద్ధిలోకొస్తే నాకూ మంచి జరిగినట్టే''

సావిత్రి మాట్లాడలేదు. మౌనంగా వింటూ కూర్చుంది.

''మాట్లాడవేం?''

"మీ ఇష్టం! నేనెప్పుడూ మిమ్మల్ని కాదనను''

"సరే అయితే! కొన్ని పాటలు నేనే రాస్తాను. గీతం నాది. సంగీతం నీది'' అన్నాడు నవ్వుతూ.

తలూపింది సావిత్రి.

ఆరోజు —

తొందరగా పని నుండి తెమిలి హార్మోనియం పెట్టెను ముందుకు లాక్కొంది సావిత్రి. దాన్ని సాధనచేసి చాలా రోజులైంది. ఆ కారణంగా దుమ్ము పట్టి చూడ్డానికి చిన్న సైజు ట్రంకు పెట్టెలా కన్పిస్తోందది.

పరిస్థితి ఆమెను పడుపుగత్తెను చేశాక తర్వాత్తర్వాత సంగీత సాధనకే తీరుబడి దొరకలేదు. కడుపుకక్కుర్తిలో కళలు రాణించవుగదా!

ఇపుడు మరి ఆ బాధ లేదు. అండగా నిలిచే మనిషి వున్నాడు. ఆనందంగా ఆలపించవచ్చుననుకొంది. హార్మోనియంతో గొంతు శృతి కలిపింది.

మూర్తి ఆ రాగానికి ముగ్ధుడయ్యాడు.

"ఇంతగా నీకు ప్రావీణ్యత వుందని నాకు తెలీదు" అన్నాడు.

జవాబు ఇవ్వలేదామె. తల వంచి నవ్వింది.

'రోజులు ఎంత విచిత్రంగా వున్నాయి? అనాదు సావిత్రి ఓ పడుపు

గత్తె. మరీనాడు ఉత్తమ ఇల్లాలన్పి స్తోంది. రోజురోజుకీ ఎంత తేడా?

మనిషిగా, మంచిగా బతకాలనుకొన్న ఆ సావిత్రి అందుకే ఆ కూపంలో ఇమడ లేకపోయింది. చేయూతనిచ్చే నాథుడి కోసం వెర్రిగా చూసింది. కలలు ఫలిం చాయి. కళ కోసం తాపత్రయ పడుతోం దిప్పుడు. ఆ తాపత్రయానికి తన సహకారం అత్యవసరం' అనుకొన్నాడు మూర్తి.

"ఏమిటాలోచిస్తున్నారు?" అందామె అతని ఏకాగ్రతని భంగపరుస్తూ.

"నీ గురించే !"

"ఏమిటి?"

"నువ్వు నా భార్య కావడం ఎంత అదృష్టం"

"ఏమండీ!"

"అవును సావిత్రీ! నేనసలు నీకు భర్తయ్యే యోగ్యతని కలిగున్నానా అని!"

"అవేం మాటలండీ!" బాధపడిందామె.

"నిజం సావిత్రీ! నిన్ను చాలా తక్కువగా అంచనా వేశాను. అందుకు క్షమించు."

విలవిల్లాడిందామె.

ఆమె కళ్లల్లో నీళ్లు నిలిచాయి.

మూర్తి చిత్రంగా మాట్లాడుతున్నా దన్పించింది.

"ఛ ఛ! ఏడుస్తున్నావా?" ఆమె దగ్గరగా చేరాడతను.

లేదన్నట్టుగా అతని కళ్లలోకి చూసింది.

కన్నీటి చారికలు!

"సావిత్రీ!" ఆమెను అక్కున చేర్చు కొన్నాడు మూర్తి.

* * *

ఇంటావిడ సుధ వచ్చి పలకరించింది "ఏం చేస్తున్నావ్ సావిత్రీ!" అంటూ.

ఆ పాటికి హార్మోనియం ప్రాక్టీస్ చేస్తోం దామె.

"ఎప్పుడూ సంగీతమేనా!" అంది సావిత్రికి దగ్గరగా వచ్చి కూర్చుని.

"మరేం చేయమంటారు."

"ఏం చెయ్యమంటానా – పాట కచేరీ చేయమంటాను" సుధ-సావిత్రి చెవిపట్టి మెలితిప్పింది.

"మీకెలా తెలుసు?"

"పాంప్లెట్స్ మీ ఆయన తెగ పంచే స్తున్నాడవతల"

నవ్విందామె.

"మా వారు నిన్నూ, మీవార్నీ చూసి ఏదో అనుమానిస్తున్నారు. ఎంత వరకూ నిజం" సుధ నిర్మొహమాటంగా అనే సింది.

ఆ మాటలకి తలెత్తి చూసింది సావిత్రి. హఠాత్తుగా సంభాషణ ఎలా మారిందని ఆలోచించింది.

"ఏ అనుమానం?"

"దొంగతనంగా కాపురం చేస్తున్నా రేమోనని."

"ఎలా కనిపెట్టారు?"

"భలేదానివి! నీకన్నా ఆయన చాలా చిన్నవాడిలా కన్పిస్తున్నాడు"

'అంతేనా' అన్నట్టుగా వూపిరి తీసింది సావిత్రి.

"ప్రేమించి పెళ్లి చేసుకొన్నాం. అందుకే ఆ తేడా" అంది.

తర్వాత ఆ సంభాషణని పొడిగించ లేదు సుధ. ఎందుకనుకొందేమో వెళ్ళి పోయింది. ఆమె వెళ్ళిపోతూంటే మూర్తి ఇంటికొచ్చాడు.

"మనగురించి ఏవేవో ఆలోచిస్తున్నారు ఇంటివాళ్లు" అంది.

"ఆలోచించి బుర్రలు బద్దలుకొట్టుకోనీ మనకేం బాధ" అన్నాడు.

నవ్వి వూరుకుంది. తర్వాత అంది—

"చెప్పాపెట్టకుండా ప్రోగ్రామ్ ఇంత వేగంగా నిర్ణయించేశారేం?"

"కావాలనే చేశాను. ఏం వీలుకాదా?"

"కాదని నేనననుـమీ ఇష్టం"

ఆమెను కౌగిలిలోకి తీసుకున్నాడతను.

"అనుకొన్నపనిని వేగంగా జరిపించ డంలో నాకదో తృప్తి" అన్నాడు.

వారంరోజుల ముందుగానే ఏర్పాట్లన్నీ పూర్తిచేశాడు మూర్తి. మంచి థియేటర్ మాట్లాడాడు.

పోలీస్ లైసెన్స్, ఫైర్ లైసెన్స్ అన్నీ తీసుకొన్నాడు.

పాటకచేరీ అనగానే జనం బాగా వచ్చారు. టిక్కెట్టు అయిదురూపాయలు పెట్టారు. అయినా కొనగలిగే వుత్సాహాన్ని చూపారు ప్రజ!

జనాన్ని చూస్తూ కొంత భయపడింది సావిత్రి. స్టేజి ఫియర్ సహజం మరి! తర్వాత నిభాయించుకొంది.

పాట ఆలపించింది.

పాటకు తగినట్టుగానే ఆర్కెస్ట్రా శృతి కలిపింది. సంగీత సమ్మేళనం వినసొంపుగా వుంది.

జనం ఆసక్తిగా విన్నారు.

నొసట గుండ్రని బొట్టుతో,జరీ చీరలో మెరిసిపోతూ సావిత్రి సంగీత సరస్వతిలా భాసించింది. ప్రేక్షకులంతా ముగ్ధులయ్యారు ఆమె గాత్రానికి.

కార్యక్రమం ముగిసేసరికి రాత్రి పన్నెండు దాటింది. ఇంటికొస్తూనే ఇద్దరూ నిద్రలో జారిపోయారు. ఆ పాటికే బాగా నిస్సత్తువ ఆవరించింది వాళ్ళని.

ఏవేవో ఆలోచనలు అతన్ని కుమ్మేస్తున్నాయి.

తనకంటే సావిత్రి వెయ్యిరెట్లు పెద్దగా కన్పిస్తోంది! క్షణక్షణం ఎదుగుతోంది! ఆ ఎదుగుదల తమని వేరు చేయదుకదా.—అన్పించింది ఎందుకో!

తర్వాతర్వాత అసలు నిద్ర పట్టలేదతనికి.

ఉదయాన్నే సుధ పలకరించింది.

"చాలా బాగా పాడావు" అంది.

"థాంక్స్" అని ముక్తసరిగా చెప్పేసరికి సుధకిـసంభాషణ మరి కొనసాగదని తెలిసి, వెళ్ళిపోయిందామె.

చాలా బడలికగావుంది సావిత్రికి. పైగా ఆకలిగా వుంది. వెంటనే ఏదైనా తినాలన్పించింది.

ఉప్మా చేసింది. రెండు ప్లేట్లలో సర్ది మూర్తిని పిలిచింది.

"మరో కచేరీ ఏర్పాటు చేద్దామనుకొంటున్నాను" అన్నాడతను.

"మీఇష్టం"

"నీకిష్టంలేదా?"

"లేదని నేనను. అంతా మీ ఇష్టం"

"మంచి రెస్పాన్సొచ్చింది. త్వరలోనే మరొకటి ఏర్పాటు చేస్తే జనం మరిచిపోయే అవకాశం వుండదు"

"సరే అయితే"

"పని వుంది. బజారుకెళ్ళొస్తాను" అంటూ వెళ్ళిపోయాడు.

మునుపటిలా చిలిపిగా మాట్లాడటం మానుకొన్నాడు మూర్తి. ఆ మార్పు కొట్టొచ్చేటట్టుగా కన్పిస్తోంది సావిత్రికి. తనని గౌరవిస్తున్నాడు

అంటీ ముట్టనట్టుగా మాట్లాడు

తున్నాడు—

మారిపోతున్నాడా ?

లేక భ్రమేనా? అన్పిస్తోంది ఆమెకు.

భార్య వున్నతంగా ఎదగడం భర్తగా అతను సహించలేకపోతున్నాడా అన్పించింది.

తనని ఇంతవరకూ మనిషిలా చూశాడు. ఇప్పుడు వ్యాపార వస్తువుగా చూస్తున్నట్టున్నాడు.

పాట కచేరీలు డబ్బును సంపాదించి పెడతాయని వూహిస్తున్నాడు కాబోలు!

డబ్బు ముఖ్యం అయితే-తర్వాత మనుషులూ- మమతలూ ఏం అవుతాయి?

మనస్పర్థలు రాకుండా వుంటాయా?



కలిసి ఉంటామా?

-అనేక విధాలుగా సావిత్రి మనసు కకావికలమౌతోంది.

•  •  •

పాత రూంకి వచ్చాడు మూర్తి. వాసు ఒక్కడే కూర్చుని ఏదో రాసుకొంటున్నాడు.





మూర్తిని చూసి – "బ్రహ్మాండంగా వుంది గురూ ప్రోగ్రాం" అన్నాడు.

నవ్వి వూరుకొన్నాడు మూర్తి.

"సావిత్రిని దాచిపెట్టి గొప్ప కళాకారిణిని చేశావన్న మాట. వండర్‌ఫుల్ గురూ! నువ్వేదైనా చేయగలవు"

'అవును. ఇతరుల కోసం నేనేమైనా చేయగలను. కాని, నా కోసం మాత్రం నేనేమీ చేసుకోలేను' – బాధగా లోలోపలే అనుకొన్నాడు మూర్తి.

"జనార్ధనశెట్టి నీ కోసం తెగ తిరుగుతున్నాడు"

"కలిసొస్తానయితే". అంటూ మూర్తి వెళ్లిపోయాడు.

హోటల్ రద్దీగా లేదు. శెట్టి లేడు. అతగాడి భార్య వుంది. కారప్పూస తయారుచేస్తోంది. అతన్ని చూసి నవ్వి– "రండి" అంది.

"శెట్టిగారు లేరా?''

"లేరండి! బజారుకి వెళ్లారు"

"నా కోసం ఎందుకో అడిగార్ట మా వాళ్లని! విషయం ఏమిటో కనుక్కొందామని వచ్చాను" అన్నాడు మూర్తి ఆమెను తేరిపార జూస్తూ.

నవ్వుతూ నిల్చుందామె. మనిషి పెద్ద అందగత్తేమీ కాదు. నలభై సంవత్సరాలుంటుందేమో వయసు. ఆ వయసుకి మాత్రం చూడచక్కగా చిన్న సైజు పహిల్వాన్‌లా వుంది. అందుకే శెట్టి భార్యకి భయపడతాడన్న వదంతి ప్రచారంలో వుంది.

మాట్లాడుతూ, మాట్లాడుతూ లోనికి వెళ్లి వచ్చిందామె. వస్తూ ఓ కవర్ తెచ్చి అతనికి అందించింది.



"ఏమిటి?" అన్నాడు కవర్‌ని చూస్తూ.

"మా పక్కింటి అమ్మాయి పద్మ మీకివ్వమని ఇచ్చింది"

"పద్మ ఇచ్చిందా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఎందుకిచ్చినట్టు?" అన్నాడు తిరిగి.

"ఆ రూంలో మీరుంటున్నప్పుడు ఎప్పుడూ ఆ అమ్మాయిని చూసేవారటగా! ఆ విషయం చెప్పిండి–ఈ కవర్ మీకు అందివ్వమంది"

"మరింకేమీ చెప్పలేదా?"

"మరేమీ చెప్పలేదు. ముందు అదేమిటో చదివి చూడండి"

శెట్టిభార్య మాటలకి అర్థాలు తెలియట్లేదు. మూర్తికి అయోమయంగా వుంది. అక్కడి నుండి బయటపడ్డాడు. కవర్ని షాంటు జేబులో భద్రపరిచాడు.

ఇంతలో సత్యం, వాసు వచ్చి కలిశారతన్ని. ముగ్గురూ కలసి పిచ్చాపాటిలో పడ్డారు.

"మళ్లీ ఎప్పుడు కచేరి ఏర్పాటు చేస్తున్నావు?" అనడిగాడు సత్యం.

"ఇంకా డేట్ ఫిక్స్ చెయ్యలేదు. థియేటర్స్ ఖాళీగా దొరకాలిగా"

"తొందర పడకు గురూ! ఈసారి మరీ హైలెవల్‌లో చేయాలి" అన్నాడు వాసు.

అలాగేనని తలవూపి లేచినిలబడ్డాడు మూర్తి. ఇంటికి చేరుకొన్నాడు. సావిత్రి ఎంబ్రాయడరీ అల్లుతూ కూర్చుంది.

"ఎప్పుడూ ఇదే పనా?" అన్నాడు చిరాగ్గా.

"మరో పని లేనప్పుడు ఏం చేసేది?" అందామె నవ్వుతూ.

"మాటకి మాట సమాధానం" అని విసురుగా బెడ్‌రూంలోకి వెళ్లిపోయాడు. తర్వాత ఆ మాటలన్నందుకు తనని తానే

నిందించుకొన్నాడు. ఎందుకిలా ప్రవర్తిస్తున్నానను కొన్నాడు.

"ఎందుకంత కోపం?" దగ్గరగా వచ్చి అడిగింది సావిత్రి.

"ఏం లేదు. రాత్రి నిద్రలేదు. అందుకని చిరాగ్గా వుంది"

"అయితే పడుకోండి" అంది అతని నుదుటిని చుంబిస్తూ.

"ఆకలిగా వుంది"

"భోంచేస్తారా అయితే"

"ఇప్పుడొద్దు.నువ్వెళ్లు.కాసేపు నన్ను ఒంటరిగా వదిలెయ్!"

సావిత్రి మౌనంగా లేచి నిల్చుని వెళ్లిపోయింది.

ఆమె వెళ్లినట్టుగా నిర్ధారియించుకొని కవర్ బయటకు తీసి చూశాడు.

తెల్లని కవర్! కవర్ మీద ఏమీ రాసి లేదు. చించి లోని వుత్తరం తీసిచూశాడు.

అక్షరాలు పొందిగ్గాలేవు. చివరంటా చదివితే అంతా ప్రేమమయం! విరహాన్ని భరించలేనంటూ రాసింది.

తన ప్రేమను అంగీకరించకపోతే చనిపోతుందట. త్వరలో తనని శెట్టి భార్య సీతమ్మ ద్వారా కలవమని చెప్పి ముగించింది.

ఆలోచిస్తూ పడుకొన్నాడు.మూర్తి.

తన పతనం ఆరంభమయిందా అనుకున్నాడు. లేదు! లేదుగాక లేదు. మరి? సావిత్రిపట్ల ద్రోహిగా మారుతున్నాడా?

పద్మకి చేరువ కావడమంటే సావిత్రికి ద్రోహం చేసినట్టు కాదా? కాదని ఎలా అనుకోగలడు?

సావిత్రి నిన్న మొన్నటిదాకా పడుపు గత్తె! ఎందర్నో రుచి చూసింది. మరి అలాగే తను కూడా ఇద్దరి ముగ్గురి ఆడ వాళ్ల పొందు కోరడంలో తప్పేముంది?

అయితే తను అయిడెంటికల్ ఈక్వెల్ టు పూర్వపు సావిత్రా?

తల బద్దలవుతోంది మూర్తికి. మరి ఆలోచించలేకపోతున్నాడు. కవర్ మడిచి జేబులో దాచేశాడు.

ఉదయం ఏడు గంటలకి శెట్టి ఇంటికి వెళ్ళాడు.హోటల్లోజనం బాగానేవున్నారు. అందుకని మాట్లాడటం శ్రేయస్కరం కాదని లేచి పాత రూముకి వెళ్ళాడు. అక్కణ్నుంచి చూస్తే —

పద్మ ఇంటి తలుపులు తెరచివున్నాయి. అయినా పద్మ కన్పించలేదు. పది నిమిషాలు గడిపాడు అలాగే. తర్వాత మళ్లీ హోటల్ వైపు చూశాడు. జనం పెద్దగా లేరు.

చూపు హోటల్ పక్కగా వున్న సారాయి దుకాణంమీద పడింది.సీతన్రాజు స్థానంలో ఇంకెవ్వరో కూర్చున్నారు. సీతన్రాజు గుర్తుకు రావడంతోనే అరుణ జ్ఞప్తికొచ్చింది.

ఎవరి సుఖం వాళ్లు చూసుకొంటున్నారన్పించింది అతనికి. తనని కాదంది. ఇంకొకర్ని పెళ్లి చేసుకుంది. అందుకు కోపం లేదు తనకి. మరి? ప్రేమించి-ప్రేమను భగ్నం చెయ్యడం మాత్రం భరించలేనిదని పించింది.

పది గంటల దాకా అక్కడే కూర్చున్నాడు. శెట్టి మార్కెట్‌కి వెళ్లాడు. వెంటనే వెళ్లి సీతమ్మని కలిశాడు చిరునవ్వు నవ్విందామె.

"పద్మ నీకెలా తెలుసు సీతమ్మా?" అన్నాడు.

"నాకెందుకు తెలీదు బాబూ! మేం వుంటూన్న ఈ ఇల్లు వాళ్ళదేగా! ఆ విధంగా పరిచయం"అంది కాఫీ తెచ్చిస్తూ.

"ఉత్తరం చదివారా?" అంది తిరిగి.

"చదివాను"

"వుత్తరం చదివి మీ అభిప్రాయం చెప్పమంది. మీ అభిప్రాయం తెలిస్తే తననెలా కలిసేది తర్వాత చెప్తానంది"

"నేనూ ప్రేమిస్తున్నానని చెప్పు! ఎక్కడ కలవమంటుందో అడుగు"

"అయితే సాయంత్రం మళ్లీ రండి! ఈలోగా కనుక్కొంటాను"

"సరే" అంటూ లేచాడు.

"ఇప్పుడయితే వాళ్ల వదినగారు ఇంట్లో వుంటారు. సాయంత్రం అయితే ఆవిడుండదు. మార్కెట్‌కి వెళ్తుంది" సీతమ్మ సలహా ఇచ్చినట్టుగా అంది.

ఇంటికి వెళ్ళాడు మూర్తి. సావిత్రి ఏదో డిజైన్ అల్లుతూ కూర్చుంది. ఆమెను చూస్తూంటే చిరాగ్గా వుందతనికి. ఏకాగ్రతతో పని చేస్తోందామె. పలుకరించకుండానే పక్కగా కుర్చీలో కూర్చున్నాడు.

మధ్యాహ్నం భోజనాలయ్యాయి.

మళ్లీ మామూలు తంతే! ఆమె ఎంబ్రాయిడరీ అల్లుకొంటూ కూర్చుంది.

సాయంత్రం అయిదయింది.

సావిత్రి కాఫీ తెచ్చి అందించింది. తాగి శెట్టి హోటల్‌వైపు బయల్దేరాడు. శెట్టి ఆ సమయానికి అక్కడలేడు. సీతమ్మ ఒక్కర్తేవుంది.

"ఈ రాత్రి సెకండుషో సినిమాకి వస్తానంది. అక్కడ కలవమంది" అంటూ థియేటర్ పేరు చెప్పింది సీతమ్మ.

అలాగేనని తల వూపాడు.

"గొప్పగా తెగిస్తోంది" అన్నాడు నవ్వి.

"తెగింపు ఆడవాళ్లకే చెల్లుమరి" నవ్వింది సీతమ్మ.

"టిక్కెట్లు తీసి వుంచుతాను. తప్పక రండి!" అని లేచాడు. పాత రూముకి వెళ్లి రాత్రి తొమ్మిది గంటల వరకూ మిత్రులతో కాలక్షేపం చేశాడు. తర్వాత ఇంటికి వెళ్ళాలన్పించక నేరుగా థియేటర్ వైపు మళ్ళాడు.

అప్పటికే థియేటరు దగ్గర సీతమ్మ, పద్మ కాచుక్కూర్చున్నారు. జనం అట్టేలేరు. ఏదో పాత సినిమా. ఆరోజే ఆఖరు. మూడు బాల్కనీటిక్కెట్లు తీశాడు మూర్తి. ముగ్గురూ కలసి వెళ్ళారు. సీతమ్మ రెండుమూడు సీట్ల వెనుగ్గా కూర్చుంది. పద్మ అతని పక్కనే కూర్చుంది. సిగ్గుతో తల వంచుకొంది.

"నువ్వు నన్ను ఆశిస్తున్నావంటే నమ్మలేకున్నాను" అన్నాడు ఆమె భుజమ్మీద చేయి వేస్తూ.

"ఏం? నేనాడదాన్ని కానా?"

"కాదని నేనన్నానా! నేనెంతగా ప్రేమించినా అందని ద్రాక్షవన్ని వూరుకొన్నానిన్నాళ్లూ. మరీనాడు ఆ ద్రాక్షే దిగొచ్చింది"

నవ్విందామె ఆ మాటలకి.

"సీతమ్మకి మన విషయం చెప్పాను. వెంటనే వుత్తరం రాయమంది. తను అందజేస్తానంది. ఇంతకన్నా మరో అవకాశం లేదని ఇలా వేశాను..."

"గుడ్" నవ్వాడతను.

"సీతమ్మ మన ప్రేమ వారధి"

"నిజమేమరి" అంటూ ఆమెను తన కుర్చీలోకి లాక్కున్నాడు.

ఆమె బెదురుగా ఇటూ అటూ చూసింది—"ఎవరైనా చూస్తారు" అంది.

"ఎవరూ చూడరు! పైగా ఇది బాల్కనీ! ఇంత ఖరీదు పెట్టి ఈ వూళ్లో

మరెవరూ టిక్కెట్టు తీసి పైకి రారు. వచ్చేవాళ్లయితే ఇంత సేపు ఆలస్యం చేయరు" అన్నాడు

"సీతమ్మ చూస్తోంది"

"ఆవిడ చూసినా తప్పులేదు"

సినిమా ప్రారంభమయింది. పౌరాణిక చిత్రం. పూర్తయ్యేసరికి బాగా రాత్రయింది.

రిషా ఎక్కుతున్న పద్మని అడిగాడు

"మళ్ళీ ఎప్పుడు తమ దర్శనం?"

"రేపు సాయంత్రం రండి! వాళ్ళాదిన వుండదు" అంది సీతమ్మ. పద్మ నవ్వుతూ కూర్చుంది. మాట్లాడలేదు. రిషా కనుమరుగు అయ్యేవరకూ అక్కడే నిలబడి తర్వాత ఇంటి దారి పట్టాడు.

ఇంటి తలుపు తడితే– "ఎవరూ!" అంటూ సావిత్రి ప్రశ్నించింది.

"నేనే!"

తలుపు తీసిందామె.

"సినిమాకి వెళ్ళారా?" అంది అతన్ని చూస్తూ.

"ఆఁ! ఫ్రెండ్స్‌తో వెళ్ళాను" అంటూ నిద్రకుపక్రమించాడు.

"భోంచేయరా?"

వద్దన్నట్లు తలూపాడు. చిత్రంగా అతన్ని చూస్తూ పక్కలోకి చేరిందామె.

మర్నాడు శెట్టి ఇంటికి వచ్చేసరికి సీతమ్మ ఒక్కర్తే వుంది. మూర్తిని చూసి ఆహ్వానించింది.

"శెట్టిగారు మార్కెట్‌కి వెళ్ళారు. ఆయనొచ్చే వరకూ వుంటారా?" అంది నవ్వుతూ.

"నేను ఆయన కోసం రాలేదని నీకు తెలీదా?" అన్నాడు మూర్తి తమాషాగా.

"తెలుసు. అదే బాధ! ఆయన మరో అరగంటలో వచ్చేస్తారు. ఇంకా పద్మ వదినగారు మార్కెట్‌కి వెళ్ళలేదు. ఏం చేయాలో అర్థం కావట్లేదు. ఆయనొచ్చే సరికి మీరిద్దరూ ఇక్కడ వుండడం శ్రేయస్కరం కాదు కదా" అంది.

"మరెలా?" ప్రశ్నించాడు.

"ధైర్యం వుంటే పద్మ గదిలోకి వెళ్ళండి! గదిలో ఆమె ఒక్కర్తే వుంటుంది. వదినగారు ఆ గదిలోకి రాదు"

"కొంపదీసి చూస్తే..."

"ప్రేమికులకు అంత భయం వుండకూడదు. మా పెరట్లోంచి వెళ్తే ప్రహరీ గోడ దాటాలి. అది దాటితే పద్మ గది. ఆలోచించండి"

ఆలోచించాడు మూర్తి. 'సీజర్‌లాంటి వాడే ఆడదాని కోసం నానా పాట్లూ పడ్డాడు. తనోలెక్కా జమా' అనుకున్నాడు. 'సరే'నన్నాడు.

సీతమ్మ పెరట్లోంచి పదిగజాలు ముందుకి వెళ్ళాడు. ప్రహరీ గోడ కన్పించింది. దాన్నెక్కాడు.

ఎదురుగా పద్మ కుర్చీలో కూర్చుని చదువుకుంటోంది. ఇతన్ని చూస్తూనే తత్తరపడింది.

చప్పున గెంతి రహస్యంగా "యమయాతన పెట్టావుకదా!" అన్నాడు ఆమె దగ్గరగా వచ్చి.

"ప్రేమికులకు ఈ బాధలు తప్పవు" అంది నవ్వుతూ.

గది తలుపులు మూసేసింది.

"ఇంట్లో ఎవరూ లేరా?" అన్నాడు ఇల్లంతా నిశ్శబ్దంగా వుండటంతో.

"ఇప్పుడే వదిన మార్కెట్‌కి వెళ్లింది. మీరొచ్చారు"

"ఓ గంటక్కాని రాదుగదా ఆవిడ" అనడిగాడు.

"రాదులెండి"

"హమ్మయ్య! బతికించావు. ఓ గంట హాయిగా కబుర్లాడుకోవచ్చు" అంటూ ఆమెనుహాయిగా చేతుల్లోకి తీసుకొన్నాడు.

పద్మ సిగ్గుపడింది. అతని కౌగిలిలో ఇమిడిపోయింది.

"ఇలాగే జీవితాంతం వుండిపోతే బాగుణ్ను"

"అది నీ ఇష్టాయిష్టాల మీద ఆధార పడి వుంటుంది. నువ్వు సరేనంటే నేను రడీ!" అన్నాడతను.

అతని కళ్లల్లోకి మత్తుగా చూసిందామె.

గంటసేపూ నిముషంలా గడిచిపోయింది.

తిరిగి అదే పెరట్లోంచి వెళ్లిపోయాడు మూర్తి.

"వెళ్ళిపోతున్నారా?" అనడిగింది సీతమ్మ.

"అవును" అని బయటపడ్డాడతను.

వీధిలోకి వచ్చి చూశాడు. పద్మ— ఇంటి తలుపులదగ్గర నవ్వుతూ నిల్చుని వుంది. మూర్తిని చూసి చేయి వూపింది 'టాటా' చెప్తున్నట్టుగా.

నవ్వుకొన్నాడు మూర్తి.

ఈ తతంగాన్నంతా పాత రూమ్ నుండి వాసు కనిపెట్టాడు. చప్పట్లు చరిచి మూర్తిని కేకేశాడు.

"గొప్ప ఛాన్సు కొట్టేశావు గురూ!" అన్నాడు. వాసు మాటలు చక్రవర్తికి ఏమీ అర్థం కాలేదు. విడమరిచి చెప్పే "గొప్పవాడివి గురూ! అదృష్టం నిన్ను వెతుక్కొంటూ వస్తోందన్నమాట" అన్నాడు.

ఇద్దరి మాటలకీ చిరాకెత్తుకొచ్చింది మూర్తికి.

"ఏమిట్రా గోల" అనడిగాడు.

"గోల! ఎంత మాట అన్నావు గురూ! ఇది రాసలీలాలాపన! రాధిక, కృష్ణుల రహస్య ప్రణయం. చూసినవారి కన్నుల స్వర్గం" చక్రవర్తి కలుగజేసుకొన్నాడు.

విసుగ్గా వుంది మూర్తికి. అతని మూడ్ బాగాలేదని గ్రహించి వాసు —

"మళ్లీ పాట కచేరీ ఎప్పుడు ఏర్పాటు చేస్తున్నట్టు?" అనడిగాడు.

"మరో పదిహేను రోజుల్లో"

"రమ్మంటావా?"

"రారా!"

"రారా? ఎంత మాట గురూ! రాక తప్పుతుందా" అన్నారు ఇద్దరూ ముక్త కంఠంతో.

ఇంతలో కృష్ణారావు వచ్చాడు. దాంతో టాపిక్ మార్చేశారంతా. మూర్తి 'వస్తా' నంటూ బయటకి నడిచాడు.

ఇంటికి వెళ్లాడు.

ఇంటికి తాళం వేసివుంది. సావిత్రి ఎక్కడికి వెళ్లిందో అంతుపట్టక తిరిగి రోడ్డు పట్టాడు. పోతూ పోతూ సుధ ఇంటివైపు చూశాడు. అదీ తాళం పెట్టి వుంది.

ఇద్దరూ కలసి ఎక్కడికి వెళ్లివుంటారన్నది తెలియక తికమక పడ్డాడు.

ఇంతలో రానే వచ్చారిద్దరూ. మూర్తిని చూసి సుధ వెళ్లిపోబోయింది.

"ఎక్కడికి వెళ్లావు?" సావిత్రిని ప్రశ్నించాడతను.

"ఆస్పత్రికి వెళ్ళాం! సావిత్రికి వాంతయింది. తల తిరుగుతున్నట్టుగా వుందంటేనూ వెళ్లకతప్పిందికాదు" సుధ సమాధానమిచ్చింది.

"ఏమైంది?" ఆత్రంగా అడిగాడు.

"ఏంకాలేదు. త్వరలో మీరు తండ్రి కాబోతున్నారంటే" అంది సుధ నవ్వుతూ.

తర్వాత వెళ్ళిపోయింది.

తల వంచి కూర్చున్న సావిత్రి వైపు రెప్ప వాల్చకుండా చూస్తున్నాడతను. సిగ్గుపడుతోందామె. లేచి వెళ్ళి ఆమెను దగ్గరగా తీసుకున్నాడు.

"బాబా, పాపా?"

"ఎవరో నాకేం తెలుసు?"

"అయితే బాబే"

"కాదు పాప"

"ఊహు" నవ్విందామె.

ఆమెను అక్కున చేర్చుకున్నాడతను.

"జాగ్రత్తగా ఆరోగ్యాన్ని కాపాడుకో! అన్నట్టు మరో పదిహేను రోజుల్లో నీ పాటకచేరీ ఒకటి ఏర్పాటు చేస్తున్నాను. సిద్ధంగా వుండాలి" అన్నాడు నవ్వుతూ.

"అలాగే" అందామె.

* * *

ఆ రోజు సావిత్రి పాటకచేరీ!

థియేటర్ ముందుగానే బుక్ చేసారు. టిక్కెట్లు కొంతవరకూ అమ్మకం జరిగాయి. జనం బాగానే వచ్చారు.

ఈరకంగా వరుసగా మరో ఏడెనిమిది కచేరీలు ఏర్పాటు చేస్తే లాభం బాగానే వుంటుంది. ఆ డబ్బుతో నాటకాలు మళ్ళీ మొదలు పెట్టొచ్చు. ఎంత సేపూ నాటకాల మీదే అతని దృష్టి. వాటిని కాంట్రాక్టుగా తీసుకొంటే రోజులు గడుస్తాయని ఆలోచిస్తున్నాడతను.

కచేరీకి మూర్తి మిత్రబృందం సహకారం ముమ్మరంగా వుంది.

వాసు, చక్రవర్తి టిక్కెట్ల బుకింగ్ దగ్గర కూర్చున్నారు. మిగతా వాళ్ళు గేట్ దగ్గర నిల్చున్నారు.

సావిత్రి గ్రీన్ రూంలో వుంది.

ముందు వరుసలో శెట్టి భార్య, పద్మ, సుధ కూర్చున్నారు. వాళ్ళ వెనుకగానే కమల, అరుణా కూర్చున్నారు. అరుణకు ఈ కచేరీ ఏర్పాటు మూర్తిదేనన్న సంగతి ఇప్పుడే తెలిసింది. సావిత్రికీ, అతనికీ వున్న సంబంధాన్ని అంచనా వేస్తూ కూర్చుందామె.

పోలీసు బందోబస్తును ముందుగానే కోరడం వల్ల వాళ్ళు సరిగ్గా టైంకు వచ్చారు. ఇన్స్పెక్టరు జగన్ బలగాన్నంతా పనులకి పురమాయించి లోని కొచ్చాడు. థియేటరంతా కళకళలాడు తోంది. నేరుగా గ్రీన్ రూంలోకి దారి తీశాడు.

గ్రీన్ రూంలో సావిత్రి జడ వేసు కొంటున్నది. అద్దంలో తన ప్రతిబింబం వెనుక మరొకరు కన్పించడంతో వెను తిరిగి చూసింది.

ఇన్స్పెక్టర్ జగన్!

ఆమె దగ్గరగా వస్తూ — "నమస్తే సావిత్రిగారూ" అన్నాడు. అంటూనే ఆశ్చర్యపోయాడు.

సావిత్రి అతనికి పదుపుగ తెగా బాగా తెలుసు. రెండు మూడుసార్లు బ్రోతల్ కేసులో అరెస్టయితే తర్వాత జాలిపడి వదిలేశాడు. ఆ తర్వాత తర్వాత ఆమెతో సుఖాన్ని పంచుకొన్న సందర్భాలు కూడా కొన్ని వున్నాయి. అవన్నీ జ్ఞాపకొచ్చాయి అతనికి.

"నువ్వా?" అన్నాడు మరింత దగ్గరగా వచ్చి ఆమెను నఖశిఖపర్యంతం పరీక్షిస్తూ.

అవునన్నట్టుగా తలూపిందామె.

మునుపటికన్నా అందంగా వుందిప్పుడు. రంగు దేరింది. పట్టు చీరెలో మెరిసి పోతోంది.

"ఈ మధ్య తమరి దర్శనాలే లేవు. ఎక్కడుంటున్నట్టు" అని ఆమె భుజం మీద చేయివేశాడు. అతని చేతిని తీసి



వేసిందామె.

"నాకు పెళ్లయింది. నేనిప్పుడు పాత సావిత్రిని కాను. మావారే ఈ కచేరీ ఏర్పాటు చేశారు" అంది అతనికి దూరంగా జరిగి.

ఆ మాటలకి పకపకా నవ్వాడతను.

"అయితే నువ్విప్పుడు కొత్త సావిత్రివి అన్నమాట! పెళ్ళి చేసుకొని ఇల్లాలివి అయిపోయావన్నమాట. గుడ్! చాలా బాగుంది. ఏమే లంజా! ఎవడే నిన్ను పెళ్లి చేసుకొన్నది? రమ్మను నా దగ్గరికి" అన్నాడు మీది మీదికొస్తూ.

ఆమె చేతిని అందిపుచ్చుకున్నాడు. విదిలించుకోడానికి శతధా ప్రయత్నిస్తూ ఏడుస్తోంది.

"వదలండి! నన్నొదలండి" వేడుకుంటోంది.

"చచ్చినా వదల్ను నిన్ను. ఈ రాత్రికి మర్యాదగా నా కోరిక తీర్చు. లేకపోతే నిముషాల మీద కేసు బుక్ చేసి

బొక్కలో తోసేస్తాను" అంటూ ఆమెను అందుకోబోయాడు. ఆమె ముఖం తిప్పుకుంది.

అప్పుడే మూర్తి లోనికొచ్చాడు.

జగన్ సావిత్రిని బలాత్కారం చేయబోతున్నాడు. సావిత్రి గింజుకొంటోంది. వద్దువద్దని వారిస్తోంది. ఏడుస్తోంది.

మూర్తిని చూసి ఇన్‌స్పెక్టర్ పట్టు సడలించాడు. అతని దగ్గరగా వచ్చి ఆయాసపడుతూ—

"ఈ బజారు లంజని..." అంటూ ఏదో అనబోయాడు.

"షటప్! మర్యాదగా మాట్లాడండి. అసలు మా పర్మిషన్ లేకుండా మీరు గ్రీన్‌రూంలోకి ఎందుకొచ్చారు?" అనడిగాడు మూర్తి. వాణ్ణి తందామని వున్నా నిభాయించుకున్నాడతను. ఇన్‌స్పెక్టర్ని తంతే లేనిపోని గొడవలని ఆలోచిస్తున్నాడు. పైగా థియేటరంతా ఈ అల్లరికి అల్లకల్లోలం అవుతుందని భావించి నిలదొక్కుకొంటున్నాడు ఆవేశాన్ని.

"నేనెవర్నో తెలుసా?" హూంకరించాడు జగన్.

"పోలీసు ఇన్‌స్పెక్టరివి. అంతే నీ హద్దుల్లో నువ్వుండు! లేకపోతే! కాని పనులు జరుగుతాయి"

"ఏమన్నావ్" అరిచాడు ఇన్‌స్పెక్టర్.

ఈ హడావుడికి మిత్రబృందం అక్కడికి వచ్చి చేరింది. సమయం తనది కాదనుకొన్నాడేమో ఇన్‌స్పెక్టర్ సందు చూసుకొని తుర్రుమన్నాడు

"ఏమైంది?" అనడిగాడు వాసు.

''ఏం జరగలేదు.మీరువెళ్ళి థియేటర్లో అల్లరి జరగకుండా చూడండి ముందు'' హెచ్చరించాడు మూర్తి.

"సరే" అన్నారంతా.

గోడకి తలాన్చి ఏడుస్తూ కూర్చుంది సావిత్రి. రవిక చిరిగిపోయుంది. తల చెదిరింది.

ఆమె దగ్గరగా వచ్చాడు మూర్తి. అతని కాళ్ళని చుట్టుకొని – "ఇందులో నా తప్పు లేదండీ!'' అంది ఏడుస్తూ.

''తప్పు ఎవరిదీ లేదు. సర్లే! ముందు రడీకా! అవతల టైము అవుతోంది'' అన్నాడు కటువుగా.

ఆ కటుత్వానికి చలించిపోయిందామె. లేచి అద్దం ముందు నిలబడింది. చెదిరిన జుత్తును సరిచేసుకొంది. చిరిగిన జాకెట్టు మీదుగా పైటను కప్పింది. వెళ్ళి శ్రోతలకి ఎదురుగా కూర్చుంది. గొంతు సరిచేసుకొంది.

వైకుంఠపాళిలాంటి జీవితంలో పాములు అనేకం. అవన్నీ తనని మింగడానికే చూస్తున్నాయి. వాటన్నిటినీ తను అధిగమించగలగాలి. గమ్యస్థానం చేరుకోగలగాలి. ఎలా? ఈ కష్టాలు తప్పవా? కాపురం సజావుగా సాగదా? భగవాన్...

తల బద్దలవుతోంది సావిత్రికి. అయినా రాగాలాపన చేయక తప్పదు.

గంటసేపు శ్రోతల్ని ముగ్ధుల్ని చేసింది.

అందరూ జోహార్లర్పించారు.

ఆపాటికే బాగా అలసిపోయింది సావిత్రి. వంట్లో నీరసంగా ఉందనిపించి అంతటితో కచేరీ ఆపేసింది. శ్రోతలకి నమస్కరించి వెళ్ళిపోయింది.

శ్రోతలలో చాలా మంది ఆమెను ఎరుగుదురు. ఆమె గతాన్ని కథలుగా చెప్పుకొన్నారు కొందరు.

మూర్తి దగ్గర శలవు తీసికొని పద్మ, శెట్టిభార్యా వెళ్ళిపోయారు.

కమల అతని దగ్గరగా వచ్చింది.

"బాగున్నారా?" అని పలకరించింది.

"బాగున్నాను.మీరు క్షేమమే కదా?''
అని ఎదురు ప్రశ్నించాడు. అరుణ అక్కకి పక్కగా నిల్చుంది. మాట్లాడలేదు.

"మేం క్షేమమే! మీరే ఎప్పుడైనా కలుస్తారేమోనని చూస్తున్నాం'' అందామె.

"కలిసే అవకాశం మీరు కల్పించలేదుగా" నిక్కచ్చిగా అన్నాడు మూర్తి.

కమల తలవంచుకొంది.

''నిజమే పొరపాటు చేశానండి! దాన్ని మీ చేతుల్లో పెట్టినా బాగుండిపోను" అంది పశ్చాత్తాపంగా.

ఏమయిందన్నట్లు ఆర్తంగా చూశాడు ఆమె వైపు.

"తాగుబోతు వెధవ! నక్కజిత్తుల్తో మమ్మల్ని మాయజేసి దీనికి తాళికట్టాడు. రోజూ వచ్చి చావబాదడం తప్పా మరో పనిలేదు వాడికి''

ఏడుస్తోందామె.

అరుణవైపు చూశాడతను.

ఆమె బరువుగా ఊపిరి తీస్తోంది.

''వస్తామండీ!" కమల ముందుకు నడిచింది.

వెనుక అరుణ అనుసరించింది. వెళ్ళిపోతూ మూర్తిని ఓ చూపు చూసింది. ఇద్దరి చూపులూ ఒక్కక్షణం కలుసుకొన్నాయి.అరుణకి అక్కుళ్ల బుక్కుళ్లుగా ఏడుపు ముంచుకొచ్చింది.

రద్దీ బాగా తగ్గింది.

సుధ, సావిత్రి మూర్తి దగ్గరగా వచ్చారు.

"వెళ్లిపోదాం'' అన్నారు.

"అలాగే" అన్నాడతను.

రాత్రి చాలా పొద్దుపోయింది.

సావిత్రికి నీరసంగా ఉంది. కుర్చీలో కూర్చుని ఆలోచిస్తోందామె.

"ఆకలిగా లేదా?'' అనడిగాడు.

సమాధానమివ్వలేదామె. లేచి వెళ్లి పాలు కాచింది. రెండు గ్లాసులతో తెచ్చింది. ఓ గ్లాసు అందించింది.

అప్పుడు ఆమె ముఖంలోని రంగుల్ని చూడాలనుకొన్నాడతను. తలెత్తి ఆమె వైపు చూశాడు.

మౌనముద్రలో ఉన్నట్టుందామె.

"నన్ను క్షమించండి! నా వల్ల ఏం తప్పులేదు'' వెక్కుతూ అందామె.

''ధైర్యం ఉంటే రెండిచ్చుకోవల్సింది. ఆడదంటే వాడికి అలుసుగా తోస్తోంది కాబోలు'' రెచ్చిపోయాడతను.

"వాడు పోలీసువాడన్న భయం! లేకపోతే అంతపనీ చేద్దును. దేవుడి దయ వల్ల మీరా సమయంలో రాబట్టి సరిపోయింది. లేకుంటే..." డగ్గుత్తికతో అతని మీద వాలిపోయింది. ఆమె కన్నీళ్లు అతని గుండె మీద పడి ఇంకిపోతున్నాయి.

మగాడిగా, మగడుగా మూర్తి ఆ రోజు తనని చావబాదుతాడనీ, అనుమానిస్తాడనీ ఎన్నెన్నో వూహించింది సావిత్రి. అయితే ఆ వూహలన్నీ ఇపుడు అపోహలైనాయి.

మూర్తి అసలు ఏమీ జరగనట్టుగానే అనుకొంటున్నాడు.

"వాడికి తగిన శాస్తి చెయ్యాలి. ఓసారి బుద్ధిచెపితే కాని మనిషి బాగు పడడు"

"ఆ వెధవతో పోరుమంచిది కాదేమో?"

"మంచిదో చెడ్డదో చూద్దువుగాని. వాడి అంతు చూస్తాను" పళ్ల కొరికాడు మూర్తి.

ఆమె మాట్లాడలేదు మరి.

మూర్తి అంతపని చేయగలడా? చేసి బతికి బట్ట కట్టగలడా? సాహసిస్తున్నాడేమో!

పరిపరి విధాలా మనసు పోతూంటే నిద్ర ముంచుకొచ్చిందామెకి.




మర్నాడు ఉదయం –

మిత్ర బృందంతో చర్చలు జరిపాడు మూర్తి.

"వాడి భరతం పట్టాల్సిందే" అన్నాడు వాసు.

"తొక్కచించి డోలు కట్టాలి వెధవకి" చక్రవర్తి రెచ్చిపోయాడు.

"ఈ దెబ్బతో వాడికి బుద్ధిరావాలి" వుద్రేకంతో వూగిపోయాడు మూర్తి.

ఇన్‌స్పెక్టర్ జగన్‌ని అంతం చెయ్యాలని నిర్ణయించుకొన్నారంతా. ఆ ఆవేశం వాళ్ళని ఉన్మత్తుల్ని చేసింది.

ఆ రోజు రాత్రి –

దారి కాశారు. ఆ దారంటే వస్తాడు ఇన్‌స్పెక్టర్. వాడికోసం ఎదురు చూస్తున్నారు.

దారికి ఇరుపక్కలా మురికి కాలవలు వున్నాయి. అక్కడ దోమలు వీరవిహారం చేస్తున్నాయి. అంతగా వెలుతురులేదక్కడ.

ఇన్‌స్పెక్టర్ వస్తున్నాడు.

ముందుగా ఒకడు వెళ్ళి అడ్డునిలిచాడు. ఎవడో తాగుబోతు వెధవనుకొని – "ఏరా లక్ష్మీకే! వళ్ళెలావుంది?" అని గర్జించాడు జగన్.

"బాగానే వుంది" అంటూ అతని మీదకి వురికాడతను. ఈ లోపు మిగతా బృందం చేయిచేసుకుంది.

వూహించని పరిణామం. నోట మాట రాలేదు జగన్‌కి.

చితక్కొట్టారతన్ని. కాలికొచ్చిన తాపు, చేతికొచ్చిన గుద్దూ గుద్దారు. మనిషి సొమ్మసిల్లినట్టన్పిస్తే – మురికి కాలువలోకి గిరవాటేసి వెళ్ళిపోయారు.

మోకాలి లోతు కాలువలో వెల్లకిలా పడ్డాడు జగన్. గట్టిగా దెబ్బలు తగలడంతో శరీరం అంతా నొప్పిగా వుంది. అయినా కాలూ చేయీ కూడదీసుకొని బయటపడ్డాడు.

దీర్ఘంగా ఆలోచించాడు.

ఎవరు చేశారీపని? ఎందుకు చేశారు? లేదా ఎవరు చేయించి వుంటారు?

అతనికేమీ అంతుపట్టలేదు. చివరికి నిన్న రాత్రి జరిగిన సంఘటనా–దాని వెనుక మూర్తీ కళ్ళకు కట్టినట్టు కన్పించారు.

'వాడిదే ఈ పని' అని నిర్ణయించుకొన్నాడతను.

దాని అంతూ, వాడి అంతూ చూడకపోతే నిద్రపోనని భీష్మించుకున్నాడు. అవకాశం దొరికితే సావిత్రినీ, మూర్తినీ కరకర నమిలేయాలనుకొన్నాడు.

అంతే!

అర్థంకాని, అర్థంలేని దొంగ కేసుని బనాయించాడు మూర్తి మీద వారం రోజుల్లో. వెంటనే అరెస్టు చేసి అతన్ని తీసుకొచ్చాడు. సావిత్రిని మాత్రం ఇప్పుడప్పుడే ఏం చేయకూడదని నిశ్చయించుకొన్నాడు.

పరిస్థితిని ఆకళింపు చేసుకొంది సావిత్రి.

ఈ రోజు అతను! రేపు తను! తనని నాశనంచేసి కాని జగన్ నిద్రపోదను కొందామె. ఏం చెయ్యాలో, ఎక్కడికి వెళ్లాలో అంతు తెలీట్లేదు.

'ఆయన్ని విడుదల చేస్తారా? చేసి తమ మానాన్న తమని బతకనిస్తారా' అని ఆలోచిస్తోంది.

రాత్రి చాలా సేపటి వరకూ నిద్ర పట్ట లేదామెకి.

ఉదయాన్నే కానిస్టేబుల్ కబురు తెచ్చాడు—

"మిమ్మల్ని ఇన్‌స్పెక్టర్‌గారు రమ్మంటున్నారు"

ఆ మాటకి వణికిపోయిందామె. పారిపోయి మరెక్కడో అక్కడ తలదాచుకొనే అవకాశం కూడా లేదనుకొంది. ఏడుస్తూ బయల్దేరింది.

"ఎక్కడికి?" సుధ ఆత్రంగా ప్రశ్నించింది వచ్చి.

"ఇన్‌స్పెక్టర్ రమ్మన్నార్ట" దుఃఖిస్తూ వెళ్లింది సావిత్రి.

సుధకి బాధన్పించింది. ఇంట్లోకి వెళ్లి భర్తని అడిగింది—

"పాపం సావిత్రిని స్టేషన్‌కి రమ్మన్నార్ట! అమాయకపు పిల్ల. అక్కడే ఘోరాలు ఎదుర్కోవలసి వుంటుందో! అతగాడంటే మగాడు—జైల్లోవున్నా ఫర్వాలేదు. కాని ఆడది... తనేమవుతుందో నన్న భయంవేస్తోంది నాకు. ఆమెను ఆ బారి నుండి రక్షించలేరూ?"

భార్య ఆవేదనని అర్థం చేసుకొన్నాడతను. వెళ్లి టౌన్లో పలుకుబడిగల లాయర్ ఖాన్‌తో మాట్లాడాడు. ఇద్దరూ కలసి పోలీసు స్టేషన్‌కి వెళ్లారు.

జగన్ రూంలో శిలాప్రతిమలా నిల్చుని వుంది సావిత్రి. ఇన్‌స్పెక్టర్ ఏవేవో ప్రశ్నిస్తున్నాడు. ఆమె వేటికీ సమాధానాలియ్యక స్థాణువై నిల్చుని వుంది.

లాయర్ ఖాన్‌ని చూడగానే లేచి నిల్చున్నాడు జగన్. నమస్కారం చేశాడు.

విషయ సేకరణ చేశాడు ఖాన్.

"నిజంగా ఆయన దొంగతనం చేశారంటావా?" అని ప్రశ్నించాడు.

"చేశాడు సార్! దానిక్కావలసిన ఋజువులూ, సాక్ష్యాలూకూడా వున్నాయి"

"అతను దొంగతనం చేశాడు—అరెస్ట్ చేశారు. బాగుంది! మరి ఈమెనెందుకు నిర్బంధించారు"

"అహఁ... అదే" నసిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఈమెకు నేను జామీన్ ఇచ్చి విడిపిస్తున్నాను. కేసని—కోర్టని అంటే నేరుగా అక్కడే ఆమెను హాజరుపరుస్తాను. ఓకే!" ఖాన్ భీకరంగా మాట్లాడాడు.

ఖాన్ మాటల్ని తిరస్కరిస్తే ఉద్యోగానికే ముప్పురావచ్చు ననుకొన్నాడు జగన్. పలుకుబడి, పరపతివున్న లాయర్ చేతిలో ఏమైనా జరుగుతుందని వూహించి అతని మాటల్ని కాదనలేకపోయాడు.

"మీ ఇష్టం" అన్నాడు.

చేజారింది పిట్ట. లీవిట్! దాని ప్రియుడు మాత్రం చేతిలోనే వున్నాడుగా—వాడి రక్తం తాగుతాననుకొన్నాడు ఇన్‌స్పెక్టర్.

దారిలో సావిత్రితో అన్నాడు ఖాన్—

"ఆ లంకంత కొంపలో ఒంటరిగా నువ్వు వుండలేవు. నా మాట విను. మా ఇంటికిరా! ఒక్కర్తెగా వుండడం క్షేమం కూడ కాదు"

అవునని, కాదని ఏమీ చెప్పలేదు సావిత్రి.

"ఏమంటావ్?" రెట్టించాడు ఖాన్.

"మీ ఇష్టం" అని మాత్రం అనగలిగిం

దామె.

నవ్వాడు ఖాన్.

సావిత్రి ఇంటి సామానన్నీ ఖాన్ ఇంటికి చేర్చబడ్డాయి.

మూర్తిని లాకప్‌లో పెట్టారు.

జగన్‌కి మూర్తి అంతు చూడాలని వుంది.

అతన్ని నాశనంచేస్తే కాని నిద్రపోనను కొన్నాడు.

* * *

ఖాన్ ఇంట్లో వంట మనిషి తప్ప మరెవరూ లేరు. ఆమె వండి పెడితే తినడం తప్పా మరో ధ్యాస లేకపోయింది సావిత్రికి.

ఖాన్ భార్య చనిపోయి ఆరేళ్ళయింది. పిల్లలు లేరు. ఒంటరిగా వుంటున్నాడతను.

వయసు మళ్లిన అతనికి చేదోడూ వాదోడూ అవసరం ! సావిత్రి ప్రవర్తన అతనికెంతో నచ్చింది. ఆమె అంటే గౌరవం ఏర్పడింది.

అనాధ అయిన ఆమెను తనదాన్ని చేసుకోవడంలో తప్పులేదన్పిస్తోంది అతనికి. అందుకు సావిత్రి అంగీకారం వుంటుందా అన్నది ప్రశ్న !

మూర్తిని ఇప్పుడిప్పుడే విడిచే స్థితిలో లేడు ఇన్‌స్పెక్టర్.

ఈ విషయాలన్నీ విడమరిచి చెప్పి—

"నాకు నీ తోడు అవసరం. నన్ను కాదనకు సావిత్రీ ! నీతో నేను ఆప్యాయతనీ, అనురాగాన్నీ పంచుకోనీ" అన్నాడతను.

అర్థం కానట్లు అతని వైపు చూసిందామె.

"మూర్తి తిరిగొస్తాడన్న ఆశ వదులుకో. ఎందుకు చెప్తున్నానో నమ్ము ఆ ఇన్‌స్పెక్టర్ అతని అంతు చూస్తానని ప్రతిజ్ఞచేసి మరీ కూర్చున్నాడు. ఏవేవో దొంగకేసులు బనాయించి అతన్ని జైలు పాలు చేయక మానడు"

"అయితే?" ఆందోళన పడిందామె.

"నీ జీవితం నాశనం చేసుకోకు. నన్ను కాదని నువ్వు ఒంటరిగా వుంటే జగన్ నిన్ను ఆట పట్టించక మానడు. ఆలోచించు"

పిచ్చిగా నవ్వింది ఆ మాటలకి సావిత్రి.

"పెళ్లి...నన్ను పెళ్లి చేసుకొంటారా బాబూ! నాకు మళ్లీ పెళ్ళా? వద్దుబాబూ వద్దు. నా సర్వస్వం ఒకరికే అంకితం. మళ్లీ కలుషితం చెయ్యొద్దు"

"సావిత్రీ !"

ఏడుస్తోందామె.

"నన్ను నమ్ము సావిత్రీ ! వేరేలా అపార్థం చేసుకోకు. మూర్తికి కనీసం అయిదారేళ్లు జైలుశిక్ష పడేలా చేస్తానని ప్రతినబూని కసిగా వున్నాడు ఇన్‌స్పెక్టర్. దానికి కావలసిన సాక్ష్యాధారాలున్నాయనికూడా చెప్తున్నాడు. వాడేమైనా చేయగలడు. పోలీసు జులుం అలా వుంది. నేను నిన్ను కోరడం నీ శరీరాన్ని ఆశించి కాదు. నువ్వు నాకు నచ్చావు. నీ ప్రవర్తన నచ్చింది. ముందు ముందు నీకు నేను, నాకు నువ్వు సహకారంగా వుంటాం. లేకపోతే అనాధవవుతావు. ఆలోచించుకో"

"క్షమించండి ! మీ పెద్ద మనసుకి నమస్కారాలు. కానీ – నేనిప్పుడు గర్భవతిని..."

క్షణంపాటు తత్తరపడ్డాడు ఖాన్. తల నిమురుకొన్నాడు. తర్వాత—

"నీ పిల్లలు నా పిల్లలు కాదన్న భయం నీకేం అఖ్ఖర్లేదు. నాకంతా ఒకటే. నీ గురించి అన్నీ తెలిసినా నిన్ను ఆశిస్తున్నానంటే నాది వ్యామోహం

మాత్రంకాదని గుర్తించు"

"బాబూ!" ఆర్ద్రంగా అరిచిందామె.

ఖాన్ మరేమీ మాట్లాడనన్నట్టుగా అక్కడి నుండి లేచి వెళ్ళిపోయాడు.

సాయంత్రం–

సుధ వచ్చింది.

సావిత్రి ఖాన్ ప్రవర్తనని విడమరచి చెప్పింది ఏడుస్తూ.

"ఆలోచించు సావిత్రీ! ఇంతకన్నా మంచి రోజులు మరి నీకు రావు. నీ గురించి అంతా తెలిసినా ఆప్యాయంగా ఆదరిస్తానంటుంటేకాలదన్నుకోకు అతన్ని. మగతోడు లేక బతకడం దుస్సాధ్యం ఈ సంఘంలో. మూర్తిని ఇప్పుడప్పుడే వదిలే యోచన లేదు. ఇన్‌స్పెక్టర్ పట్టుబట్టి మరీ కూర్చున్నాడని మావారు చెప్పారు. కాబట్టి జీవితాన్ని ఏ రకంగా మలచుకుంటావన్నది నీ చేతుల్లోనే వుంది. ఆలోచించు"

సుధ తన అభిమానాన్నీ, అభిప్రాయాన్నీ చెప్పింది.

"సుధా!"

"నీ మంచికోరి చెప్తున్నాను. అవకాశాన్ని వినియోగించుకోక పిచ్చిగా పరుగులు తియ్యకు. కావాలని చేజేతులా జీవితాన్ని నాశనం చేసుకోకు"

సావిత్రికి బ్రహ్మాండాలు బద్దలవుతున్నట్టుగా వుంది. ప్రపంచం అంతా అల్లకల్లోలంగా తిరుగుతున్నట్టుగా వుంది.

ప్రళయం–

భూకంపం–

తను నిలువునా అట్టడుగుల్లోకి జారిపోతున్నట్టుగా వుంది.

ఏం చెయ్యాలి?

ఏంచెయ్యాలేం చెయ్యాలి ?

ప్రశ్నలు–ప్రశ్నలు–ప్రశ్నలు ???

మూర్తిని ఆశించింది. ఆశ ఫలించింది. అయితే ఆర్నెల్లకే అది తిరిగి అభాసుపాలయింది.

అతను జైలుపాలయ్యాడు. తిరిగొస్తాడన్న నమ్మకంలేదు. ఎలా బతుకీడ్చడం?

రేపుదయం పిల్లకాని, పిల్లడుకాని పుడితే వాడితో కాలాన్ని ఎలా నెట్టుకురావడం ?

పుట్టబోయే పసికందు మీద కోటానుకోట్ల కోరికలు పెంచుకొన్న తనేం కావాలి ?

ఖాన్‌ని పెళ్లిచేసుకోక తప్పదా ?

తప్పదు.

ఒంటరిగా వుండలేదు. కాదు – ఒంటరిగా ఈ సంఘం వుండనివ్వదు. వేటకుక్కల్లా వెంటాడి చీల్చి చెండాడుతుంది.

అందుకు ఖాన్‌ని పెళ్లి చేసుకోవాలా ?

అయినింటి ఇల్లాలై, లాయర్‌గారి భార్య హోదాలో పలుకుబడిని, పరపతిని పెంచుకోవాలా ?

లంకంత కొంప! బోలెడంత ఆస్తి! ఖాన్ తర్వాత తన స్వంతం.

తన పిల్లడు హుందాగా పెరుగుతాడు. ఆస్తిపరుడవుతాడు. దినదిన గండం నూరేళ్ళాయుష్షులా వుండదు పరిస్థితి.

అందుకని ?

ఖాన్‌ని పెళ్ళాడక తప్పదు.

తప్పదుగాక తప్పదు.

ఆ రాత్రి –

ఓ నిర్ణయానికొచ్చింది సావిత్రి.

"మిమ్మల్ని నేను పెళ్లి చేసుకుంటాను. కాని ఇదంతా నా సుఖం కోసం ఎంతమాత్రంకాదు. పుట్టబోయే నా బాబు గురించే! ఆలోచించండి – నా బాబుని మీ బాబుగా మీరు చేరదీసి ఆదరించ

గలరా?"

"సావిత్రీ!"

"నిజం చెప్పండి! నా బాబుని మీ బాబుగా ప్రేమించగలరా?" వుద్వేగంగా అడిగిందామె.

ఖాన్ నవ్వుకున్నాడు.

"ప్రమాణం చేసి చెబుతాను. సరే నంటావా"

"బాబూ!" అతనికాళ్ళపై మోకరిల్లింది.

మర్నాడు –

సుధకి తన నిర్ణయాన్ని చెప్పింది సావిత్రి.

"గుడ్! విష్‌యూ బెస్ట్ ఆఫ్ లక్! నీ జీవితం నూరేళ్లు హాయిగా గడవాలి" అభినందించింది.

మూర్తి – మూర్తితో గడిపిన జీవితం అంతా కలగా మిగిలిందిప్పుడు, ఏ కోణంలో ఎప్పుడు కలుసుకున్నారో ఏ విషఘడియల్లో చేరువయ్యారో – విధి



భయంకరంగా విడదీసింది.

వాటినే తలపోస్తూ కుంగిపోయింది సావిత్రి.

అయినా పెళ్లికూతురుగా మాత్రం మరోసారి మెరిసిపోయింది సావిత్రి. రిజిష్టర్ మారేజ్ చేసుకున్నారిద్దరూ.

ఎంతోమంది ఖాన్ బంధువులు, స్నేహితులూ తరలివచ్చారు పెళ్లికి. ఎన్నెన్నో కానుకలు సమర్పించారు.

వాటన్నిటిని చూస్తూ అవాక్కయిపోయిందామె. ఖాన్ పాతభార్య నగలన్నీ ఆమెకు బహూకరించాడు.

నగలు...

డబ్బు...

హోదా...

పలుకుబడి...

పరపతి...

అన్నీ తన స్వంతం. కాని, మూర్తి మాత్రం దూరం అని ఏడ్చింది.

మూర్తి తన సర్వస్వం.

మూర్తి తన జీవితం.

మూర్తి లేనిదే తను లేదు.

ఆ విషయం ఎవరికీ తెలీదు. గుండె గుడిలో ఒకరికే చోటు. ఆ చోటును భర్తీ చేసేశాడు మూర్తి.

ఆరోజంతా హడావుడిగానే వుంది. సుధ కూడా అక్కడే వుంది.

కొత్త పెళ్ళికూతురికి చేయాల్సినంత హంగామా అంతా చేశారు. శోభనపు పెళ్ళికూతుర్ని గదిలోకి పంపారు. పంపుతూ సుధ అంది –

"బతుకుతో రాజీపడు అది అవసరం"

ఏడ్చింది సావిత్రి ఆ మాటకి. సుధని అంటుకు పోయింది.




మూర్తిని గదిలోకి పిలిచి సావిత్రి పెళ్ళిగురించి చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

"చూడ్రా, నీ పెళ్ళాంసాహసం! పెద్ద పతివ్రతనంటూ పోజుకొట్టి ఏం చేసిందో చూడు"

నమ్మలేకపోయాడు మూర్తి. సావిత్రి ఎందుకిలా ప్రవర్తించిందన్నది అంతు పట్టలేదతనికి.

నెల రోజులైంది జైల్లో కూర్చుని. ఇక తను తిరిగి రాననుకొని,గుండెను రాయి చేసుకొని ఈ పని చేసిందా?

ఆమెనో ఇల్లాల్ని చేశాడు. సంఘంలో తలెత్తుకు తిరిగేలా చేశాడు. అందుకు ప్రతిఫలం?

తనని మోసం చేసింది.

బాధన్పించింది మూర్తికి.

బాగా ఆలోచిస్తే - 'ఆమె చేసింది మోసం కాదేమో' అన్పించింది. ఒంటరిగా సమాజాన్ని ఎదుర్కోలేని అబల! అంతకన్నా ఏం చెయ్యగలదు?

తను మాత్రం తక్కువ తిన్నాడా? ఓ పక్క సావిత్రితో కాపురం చేస్తూనే పద్మ పొందు కోరలేదూ! ఎందుకు? ఎందుకని కోరాడు?

అది మాత్రం మోసం కాదా? అటువంటప్పుడు ఇతర్లు తనని మోసం చేశారని బాధపడనవసరం లేదనుకొన్నాడు.

మౌనంగా వూరుకొన్నాడు.

మరో రెండు నెలలు లాకప్‌లో బతికాడు. కేసుని ఫైసలా చేయడు! విడుదల చేయడు! మానసిక వేదనతో చంపేస్తున్నాడు జగన్.

మూర్తికి ప్రపంచం అంతా అయోమయమన్పించింది.

మరో నెల లాకప్‌లో వుంచాడు ఇన్‌స్పెక్టర్. తర్వాత ఏమనుకున్నాడేమో విడుదల చేశాడతన్ని. చేస్తూ ఇకనైనా మర్యాదగా ప్రవర్తించమని హెచ్చరించాడు. ఖర్చుకి పది రూపాయలిచ్చి దానం చేసినట్టుగా వెటకారంగా నవ్వాడు.

సాయంత్రం ఏడుగంటలకి మళ్ళీ మామూలు లోకంలో అడుగు పెట్టాడు మూర్తి. మాసిన బట్టలు కంపుగొడుతున్నాయి. తైల సంస్కారం లేని జుత్తు అట్ట కట్టినట్టుగా వుంది. ఇన్‌స్పెక్టర్ ఇచ్చిన పదిరూపాయల నోటు వెక్కిరిస్తున్నట్టుగా జేబులో వుంది.

ఎటు పోవాలి?

ఎక్కడికి వెళ్లాలి?

ఆలోచిస్తున్నాడు మూర్తి.

మిత్రులెవరూ దగ్గరికి చేరనివ్వరు. పద్మని కలుసుకోవడం అసాధ్యం. అరుణ అదరిస్తుందన్నది కల్ల! పోనీ సావిత్రి వద్దకు వెళ్దామంటే మనసొప్పటం లేదు.

మరి ఎక్కడికి వెళ్ళాలి?

తల బద్దలవుతోంది.

వాతావరణం వేడిగా వుంది. ఎక్కడా గాలి ఆడటంలేదు. బజార్లంట నడుస్తే జనం గుర్తుపడతారని సందులంట దారి తీసి సీతమ్మ ఇంటికి చేరాడు.

శెట్టి గిన్నెలన్నిటినీ ఓ మూల సర్దుతున్నాడు. ఇతన్ని చూస్తూనే ఆ దంపతులిద్దరూ దెయ్యాన్ని చూసినట్టుగా గతుక్కుమన్నారు. వాళ్ళనలా చూస్తే మతిపోయింది మూర్తికి. ఎలా అయితేనేం ధైర్యంచేసి కూర్చున్నాడక్కడ.

శెట్టి మాట్లాడలేకపోతున్నాడు.

సీతమ్మ కలుగజేసుకొంది– "ఎప్పుడొచ్చారు బయటకి?"

"ఇప్పుడే" అన్నాడు. అక్కసుసంతా ఆ మాటలో వెళ్లగక్కేడు. ఒకప్పుడు తనని గౌరవించిన శెట్టి, ఇప్పుడు పురుగులా చూస్తున్నాడు.

అతని మొహంలోని బాధని చూసి నొచ్చుకొంది సీతమ్మ.

"పద్మ ఎలావుంది? నన్ను మరిచిపోయిందా?" ఆత్రంగా అడిగాడు.

హతాశురాలైంది సీతమ్మ. చెయ్యి నొసటికి కొట్టుకొంటూ–

"పద్మకి పెళ్లయి నెలపైనే అయింది. ప్రస్తుతం అత్తవారింట్లో ఉంటోంది'' అన్నది.

ఆ మాటకి నిలువెల్లా వణికిపోతాడనుకొంది సీతమ్మ. కాని మూర్తిలో చలనం లేదు. బాధపడలేదతను. 'సావిత్రే తనని కాదని తన్నిపోతే – పద్మ ఎంత?' అన్నట్టుగా ఆలోచించేడు.

శెట్టి దగ్గరగా వచ్చి – ''ఆడది! అంతకన్నా ఏం చెయ్యగలదులెండి'' అన్నాడు.

మరి అక్కడ క్షణం కూడా కూర్చోలేకపోయాడు మూర్తి. లేచి బయట పడ్డాడు.

ఎవరికీ మొహం చూపలేక పోతున్నాడు. సంపాదించుకొన్న విలువ పోయింది. తనది తప్పా, కాదా అని జనం ఆలోచించరు. పైగా పీలు దొరికిందీ కాబట్టి గేలిచేస్తారనుకొన్నాడు. గబగబా

అడుగులు వేసి బస్టాండుకి చేరుకొన్నాడు.

ఓ గమ్యం లేదు.

ఏం చేద్దామన్న ఆలోచనలేదు.

తననెవరూ దగ్గరకి రానివ్వరు.

ఆదరించి అన్నంపెట్టరు.

ఎలా బతకాలి? ఏం చెయ్యాలి?

ఆకలి వేస్తోందతనికి.

దాహంగా ఉంది.

ఎదురుగా ఉన్న పంపు దగ్గరికి వెళ్ళి నీళ్లు తాగాడు. కడుపు నిండింది.

మరి కాస్సేపటికి మళ్ళీ ఆకలి! ఆకలి దహించుకుపోతోంది.

తిండి కావాలి!

అన్నంపెట్టే నాథులు కావాలి. ఎవరు? ఎవరు పిడికెడు అన్నంపెట్టే నాథులు? ఎవరూ లేరు. ఎవరూ పెట్టరు.

తిండి కావాలి! తిండి సంపాదించుకోవాలి!

అదే మూర్తి ఆలోచన! దాని మీదే దృష్టి కేంద్రీకరించాడు.

ఉన్న పది రూపాయలలో రెండు మూడ్రోజులు బతుకుతాడు. ఆ తర్వాత?

ఆలోచిస్తున్నాడతను.

కూలీలు ప్రయాణీకుల మూటల్ని బస్సుల్లో వేస్తుంటే చూస్తూ నిలబడ్డాడు.

తనూ మూటలు మోస్తే!?

సిగ్గుచేటు – అలా బతకలేడు.

కాదు – ఆ పని చేయడంలో తప్పేముంది. దొంగతనం, దోపిడీ చేయటం లేదు. అన్యాయంగా, అక్రమంగా సంపాదించటంలేదు. కష్టపడి పని చేయడానికి సిగ్గెందు కనుకున్నాడు.

వేరేచోట బతకడం కన్నా ఇక్కడే ఇటువంటి పనేదో చేసి అయిన వాళ్లల్లో శభాష్ అన్పించుకోవాలనుకొన్నాడు.

ఇక్కడే తన జీవితం నాశనం అయింది. మళ్ళీ ఇక్కడే కొత్త చిగురు తొడగాలి బతుకు. అప్పుడు–అప్పుడు తనని చూసి అంతా ఈర్ష్యపడాలనుకొన్నాడు. చుట్టూ పరికించి చూశాడు. కొంచెం దూరంలో రాములు రిక్షాతుడుస్తూ కన్పించాడు. రాములిది మూర్తి వాళ్లూరే! ఇద్దరు పిల్లల తండ్రి. ఆ వూళ్లో పెళ్లాన్ని, పిల్లల్ని పోషించుకోలేక ఈ వూరుచేరాడు. అతని దగ్గరగా వచ్చాడు మూర్తి. రాములు ఎదురుగావున్న వ్యక్తి వైపు తలెత్తి చూసి "ఎప్పుడొచ్చావు బాబూ?" అన్నాడు.

"ఓ గంట్రకితం" అన్నాడు రిక్షా హేండిల్ మీద భారంగా చేయి వేసి.

"తిండితిన్నారా బాబూ! రా మాయింటికెళ్దాం"

"రాములూ"

"ముందు టీ తాగుదాం రా బాబూ!" అంటూ ముందు నడిచాడు రాములు. మూర్తి అతన్ని అనుసరించాడు.

"వాసు బాబూ! నీగురించి చెప్తే నేను నమ్మలేకపోయాను. దొంగతనం చేశావంటే అస్సలు నమ్మలేదు" అన్నాడు.

టీ తాగారిద్దరూ. రాములే డబ్బులు చెల్లించాడు.

"నాకేదైనా దారి చూపించు. నేను బతకాలి. రిక్షాతొక్కడం నాకు నేర్పుతావా రాములూ!"

"అదేంటిబాబూ!" ఆశ్చర్యపోయాడు.

"చదువుకొన్నవాడివి. ఏ కొట్లో లెక్కలు రాసినా బతికిగలవు. ఇలాంటి కష్టంపని నీకెందుకు" అన్నాడు తిరిగి.

"ఒకడి కాళ్ళకింద నేనలా గుమస్తాగిరీ చేయలేను. ఇలాగే బతకాలని వుంది. నాకి అవకాశాన్ని కలిగించు"

"నీ ఇష్టం బాబూ! నేర్చుకోవాలేగాని ఒక్క రోజులో నేర్పుతాను. నీలాంటి

చదువుకున్న వాళ్ళంటే మా యూనియన్‌కెంతో మంచిది కూడా"

ఆ రాత్రి రాములింటనే భోంచేశాడు మూర్తి. ఆ రాత్రి రిక్షా తొక్కడంలోని మెలకువలు నేర్చుకున్నాడు. హాండిల్ కంట్రోల్ చేయగలిగితే రిక్షా తొక్కడం సులభం అనుకున్నాడు.

రాములు ఓనర్‌తో మాట్లాడి మర్నాడే రిక్షా తీసుకున్నాడు. ఉదయం ఆరు గంటల నుండి రాత్రి పదిగంటల వరకూ పన్నెండు రూపాయలు అద్దె!

మొదటిరోజు వ్యాపారంలోని మెలకువ తెలియక అద్దె డబ్బులు తక్కువగా అడగడంతో చాలా బేరాలు తగిలాయి మూర్తికి. ఆ రోజు అద్దె, ఖర్చులూ పోను పదిహేను రూపాయలు పైబడి మిగిలింది.

రాములింట మరి ఎక్కువగా వుండ కూడదని నిశ్చయించుకొని అతగాడి పాక దగ్గరలోనే మరో పాకని పాతిక రూపాయలకి అద్దెకు తీసుకున్నాడు మూర్తి. రోజుకో సామాను చొప్పున వారం పది రోజుల్లో ఇంటిక్కావలసిన సామానంతా చేకూర్చుకున్నాడు.

రిక్షా లాగుతూంటే చాలామంది అతన్ని గుర్తుపట్టారు. ఆశ్చర్యపోయారు. అయినా ఎవరూ పలకరించలేదు. వాసు ఓ రోజు కలిశాడు.

"ఇదేంటి గురూ! ఏదైనా వ్యాపారం చేసుకోరాదా?" అనడిగాడు.

"పెట్టుబడి ఎవరు పెడ్తారు?" ప్రశ్నించాడు మూర్తి.

వాసు పలకలేదు.

"అయినా వ్యాపారాలు నా వొంటికి సరిపడవు. ఇదే బాగుంది. బతుకంతా థ్రిల్లింగ్‌గా వుంది"

"ఐయామ్ వెరీ ప్రౌడ్ ఆఫ్‌యూ! వస్తానయితే" అంటూ మూర్తి జబ్బచరిచి వెళ్ళిపోయాడు వాసు.

పద్మ సినిమా నుంచి వస్తూ రిక్షా కోసం ఎదురుచూస్తోంది. మూర్తిని గుర్తు పట్టక పిలిచింది.

రిక్షా తీసుకువెళ్ళి ఆమె ముందు నిలిపాడు మూర్తి. అతన్ని చూస్తూనే చేష్టలుడిగింది పద్మ.

"మూర్తీ!" అంది ఆశ్చర్యంగా.

"అవును మూర్తినే! ఏం కావాలి? రిక్షా కావాలా? ఎక్కడికి?"

"ఇంటికి" రిక్షా ఎక్కి కూర్చుంది.

"నన్నెందుకు మోసం చేశావు?" ప్రశ్నించింది.

"నేను మోసం చేశానా? లేదు పద్మా లేదు. నన్నే అంతా మోసం చేస్తున్నారు"

పద్మ మాట్లాడలేకపోయింది.

"సీతమ్మ చెప్పింది నువ్వొచ్చి కలిసినట్టు. మళ్ళీ తనని కలిస్తే నన్ను కలవమని చెప్పమన్నాను"

"నిన్ను కలసి ఏం చేయాలి నేను"

తత్తరపడింది ఆ మాటకి. తర్వాత మాటల్ని వెతుక్కొంటున్నట్టుగా అంది-

"నీ పరిస్థితి తెలిసింది. కొంత ఆర్థిక సహాయం చేద్దామనుకొన్నాను"

"నోఛ్మయ్! ఆ విధంగా ఎప్పుడూ మాట్లాడకు. నేనేం బిచ్చగాణ్ని కాను" రెచ్చిపోయాడు మూర్తి.

ఇల్లు దగ్గర పడింది. రిక్షా ఆపాడు మూర్తి.

పర్సునుండి పదినోటు తీసి అందించింది పద్మ.

"చిల్లరలేదు" అన్నాడు.

"వుంచుకో" అంటూ వెనుతిరగబోయింది. రెక్క పట్టుకొని ఆపాడు.

"చూడు! అంత జాలీ, దయా, కరుణా

వుంటే రోడ్డంట అనేకమంది ముష్టి వాళ్లుంటారు. వాళ్లందరికీ నీ ఇష్టం వచ్చినట్టుగా దానంచెయ్యి" అని పదినోటు ఆమె మీదికి విసిరి చకచకా రిక్షా తొక్కుకుపోయాడు మూర్తి.

పద్మ దీర్ఘంగా నిట్టూర్చి నోటు తీసుకుని పర్సులో పెట్టింది.

మరోరోజు ఖాన్ మూర్తి రిక్షాలోనే కోర్టుకు వెళ్లాడు. అయినా మూర్తిని గుర్తించలేదతను. అలాగే మరో రోజు సుధ, సుధ భర్త కలసి అదే రిక్షాలో సినిమాకి వెళ్లారు. మూర్తిని గుర్తించినా పలకరించలేదు వాళ్లు.

* * *

సుధని అడిగింది సావిత్రి–

"ఆయన నిజంగానే రిక్షా తొక్కుతూ బతుకుతున్నారా? నేను నమ్మలేకపోతున్నాను"

"నిజమే! మొన్న సినిమాకి ఆయన రిక్షాలోనే వెళ్ళాం. అయినా అదేం పోయే కాలం? లక్షణంగా ఏదో వుద్యోగం చేసుకోక!"

సావిత్రి వెక్కి వెక్కి ఏడ్చింది.

"నేనే! నేనే ఆయన జీవితాన్ని నాశనం చేశాను. నేను తోడుగా వుంటే ఆయనిన్ని కష్టాలు పడేవారు కారు"

"బాధపడకు. నుదుటి రాతను ఎవరూ మార్చలేరు" అనునయిస్తూ అంది సుధ.

"ఆయనతో మాట్లాడాలని వుంది. వీలవుతుందా? ఆ అవకాశాన్ని కల్పిస్తావా?"

"ఖాన్‌గారికి తెలిస్తే ఇంకేమైనావుందా? వద్దు. అలాంటి ప్రయత్నాలు చెయ్యకు" హెచ్చరించింది.

"నేనేం ఆయనతో పారిపోను. ఆ భయం అఖ్ఖర్లేదు. సాటి మనిషిగా అతన్తో మాట్లాడాలనుకొంటున్నాను"

సుధ మాట్లాడలేదు. అనవసర ప్రసంగంగా భావించింది. అది గమనించి సావిత్రి వూరుకొంది.

స్వయంగా వెళ్ళి కలిస్తే...!

ఎక్కడుంటున్నాడు? ఏ ఇల్లని వెతగ్గలదు?

వెతికి వెతికి అతని దగ్గరికి వెళ్లినా అతడు ఆనందంగా ఆహ్వానిస్తాడన్న నమ్మకం ఏమిటి? ఉద్రేకంతో, ఉన్మత్తంగా ఏమైనా చేసినా చేస్తాడు. మళ్ళీ మరో రకంగా అభాసుపాలు కావాలి.

తనే తప్పు చేసింది. పెళ్ళి చేసుకోకుండా వుండాల్సింది.

లేదు! అలా జరగడానికి వీల్లేదు. పెళ్లి కాకుండా వుంటే తననెవరు ఆదరించేవాళ్లు? కుక్కలా తరిమి కొట్టేవారు. నిలబడడానికి నీడలేక పరుగెత్తవలసి వచ్చేది.

రెండు చేతుల్లో ముఖాన్ని పట్టుకొని ఏడ్చింది సావిత్రి.

* * *

మూర్తికి రిక్షా అలవాటైంది క్రమంగా. పాత పరిచయస్తులు కొందరు ఆశ్చర్యపోవడం, మరికొందరు అసహ్యించుకోవడం జరిగినా కొత్త పరిచయస్తులు ఆప్యాయంగా ఆదరించారతన్ని.

ఆదరించిన వాళ్ళంతా రిక్షా వర్కర్లే!

వాళ్ళలో పెద్దగా చదువుకొన్నవారు తక్కువ. ఇంతో అంతో చదువుకొన్న వాళ్ళు రిక్షా వర్కర్లకు సపోర్టు ఇవ్వక ఓనర్లతో లాలూచీలుపడి యూనియన్ని కష్టాలపాలు చేశారు.

అది గ్రహించాడు మూర్తి.

రాములు ద్వారా వర్కర్లందర్నీ సమా

వేళపరిచి వాళ్ళతో కష్టసుఖాలు మాట్లాడాడు. తర్వాత స్ట్రయిక్ చేద్దామన్నాడు.

రిక్షాల అద్దెలు తగ్గించాలి!

రిక్షా ఛార్జీలు పెంచాలి!

సిటీ బస్సుల్ని రద్దు చెయ్యాలి!

వర్కర్లకు ఇళ్ళ స్థలాలివ్వాలి!

రిక్షా కొనుగోలు కోసం బ్యాంకు రుణాల్ని గవర్నమెంట్ ముమ్మరంగా ఇప్పించాలి!

ఈ అయిదు కోర్కెలను తీర్చాలని పోరాడదామన్నాడు. అతని సలహా అందరికీ నచ్చింది. నాయకుడుగా అతన్నే వుండమన్నారు.

సమ్మె చేయడానికి సిద్ధపడ్డారు. వర్కర్లందర్నీ రిక్షాలు నిలిపివేయమని ఆదేశాలు జారీ చేశారు. అయితే రాత్రికి రాత్రే కొందరు మూర్తికి ఎదురు నిలవాలనుకొన్నారు. కారణం ఓనర్ల హస్తాలు వారి వెనుక వుండడమే! దాంతో అవతల పార్టీవాళ్లు సమ్మెను తిరస్కరించారు.

మూర్తికి మతిపోయింది.

ఆ పార్టీ నాయకుణ్ని పిలిచి మాట్లాడాడు.

"మనం అంతా ఐక్యంగా వుండి పోరాడాలి. లేకపోతే మన కోర్కెలు నెరవేరవు" అన్నాడు.

"లేదు మూర్తీ! మాకు సమ్మె చేయాలని లేదు. సమ్మె చేస్తే మా పిల్లలు పస్తు పడుండాల్సి వుంటుంది"

"నీకేనా పిల్లలున్నది. మాకులేరా?" ఎవరో అరిచారు.

"మర్యాదగా మాట్లాడు" ఆ పార్టీ నాయకుడు కోపంగా అరిచాడు.

"నీకెంట్రా మర్యాద! రారా" రెచ్చిపోయాడు మూర్తి తాలూకు మనిషి.

సర్దిచెప్పబోయాడు మూర్తి.

"మా రిక్షాలు మేం నడుపుకొంటాం ! అడిగే దమ్ములెవడికి వున్నాయి"

"సరే! నీ ఇష్టం. వెళ్ళిరా" మూర్తి పరిస్థితి విషమిస్తోందని తెలిసి అతన్ని పంపించేశాడు.

"గురూ! ఆ వెధవల ఒళ్లు తుక్కు తుక్కు చెయ్యాలి"

"అది మంచి పద్ధతి కాదు. మనలో మనమే కొట్లాడుకొంటే అనుకొన్నవి నెరవేరవు" మూర్తి నిదానంగా చెప్పేడు.

మర్నాడు—

మూడింట రెండు వంతులు రిక్షాలు నిలిచిపోయాయి. వీళ్లని కాదని నడప తలుచుకొన్న వర్కర్లని తన్నారంతా. వాళ్ల రిక్షాల రిమ్ములు విరగ్గొట్టేరు. సిటీబస్‌ను ఆపని ఓ డ్రైవర్‌ని పట్టి కిందికి లాక్కొచ్చారు. చితకబాదారు.

గొడవ పోలీసుల దాకా వెళ్లింది.

కొందరు అరెస్ట్ అయ్యారు.

ఈ విషయం తెలిసి మూర్తి పోలీసు స్టేషన్‌కి వెళ్లాడు. వర్కర్లని చావ తంతానంటూ బెదిరిస్తున్నాడు ఇన్‌స్పెక్టర్! ఆ ఇన్‌స్పెక్టర్ మరెవరో కాదు. మూర్తిని ఈ గతికి తోసినవాడే.

"వాళ్ల ఒంటిమీద చెయ్యి పడిందంటే నీ ప్రాణాలుండవు జాగ్రత్త" ఎదురు వెళ్లాడు మూర్తి.

ఇన్‌స్పెక్టర్‌కి పిచ్చి కోపం వచ్చింది. అయినా తమాయించుకొన్నాడు. మూడు నెలలు లాకప్‌లో పిల్లికూనలా పడున్న మూర్తి కాదితను అనుకొన్నాడు.

ఇప్పుడు వీడు వెయ్యిమంది రిక్షా వర్కర్ల నాయకుడు! ఏంచేసినా చెల్లునని మరి నోరు మెదపలేదు.

"సమ్మె చేసుకోదలిస్తే మర్యాదగా చేసుకొండయ్యా! అంతేకాని పబ్లిక్‌కి

నష్టం కలిగిస్తే ఎలా?" అన్నాడు సామ
రస్యంగా ఇన్‌స్పెక్టర్.

"పబ్లిక్‌కి ఏ రకంగా నష్టం కలి
గించాం?"

"కన్పించలేదా! సిటీబస్సుల్ని నిలిపి
వేయడంలో మీ ఉద్దేశం? డ్రైవర్ని చితక
బాదడంలో ఆంతర్యం?"

"అదా! ఆ సిటీబస్‌ని ఆపింది మా
వాళ్ళే! కాని ఆ డ్రైవర్ని తన్నింది
మాత్రం మావాళ్ళు కాదు. ఓనర్లు నియ
మించిన కొందరు గూండాలు ఆ పనిచేసి
మా మీదకి నెట్టారు"

మూర్తిని కన్నార్పకుండా చూస్తు
న్నాడు ఇన్‌స్పెక్టర్. రబ్బరు బంతిలా
మీది మీది కొస్తున్నారనుకొన్నాడు.

ఇప్పుడు వీణ్నేం చెయ్యలేం.

వీణ్ని తన్ను తంతే—

వర్కర్లంతా తనని సున్నంలోకి
ఎముక లేకుండా చేస్తారు. ఏం దారిరా



భగవంతుడా అని—

"సరే! శాంతియుతంగా సమ్మె చేసుకోండి! వెళ్లండి" అంటూ హితబోధచేసి పంపాడు వాళ్లని. వర్కర్లంతా 'మూర్తికి జై! మూర్తి జై!' అంటూ కేకలు వేసుకొంటూ బయటకు నడిచారు.

సాయంత్రం—



రిక్షాయూనియన్ నాయకుల్ని, ఓనర్లని సమావేశపరిచాడు లేబర్ ఇన్‌స్పెక్టర్.

అన్ని ధరలూ పెరుగుతున్న కారణంగానూ, రిక్షా ముడివస్తువులు, భాగాల ధరలు పెరుగుతున్న కారణంగానూ అద్దె ఎంత మాత్రమూ తగ్గించలేమన్నారు ఓనర్లు.

వాళ్లు చేస్తూన్న రిపేర్లు నెలకోసారే కనుక ఖర్చు అంతగా లేదనీ, అందువల్ల అద్దె ధర తగ్గించాలనీ, అసలు ఏనాటి రిక్షాలో తొక్కడానికి ఇస్తున్నారనీ, రిక్షాలు మార్చాలనీ వర్కర్లు అన్నారు.

ఇరువర్గాల్నీ రాజీచేసాడు ఇన్‌స్పెక్టర్. ఓ మూడు రూపాయలు అద్దె తగ్గించడం ఆ రాజీ పథకం. దానికి ఇరుపక్కల వాళ్లూ ఒప్పుకొన్నారు. రిక్షాలు నడపడానికి సమ్మతించారు. రిక్షాల ఛార్జీ పెంపుదల విషయమై ప్రజలు కలుగజేసుకోవాలని ఆశించి సమ్మె మానుకొన్నారు.

ఎవరి రిక్షాలు వాళ్లు మామూలుగా తీసుకొన్నారు. మూర్తి కూడా రిక్షా తీసుకొని లాడ్జివద్ద పాసింజర్స్ కోసం కాచుక్కూర్చున్నాడు.

రాములు వేరుశనక్కాయలు తెచ్చి అతని చేతిలో పోశాడు.

"ఆ పోలీస్ ఇన్‌స్పెక్టర్ తంతానని బెదిరిస్తే మనవాళ్లు నోరు మెదపలేక పోయారు. నువ్వు రాబట్టి సరిపోయింది" అన్నాడు.

"వాడంతే! పిల్లులు అని పులిలామీద పడాలనుకొంటాడు. వాడికి అసలు విషయం తెలీదు వెయ్యి పిల్లులు కలిస్తే వాడంతు చూస్తాయని!"

"గురూ! ఈసారి వాడి అంతు చూడాలి" రాములు సరదాపడ్డాడు.

మూర్తి మాట్లాడలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు.

'ఫలానా వీధికి వస్తావా?' అంటూ ఖాన్ వచ్చి అడిగాడు మూర్తిని. తనని గుర్తించలేదని అనుకొన్నాడు మూర్తి.

ఎక్కమన్నాడు. ఈ రకంగానైనా మరిచిపోదామనుకొన్నా మరువరాని బాధ!

కలగా మిగిలిపోని వాస్తవం-

శిలగా నిలిచిపోతోంది.

కళ్లకు కట్టినట్టున్న సరదాలు...

కంటికి ఇంపైన సంతోషాలు...

చిలిపి తనం-

ముద్దులు...

మొహమాటాలు...

ఎన్నని?

ఎన్నెన్నో మూర్తితో పంచుకొంది. మరినాడు అవన్నీ ఏమైనాయి. బాధగా వుంది సావిత్రికి.




వర్షం...

వర్షం మూలంగా రిక్షాలకు బేరాల్లేవు. ఒకటీ అరా బేరం దొరికితే వదిలిపెట్టే రకాలు కాదు రిక్షావాళ్లు. పాసింజర్ నుండి సాధ్యమైనంత ఎక్కువ రాబట్టాలని చూస్తారు. అందుకని వర్షంలో ఎవరూ రిక్షాల్ని బేరాలాడరు. తగ్గిన తర్వాత పోదామనుకొంటారు.

బేరాల్లేక కూర్చున్నారు రిక్షావాళ్లు. మూర్తి వాళ్ల మధ్యగా కూర్చున్నాడు.

ఏవేవో ఆలోచనలు...

తాడులేని బొంగరంలా జీవితాన్ని ఈడ్చే బదులు పదిమందికోసం పాటు పడాలనుకొన్నాడు. తెలిసో తెలియకో ప్రేమలంటూ ఆడవాళ్ల చుట్టూ తిరిగాడు. అందరూ మోసం చేశారు. ఎవరూ దగ్గరికి రాలేదు. కలిసిరానివాళ్లతో కట్టు కూడదనుకొన్నాడు.

తన బలగం వేరు–

కాయ కష్టం చేసేవాళ్లు తనవాళ్లు! వాళ్లకోసం పాటుపడాలనుకొన్నాడు. కార్మికుల సఖ్యతే తన సుఖంగా భావిస్తున్నాడు.

చిన్నప్పుడెప్పుడో చదువుకొన్న పాఠాలు జీవిత చరిత్రలూ అతని గుండెల్లో నాటుకుపోయాయి.

హిట్లర్...

నెపోలియన్...

సుభాష్ చంద్రబోస్...

అబ్రహం లింకన్...

జార్జి వాషింగ్టన్...

స్పార్టకస్...

ఎందరో మహానుభావులు, వాళ్ల కార్యదీక్ష అతన్ని ప్రేరేపించాయి. అయితే అతని ఆలోచనలన్నీ సగం సగం మనుషల్లానే మిగిలిపోయాయి. ఎదగలేదిన్నాళ్లూ.

ఇప్పుడు వాటి అవసరం గుర్తించాడు. తనెవరి కోసం అని పరితపిస్తున్నాడు.

సినిమా వదిలారు. థియేటర్ దగ్గర బేరాలు దొరుకుతాయని రిక్షాలు తీసుకుని పరుగెత్తారంతా.

అందరితోపాటు మూర్తీ రిక్షాతో పరుగెత్తాడు.

జనం బయటకి వస్తున్నారు. అలా సావిత్రిని చూడొచ్చునన్న ఆశ.

ఖాన్ ఇంటిముందు రిక్షా ఆపాడు. రూపాయి అద్దె చెల్లించి గేటు తీసుకొని లోనికి వెళ్లిపోయాడు ఖాన్.

సావిత్రి కన్పించలేదు.

పది నిముషాలు ప్రహరీ గోడ దగ్గర నిరీక్షిస్తూ నిలబడ్డాడు. అయినా ఫలితం లేకపోయింది.

'ఛ ఛ! వెధవాశ' అనుకొని బయల్దేరాడు మళ్లీ.

అంతలో మేడ పైనుండి మూర్తిని చూసింది సావిత్రి. అతను తన కోసం నిరీక్షిస్తున్నాడని కూడా తెలుసుకొంది. దిగివెళ్దామనుకొన్నా ధైర్యం చాలలేదు.

ఖాన్ చూస్తే ఏమనుకొంటాడు?

అనుమానాలు రేగి పచ్చని కాపురం చిచ్చులా తయారైతే !?

నానా రభస !

అల్లరల్లరి!

తిరిగి పాత జీవితం – నా అనేవాళ్లు లేని దిక్కుమాలిన జీవితం !

మూర్తితో మాట్లాడాలని వున్నా, అవకాశం దొరికినా వినియోగించుకోలేని అసమర్థత ఆమెను బందీ చేసింది.

ఏడుస్తూ కూర్చుంది సావిత్రి.

ఏడుస్తోన్న సావిత్రి దగ్గరగా వచ్చాడు ఖాన్.

"ఎందుకు?" అని ప్రశ్నించాడు. ఆందోళన పడ్డాడు.

"వంట్లో నలతగా వుంది"

"డాక్టర్ని పిలుచుకురానా?"

"వద్దు! మీరు కూర్చోండి" అంది.

"దయచేసి మళ్లీ నాచేత ఓ పాట కచేరీ ఏర్పాటు చేయండి!" అంది తిరిగి

ప్రాధేయపడుతున్నట్టుగా.

"ఆలోచిద్దాం. అసలు నీకెందుకు కలిగిందీ కోరిక. వ్యాపారాలు చేసి డబ్బు సంపాదించాలన్న ఆశ నీ కనవసరం ! మరి..."

"నా సంతోషం కోసం"

"సరే! నీ ఇష్టం" ఆమె తల నిమురుతూ అన్నాడు ఖాన్.

అక్కడికి మూర్తి తప్పకుండా వస్తాడు, తనతో మాట్లాడతాడు అనుకొంది.

అతనితో మాట్లాడాలన్న ఆరాటం...

భర్తకి తెలిస్తే అపాయం...

ఏం చేస్తుందీ పరిస్థితుల్లో! ?

గుండె లోతుల్లోంచి దుఃఖం పెల్లుబికి వస్తోంది.

"భోజనం చేద్దాం రా!" అన్నాడు ఖాన్.

లేచి భర్తను అనుసరించింది సావిత్రి. గుత్తి వంకాయ కూర ఆరోజు. ఖాన్ దానిని ఇష్టంగా తినడు.

అదే కూర మూర్తికి ఎంతో ఇష్టం! బలవంతంగా రోజు తప్పి రోజు చేయించేవాడు.

'మూర్తీ!' అనుకుంటూ బాధతో విలపించింది సావిత్రి.

మందికి బేరాలు తగిలాయి.

మూర్తి దగ్గరగా ఓ వ్యక్తి వచ్చాడు. ఫలానా చోటుకి వస్తావా అనడిగాడు. మూర్తి తలమీద టోపీ ముందుకు లాక్కొని "ఎంతమంది?" అనడిగాడు.

"ఇద్దరు ఆడవాళ్లు"

"రెండు రూపాయలు"

తీసిచ్చాడతను. ఆడవాళ్లకు సైగజేస్తే వచ్చి రిక్షా ఎక్కారు వాళ్లు. మంచిమంచి చీరెల్లో మెరిసిపోతున్నారు వాళ్లు.

రోడ్డంతా గతుకుల మయం! ఎక్కడ పడితే అక్కడ నీరు నిలిచిపోయింది. చక్రాలు బిర్రబిగుసుకుంటున్నాయి. మూర్తి బలంగా తొక్కుతున్నాడు.

వర్షం పుంజుకుంది.

జల్లు రిక్షాలో కూర్చున్నవాళ్లని కూడ తడిపేస్తోంది.

రిక్షాని ఓ చిన్న దాబాముందు ఆపమన్నారు వాళ్లు. ఆపాడు మూర్తి. కొంచెం పెద్దగా వున్నావిడ పరుగెత్తుకొంటూ ఇంటి వసారాలోకి వెళ్లింది. లైట్ వేసింది.

"డబ్బులిచ్చేశారుగా?" అంది ఇంకొక ఆమె రిక్షా దిగుతూ.

"ఇచ్చేశారమ్మా!"

వెళ్ళబోయి చటుక్కున తిరిగి ఆగిందామె. అతని ముఖంలోకి తేరిపార చూసింది.

"ఏ వూరు మీది?" ప్రశ్నించింది.

'భలే బేరంరా బాబూ! ఏ వూరయితే నీకెందుకమ్మా!' అనుకున్నాడు మనసులో. అయితే వర్షం బలంగా పుంజుకోవడంతో 'ఈవిడతో బాతాకానీ తప్పని సరి' అన్నట్టుగా వెళ్లి వసారాలో నిలబడ్డాడు.

చీర కుచ్చెళ్లు ఎత్తి పట్టుకుని ఆమె అతని దగ్గరగా నిల్చుంది. మూర్తి ఆమె వైపు చూడనేలేదు.

"ఏ వూరు మీది?" మళ్లీ ప్రశ్నించిందామె.

"ప్రస్తుతం ఇదే వూరు. ఇక్కడే వుంటున్నాను" అన్నాడు నవ్వుతూ. వర్షం జబర్దస్తీగా కురుస్తోంది.

వేడివేడిగా అమ్మాయి ప్రశ్నలు–వాతావరణం రంజుగా వుందనిపించింది. మళ్లీ అడిగిందామె.

"మీదే వూరు?"

తుమ్మ జిగురు లాంటి ఆ ప్రశ్నకి మరి తట్టుకోలేక వూరిపేరు చెప్పాడు మూర్తి.

అంతే!

ఆమె అతని దగ్గరగా వచ్చి "నన్ను గుర్తుపట్టారా?" అంది.

మసగ్గా వున్న కాంతిలో ఆమె ముఖం లోకి దీక్షగా చూసి నిమిషంసేపు స్థాణువైపోయాడు మూర్తి.

ఒకనాడు తన సహచర్యం కోసం ప్రయత్నం చేసిన వ్యక్తి! ఈరోజు ఈ వర్షంలో మళ్లీ ఇలా కలుస్తుందనుకోలేదు

"ఏమిటిదంతా ! ఎందుకిల తయ్యారు?" బాధగా ఏడుస్తోందామె.

"లోపలికి పదండి" అంది ముందు తను నడుస్తూ.

మూర్తి అడుగుతీసి అడుగు వెయ్య లేదు.

"మిమ్మల్నే! రండి" అంది తిరిగి.

"వద్దు సరితా! ఇప్పటికే నేను ఎక్కాల్సిన రెలు ఓ జీవితకాలం పాటు లేటు! ఇంకా లేట్ భరించలేను" అన్నాడు నవ్వుతూ.

వర్షం ధారలుగా కురుస్తోంది.

అతని దగ్గరగా వచ్చిందామె. అతని చేయి పట్టుకుని లోపలికి తోడ్చుకు పోయింది. అయిష్టంగానే ఆమె వెంట నడిచాడు.

బయట సరిత మాట్లాడుతుంటే రిక్షా వాడితో సరసాలేమిటా అనుకుంది ఇంట్లోని పెద్దదిక్కు. ఇప్పుడు అతను నేరుగాఇంట్లోకి రావడం చూసి ఆశ్చర్య పోయింది.

"ఎవరితను?" అని అడిగింది.

"నీకు తెలీదులే అమ్మా! నాకు బాగా కావల్సినవాడు. నువ్వు వేగంగా వెళ్లి లాండ్రీ దగ్గర్నుండి ఓ జత బట్టలు అద్దెకు తీసుకురా" అంది.

కూతురి మాటకి ఎదురు చెప్పలేదా తల్లి. అలాగే వెళ్లింది. అంత రాత్రప్పుడూ ఆ లాండ్రీ వాణ్ని లేపి బట్టలు తెచ్చింది.

అంతవరకూ మూర్తి కట్టుగుడ్డలతో నిలబడే వున్నాడు.

"ముందు తల తుడుచుకుని తడిసిన ఆ బట్టలిప్పండి. ఈ బట్టలు వేసుకోండి" ఆజ్ఞాపిస్తున్నట్టుగా అంది సరిత.

అలాగేనన్నాడు మూర్తి. బట్టలు మార్చుకున్నాడు. తడి బట్టల్ని తల్లి వసారాలో ఆరవేసింది.

"భోంచేస్తారా?" అనడిగింది.

తలూపాడు మూర్తి. ఆమెను అనుస రించాడు.

భోజనాలయ్యాయి.

వాళ్ళతో తనకి నిమిత్తం లేనట్లు తల్లి మరో రూములో నిద్రపోతోంది.

"మనం మొదటగా కలిసిన రోజు జ్ఞాపకం వుందా? మీరా వూర్లో నాటకం వేయబోతున్నారంటే- నాకూ ఓ పాత్ర ఇమ్మని నేనొచ్చాను. అప్పుడు నాకు పది హేనేళ్లు. వయసు చిన్నదని, పనికి రానని పొమ్మన్నారు. తర్వాత మళ్ళీ మనం కలుసుకోలేదు అస్సలు మీరెందుకిలా తయారయ్యారు?" బాధగా అడిగిందామె అతని ముఖంలోకి చూస్తూ.

ఆనాటి నాటకం...ఆ ప్రదర్శన... దాదాపు అయిదు సంవత్సరాల క్రితం జరిగిన సంఘటనలూ అన్నీ కళ్ల ముందు కన్పించాయి మూర్తికి. కొద్దిక్షణాలు మాట్లాడలేకపోయాడు. తర్వాత తన వివరాలన్నీ చెప్పుకొచ్చాడు.

ఆమె తన స్థితినంతా చెప్పింది.

ఎస్.ఎస్.సి. పాసై ఇంటర్‌లోకి

వచ్చిన వెంటనే తండ్రి చనిపోయాడు. తండ్రి పోవడంతో ఆ కుటుంబం ఆర్థికంగా దెబ్బతింది. అక్క వున్నా పెళ్లై పరాయి పిల్ల కావడంతో తమని ఆదుకోలేక పోయింది. కొన్నాళ్లు ఇంట్లో వుండనిచ్చింది. అయితే బావ తనకి లొంగితేనే ఇంట్లో వుండనిచ్చేదంటూ ఆ అమ్మాయిని నిర్బంధించాడు. ఏం చేయాలో తెలీక బావకి తన శరీరాన్ని అర్పించవలసొచ్చిందట!

ఈ విషయం అక్కకి తెలిసింది. దాంతో ఆమె వీరావేశం చెంది తమ కొంపకి నిప్పు అంటించడానికి దాపురించావని తిట్టింది. ఇంట్లో నుండి తరిమేసింది.

తల్లితోపాటు తెలిసిన స్నేహితురాలింటికి వెళ్తే ఆమె కొన్నాళ్లు ఆదరించింది. తర్వాత ఆమె పడుపుగత్తె అని తెలిసి ఆ ఇంట్లో క్షణం నిలువలేక వెళ్లిపోదామనుకొన్నారట!

అయితే ఆమె 'తోడూ నీడాలేని ఆడవాళ్ళకి ఈ వృత్తే శ్రీరామరక్ష'అన్నట్టుగా మాయ మాటలు చెప్పి తనని వంచి వప్పించిందట!

కూడు కోసం, గుడ్డకోసం చివరికి ఆ వృత్తిని స్వీకరించక తప్పింది కాదు. ఆ వృత్తిలో పేరు మార్మోగిపోయింది. ఆరితేరిపోయింది. ఖాతాదార్లుగా గొప్ప గొప్ప వాళ్ళే రాసాగారు. సంపాదన లక్షలకు చేరింది. ఇక అక్కడ వుండలేక ఇక్కడికి చేరిందట. ఆ పాత జీవితం మరిచిపోవాలని ఆమె కోరిక.

బాధనంతా గొంతులో ఇముడ్చుకొంటూ ఒకొక్క విషయాన్నే చెప్పుకొచ్చింది సరిత.

మూర్తి చేష్టలుడిగిపోయాడు.

బయట వర్షం పడుతూనే వుంది.

చలిగాలి 'రివ్వు'న వీస్తోంది.

కొద్ది నిమిషాలు మాటలు కొరవయ్యాయి ఇద్దరికీ. ఆమె వెళ్లి కిటికీ తలుపులు మూసింది.

గదినంతా పరీకించి చూశాడు మూర్తి.

మంచాలు—పరుపులు —ఫ్యాను— గోడ గడియారం— కుర్చీలు—టేబుల్...బాగానే సంపాదించగలిగిందనుకొన్నాడు.

"నేను మిమ్మల్ని ప్రేమించాను. అభిమానించాను.. మిమ్మల్ని కావాలనుకొన్నాను. అయితే విధి మనల్ని విడదీసింది. సరే! పాతవన్నీ పీడ కలలనుకొందాం. జరిగింది జరిగిపోయింది. మళ్లీ మనం కలుసుకున్నాం. ఈసారి విడిపోవద్దు. నన్ను వదలి మీరు పారిపోవద్దు!" ప్రార్థిస్తున్నట్టుగా అతని దగ్గరగా వస్తూ అందామె.

"పేదవాణ్ని. రిక్షాలాగి.బతికేవాణ్ని. నన్ను నువ్వు ఆశించడం విచిత్రంగా లేదూ..."

"విచిత్రమేముంది? కావాలని కోరుకొన్నవాళ్లని కడవరకూ ఆశించడంలో తప్పులేదు. మీ ఇష్టం చెప్పండి! లేదా నన్ను పతితగా,కులటగా భావించి నానుండి దూరం కావాలని ప్రయత్నిస్తున్నారా?"

"సరితా!"

"చెప్పండి! నాకు తోడూ నీడా మీరే! ఏనాడో మీరు నాలో ఒకరైపోయారు. మిమ్మల్ని వేడుకొంటున్నాను. మరి నాకు దూరం కాకండి.నేనూ, నా ఆసి మీ స్వంతం. మీరేం చేసుకొన్నా నేనేం అడగను. కాని మీరు నాకళ్ల ముందు ఎప్పుడూ వుండాలి"

"సరితా!"

"అవునండీ! మీ కోసం ఏం చెయ్యమన్నా చేస్తాను. ఇక్కడ వుండాలని

మీకిష్టం లేకపోతే చెప్పండి. ఈ ఇల్లూ, వున్న పొలం అమ్మేసి ఎక్కడికో దూరంగా పారిపోయి, పెళ్లి చేసుకొని సుఖంగా జీవిద్దాం"

"పెళ్లి!" నిట్టూర్చాడతను.

"పెళ్లికి, నాకు చుక్కెదురు సరితా! ప్రేమించి పెళ్లి చేసుకోవాలని, సుఖంగా గడపాలని నేనూహించి-నే నమ్మిన ఆడ వాళ్లని చేరదీస్తే వాళ్లంతా నాకు అన్యాయం చేశారు. ఇక ఈ జీవితానికి పెళ్లి తలంపే లేదు"

"పోనీ పెళ్లొద్దు. నన్ను భార్యగా వుంచుకోండి"

ఏడుస్తోందామె. ఆమె ఆఖరి మాట 'వుంచుకోండి' అన్నది అతన్ని విచలితుణ్ని చేసింది. సరిత ప్రేమకి హద్దు లేదనుకొన్నాడు.

" 'నా' అని చెప్పుకొనే మనిషివి నువ్వు ఒక్కర్తెవే సరితా" ఉద్వేగంగా ఆమెను కౌగిలించుకొన్నాడు మూర్తి.

ఎందుకో తెలియక కన్నీరు కార్చాడు.

అవతల వర్షం పడుతోంది యింకా.

"నీ పెద్ద మనసు ముందు నేనెంత చిన్నవాణ్ని" అన్నాడు చిన్నపిల్లాడిలా వెక్కుతూ.

సరిత తృప్తిగా నిశ్వసించింది.

"ముందు వెళ్లి ఆరిక్షా ఇచ్చేసి రండి. పారిపోకండి మళ్లీ" అంది భయపడుతూ.

"లేదు సరితా! పారిపోవడం అంటూ జరిగితే ఇక నీతోనే" అన్నాడు మూర్తి.

* * *

ఆరోజు సావిత్రి పాటకచేరి-

లాయర్ ఖాన్ ఏర్పాటు కావడం వల్ల, స్థానికంగా అతనికున్న పలుకుబడివల్ల జనం బాగా వచ్చారు. థియేటర్ నిండిపోయింది.

సుధతో కలసివచ్చింది సావిత్రి. అయినింటి ఇల్లాలులా మెరిసిపోతోందామె.

థియేటర్ దగ్గర నిలబడ్డ రిక్షాల వైపు తేరిపార చూసింది సావిత్రి. మూర్తి వస్తాడన్న ఆశ. తన కచేరీకి తప్పక వస్తాడన్న నమ్మకం. కాని అక్కడున్న రిక్షా వాళ్లలో అతని ముఖం ఎక్కడా కన్పించకపోవడంతో దుఃఖం వచ్చింది.

"వెతుకుతున్నావా?" సుధ ఆమెముఖం లోనికి సూటిగా చూస్తూ అడిగింది.

సావిత్రి పలకలేదు. తల పక్కకి తిప్పుకొని థియేటర్ లోనికి నడిచింది. గ్రీన్ రూంలోనికి వెళ్లింది. సుధ మొదటి వరుసలో కూర్చుంది.

సావిత్రి గ్రీన్ రూంలోనికి వెళ్లడం మూర్తి చూశాడు. గతంలో జరిగిన సంఘటనలు జ్ఞప్తికి వచ్చి విరక్తిగా నవ్వుకొన్నాడు.

లోపలికి వెళ్లడానికి తనకి పర్మిషన్ దొరక్కపోవచ్చు. అక్కడ ఖాన్ వుండొచ్చు! అయినా ప్రయత్నం చేయాలనుకొన్నాడు. వెళ్లి మాట్లాడాలనుకొన్నాడు.

కచేరి ప్రారంభమయింది.

శ్రోతలు ఆనందంగా చప్పట్లు చరుస్తున్నారు.

మృదు మధుర కంఠం ఆమెది. సరిత ఉత్సాహంగా సావిత్రినే చూస్తోంది.

మూర్తికి ఆ కంఠం ఎందుకో పేలవంగా వుందన్పించింది.

"ఆ గాత్రం ఎలా వుంది? బాగుందా?" ప్రశ్నించాడు సరితని.

"చాలా బాగుంది. మీకు బాగాలేదా?" ఎదురు ప్రశ్నించింది సరిత.

కచేరీ ముగిసింది.



అంతా వెళ్లిపోతున్నారు.

సుధతో పాటు థియేటర్ ఆవరణలో నిలబడింది సావిత్రి. అభిమానులు చుట్టు ముట్టారు. మూర్తి అందర్నీ తోసుకొంటూ ఆమె దగ్గరగా వెళ్లాడు.

మూర్తిని చూసింది సావిత్రి. ఆశ్చర్యపోయింది.

ఫుల్ సూటులో జమిందారీ బిడ్డలా కన్పిస్తున్నాడు మూర్తి.

రిక్షా లాగుతూ బీదా బిక్కిలా బతుకీడ్చే మూర్తిలా లేడిప్పుడు. ఏదో పెద్ద వుద్యోగం చేస్తున్నవాడిలా దర్పంగా, హుందాగా కన్పిస్తున్నాడు.

సావిత్రి ఆలోచనలు తారుమారయ్యాయి. రిక్షావాడిగా ప్రత్యక్షమవుతాడనుకొన్న మూర్తి పెద్ద ఆఫీసర్లా కన్పడేసరికి అవ్యక్తమైన ఆనందం తొంగి చూసిందామెలో.

సుధ కూడా ఆశ్చర్యపోయింది. ఏ మాజిక్ జరిగింది?
మూర్తిలో మార్పుకి కారణం ఏమిటి అని ఆలోచిస్తోంది.

"బాగున్నావా సావిత్రీ?" అన్నాడు దగ్గరగా వచ్చి మూర్తి.

మాట్లాడలేకపోతోంది సావిత్రి. దుఃఖంతో గొంతుక పూడుకుపోయింది. చేతుల్లో ముఖం దాచుకొని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

అనునయంగా తల నిమిరింది సుధ.

అంతా గమనిస్తూ నిల్చుంది సరిత.

మాటలు మూగబోయాయి అందరికీ.

"ఇక్కడేం మాట్లాడుతుంది. రేపు ఉదయం ఇంటికి రండి. ఖాన్‌గారు కోర్టుకు వెళ్తారు ఆ సమయంలో. అన్నీ మాట్లాడుకొందాం" సుధ కలుపుగోలుగా అన్నది నెమ్మదిగా.

సావిత్రి ఏడుస్తూనే వుంది.

ఖాన్ ఆమె కోసం గాలిస్తున్నాడు.

సుధ సావిత్రిని తోడ్చుకుపోయింది.

"పాపం! చాలా బాధపడుతోంది" సరిత అంది.

నిట్టూర్చాడు మూర్తి.

"అందంగా వుంది. మంచిదానిలా కన్పిస్తోంది."

సరిత వైపు చూశాడతను.

"అక్కయ్య చాలా మంచిదికదూ" నవ్వుతూ అందామె.

"అవును" అనగలిగాడు మూర్తి.

"రేపు వాళ్లింటికి వెళ్దాం"

మాట్లాడలేదు మూర్తి.

"వెళ్లి పలకరిద్దాం. మన మనిషిని మనం ఓదార్చుకోవడంలో తప్పులేదుగా"

"సరితా!"

"అవునండీ! ఆమెను చూస్తుంటే జాలి వేస్తోంది"

"జాలిదేనికి?"

"సాటి ఆడది కనుక"

"ఆడదానిగా నన్నేం చేసిందో నీకు తెలుసా?"

"మగవాడిగా మీరేం చేశారామెకి?"

"సరితా!"

"అందరూ మంచివాళ్ళే! మంచి అన్నది మనసుల్లో వుండాలి"

"మరి ఆ మంచి మనసుని ఎందుకు విరిచేసుకొంది?"

"పరిస్థితులు"

"హుం! పరిస్థితులు" వెటకారంగా అన్నాడతను.

"నిజం. మనిషినీ, మనసునీ నిర్దేశించేవి పరిస్థితులే! క్షణం కావాలనుకొన్న వాళ్లు విడిపోయినా, విడిపోయిన వాళ్లు కలుసుకొన్నా– దొంగలు–వ్యభిచారులు పడుపుగత్తెలు– నేరస్తులు– హంతకులు అందరూ అంతా పరిస్థితుల ప్రభావాలవల్లే తయారయ్యేది"

"వేదాంతం బోధిస్తున్నావా?"

"కాదు – జీవితాన్ని అర్థం చేసుకోమంటున్నాను"

"జీవితం కలలాంటిది. క్షణంలో ముగిసిపోతుంది"

"అవును. అదే మంచి కల అయితే మూణ్నాళ్లు బతికి వుంటుంది"

"బతికుండి ఏం సాధిస్తుంది?"

"మంచి చేస్తుంది"

–మూర్తి పగలబడి నవ్వాడు.

"మళ్లీ మంచికే వచ్చావు" అన్నాడు.

సరిత నవ్వింది.

మనిషిలో ఎంత ఎదుగుదల! క్షణ క్షణానికి సరితలో మార్పు కన్పిస్తోంది. మంచి మనసు – అందర్నీ తన వాళ్లుగా అనుకోవడం – ఇతర్లతో కష్టసుఖాలు పంచుకోవడం–నిజంగా తను చేసుకొన్న పుణ్యం సరిత సహభాగిని కావడం అనుకొన్నాడు మూర్తి.



"చెప్పండి – రేపు వెళ్దామా వద్దా?"

"వెళ్దాం" అన్నాడు నవ్వుతూ.

మర్నాడు ఉదయం–

పదకొండు గంటల సమయంలో లాయర్ ఖాన్ ఇంటికి వెళ్ళారిద్దరూ.

బయట ఆవరణలో నౌకరు కూర్చుని వున్నాడు. వీళ్లని చూస్తూనే లేచి నిలబడ్డాడు.

"అమ్మగారున్నారా?" మూర్తి అడిగాడు.

తలూపాడు చేతులు కట్టుకొని నౌకరు.

ఇద్దరూ హాలులోకి వెళ్ళారు. మెట్లెక్కి మేడపైకి నడిచారు. ఉయ్యాల వూపుతూ నిల్చుంది సావిత్రి. అలికిడికి ఇటు తిరిగి చూసింది.

"రండి" అంటూ సంబరపడుతూ ఆహ్వానించింది.

చెరో కుర్చీ వేసింది ఇద్దరికీ. కిందకి హడావుడిగా వెళ్లి వంటమనిషితో కాఫీ తెమ్మని చెప్పి వచ్చింది.

"బాగున్నావా?" ప్రశ్నించాడతను.

"బాగున్నాను. కరిగిపోక, చెరిగిపోక నిల్చున్నాను. ఎందుకు బతికున్నానా అని అనుకొంటున్నాను"

ఆమె కళ్లల్లో సన్నటి నీటి తెర.

"బాధపడకు సావిత్రీ! నువ్వు సుఖంగా వున్నావంటే నేనెంతో సంతోషిస్తాను. బాధపడుతున్నావంటే నేను తమాయించుకోలేను. విధి మనల్ని వేరుచేసి మేలు చేసింది. నువ్వీనాడు లాయర్ ఖాన్ గారి భార్యవంటే నాకెంత ఆనందంగా వుందో తెలుసా" దగ్గుతికతో అన్నాడు మూర్తి.

కాఫీ తెచ్చింది వంటమనిషి.

మాటలు ఆపేశారు.

సరిత ఊయల దగ్గరగా వెళ్లింది. ఎర్రగా, బొద్దుగా వున్న పసివాణ్ని చేతుల్లోకి తీసుకుని మూర్తి దగ్గరగా

వచ్చింది.

"ఎన్నో నెల" అనడిగింది సావిత్రిని.

"ఎన్నోనెల లేదు. నలభై రోజు లయింది"

బాబు నిద్రనుండి మేల్కొని 'కెవ్వు' మన్నాడు.

ఆత్రంగా, ఆప్యాయంగా తన చేతు ల్లోకి తీసుకుంది సావిత్రి.

"మీ జ్ఞాపకం వీడు. పిల్లాడు పుడితే కాస్సంత ధైర్యం తెచ్చుకున్నాను. మగాడు ఎలాగైనా బతికేస్తాడు. ఆడది అయితే వేరు. మళ్లీ నా పాత జీవితం పునరావృతమవుతుందని భయం. అందుకే ఇలా చేయాల్సి వచ్చింది"

మూర్తి బాబుని చేతుల్లోకి తీసు కున్నాడు. ముద్దుల్తో ముంచెత్తాడు.

"బాబుని నా దగ్గరే వుండనివ్వండి" అంది అభ్యర్థనగా మూర్తివైపు చూస్తూ సావిత్రి.

ఆ మాటలకి నవ్వాడు మూర్తి.

"తొమ్మిది మాసాలు మోసి, కని, పెంపకంచేసే తల్లికే పిల్లల హక్కు వుంది. తండ్రికి ఎంతమాత్రంలేదు. దీనికి కోర్టులూ, సాక్ష్యాలు అక్కర్లేదు. మన మనసులు చాలు. ఈ బాబు నీ బాబే"

కన్నీటితో అతన్ని దేవుడిలా చూసిం దామె. బాబుని అందుకొని గుండెలకు హత్తుకొంది.

"నన్ను క్షమించండి. నేను మీకు తీరని ద్రోహం చేశాను"

"ద్రోహాలు ఎవరు ఎవరికీ చేయలేదు. ఇదంతా సహజం! నిజానికి పద్మ ద్రోహం చేసిందనుకున్నాను. కాని దానికి ప్రతి ఫలంగా ఓ రోజు ఛార్జీ తీసుకోకుండా రిక్షాలో ఆమెను ఇంటికి దిగబెట్టి వచ్చాను. పరిస్థితులు సావిత్రీ! పరిస్థితులే మనల్ని అనేక రకాలుగా మలుస్తాయి. నువ్వు ఎక్కడున్నా సుఖంగా, సంతోషంగా వుండగలగటమే నాక్కావలసింది"

సరిత వాళ్ల విషయాల్లో జోక్యం కలుగజేసుకోలేదు. జోక్యం చేసుకునే అవసరం కూడా లేదనుకొందామె.

సావిత్రి కళ్ళతోనే ఆమె 'ఎవరన్న ట్టుగాప్రశ్నించిందిమూర్తిని. చెప్పాడతను.

"ప్రస్తుతం నాకు ఆశ్రయం ఇచ్చిన దేవత" అన్నాడు.

"ప్రస్తుతం కాదు-ఎప్పుడూ ఆశ్రయం ఇచ్చే అనురాగమూర్తి అనండి. డైలాగ్ చాలా రక్తి కడుతుంది" అంది నవ్వుతూ సరిత.

సావిత్రికూ్కడా నవ్వొచ్చింది.

వద్దు వద్దంటున్నా భోజనాలుచేసి మరీ వెళ్లాలని పట్టుబట్టిందామె. భోజనాలు అయ్యాయి.

"తరుచూ వస్తుంటారు కదూ! నన్ను మరిచిపోరు కదూ!" కన్నీళ్లతో వేడు కొంటున్నట్టుగా అడిగింది సావిత్రి.

"తప్పకుండా వస్తాను. నిన్ను మరిచి పోలేను సావిత్రీ!" ఆమె తల నిమురుతూ అన్నాడు.

ఇద్దరూ కను మరుగయ్యే వరకూ అక్కడే నిల్చుని తర్వాత బాబు దగ్గరగా వచ్చి - "మూర్తీ! మూర్తీ!" అంటూ వాణ్ని ముద్దులతో ముంచెత్తింది సావిత్రి.

"సావిత్రిని గూర్చి నీ అభిప్రాయం?" ఇంటికొచ్చిన తర్వాత సరితను దగ్గరగా తీసుకొని అడిగాడు మూర్తి.

"మంచి ఇల్లాలు"

—ఆరాధనా పూర్వకంగా ఆమెను తలుచుకొంటూ జవాబిచ్చింది సరిత.

★

# చిత్ర ప్రపంచం



ఈ కుక్కుటేశ్వర్ గారు ఇప్పుడే డ్యూటీ నుండి తప్పుకుని రిలాక్స్ అవుతున్నారు అందుకే అలా... ...



ఈాయనింకా డ్యూటీలోనే ఉన్నారు అందుకే ముక్కుమీద
కందిరీగ వాలినా కదలనంత క్రమశిక్షణను పాటిస్తున్నారు



కాకిపిల్ల కాకికి ఎందుకు ముద్దు కాదూ? ఈ తల్లి బిడ్డకు
తిండి తేవటమే కాదు తినటం కూడా నేర్పుతుందన్న మాట





ఖబర్దార్ ! ఎవరు ఇటువచ్చినా జాగ్రత్త అంటూ భద్రుంగా
కాపలా కాస్తుందీ పిల్లల తల్లి. అయినా ఎవరికుంటాయి గనక
ఇటు కేసి రాగల దమ్ములు?



సంతాప సభలు మర్కటి కుటుంబాల్లోనూ జరుగుతాయని తెలియదా?
ఇంతకన్నా మరే ఉదాహరణ కావాలి గనక !



రేపిస్టులు మానవకోటిలోనే గాదు అన్ని వర్గాల్లోనూ పశుపక్ష్యాదుల్లో
సహా... ... ఉంటారంటున్నారీ కుందేలు గారు !





పోరాటం కాదులెండి ఇదో రకం మోటు సరసం
కాన్యా భాషలో దీన్నే రాక్షస వివాహం అంటారేమో!



'నన్ను చూడు నా వాల సౌందర్యమ్ము చూడు' అనటానికి
ఆమాత్రం తోక ఉండాలి గదండీ!



రాబందు గారి స్పీడు తాబేలు దగ్గర పని చేయ లేదు గానీ
గుడ్లగూబ గారు మాత్రం ఎలుకను సాధించేశారు





కుంపట్లాంటి ఈ అధునాతన గృహాల్ని ప్రస్తుతం అల్జీరియాలోని బిస్కాని వద్ద కడుతున్నారు. కింది కార్ల కథేమంటారా? అద్దే ఆరెంటిలో ఓ దాన్ని ఓ అందాల రాసి నడుపు తూండగా...!





అంతలావు గొరిల్లా గారికి ఇంత "అల్పా" హారమా అనుకుంటే
మరి బతికేదెలా... ?



అవును నాకు. ఆమాత్రం అల్పాహారం కూడాలేక
కడుపుకాలి నోరూరుతోందండీ!

ప్రముఖ సైంటిస్టులుగా, రాజకీయ వేత్తలుగా, రచయితలుగా అజరామర కీర్తి సాధించి ప్రఖ్యాతిగాంచిన వాళ్లంతా మతిలేని మహాత్ములుగానూ, మహా చమత్కారులుగానూ కూడా ప్రసిద్ధులే.

ప్రపంచ ప్రసిద్ధ సైంటిస్ట్ థామస్ ఎడిసన్ 1931లో చనిపోయే నాటికి 1300 కొత్త విషయాలు కని పెట్టిన సైంటిస్టుగా పేటెంట్ హక్కు కలిగి ఉన్నాడు. ప్రపంచ చరిత్రలో ఇంతఎక్కువ సంఖ్యలో పేటెంట్ హక్కు పొందిన సైంటిస్టు మరొకరు లేరు! అమెరికాలో ఈయన లేబరేటరీ—మెన్‌లో పార్క్ అనే చోట ఉండేది. ఈ లేబరేటరీలో చాలా మంది పనిచేసేవారు. ఒకసారి ఈ లేటరేటరీకి కాపలాగా కొత్త వ్యక్తిని నియమించారు. అతన్ని నియమిస్తూ ఆ లేబరేటరీ అధికారి "ఎడిసన్ గారి లేబరేటరీలోకి మాత్రం నా అనుమతి లేకుండా ఎవరినీ అడుగుపెట్టనీయవద్దు. ఆయన అసలే మతిమరుపు మనిషి. ఆయన కళ్ళ ముందు దొంగతనం జరుగుతున్నా ఏదో ఆలోచిస్తూ ఆ విషయమే పట్టించుకోరు. కాబట్టి చాలా జాగర్తగా ఉండాలి" అన్నాడు.

ఇది జరిగిన నాలుగో రోజు నలిగిన బట్టలతో, చెదిరిన తలతో, నిద్రలేక ఎర్ర బడ్డ కళ్లతో, చేతిలో ఏవో తీగలతో ఓ మధ్య వయస్కుడు ఎడిసన్ లేబరేటరీలోకి వెళ్ళబోతున్నాడు. కొత్త ఉద్యోగి ఆ వ్యక్తిని ఆపి "ఇదిగో నీకే చెప్పేది. అది ప్రముఖ సైంటిస్టు ఎడిసన్‌గారి గది.



అందులోకి ఎవరినీ అనుమతించం. అంతగా కావాలంటే ప్రధానాధికారి అనుమతి తీసుకురా!" అన్నాడు దాదాపు మెడబట్టి నెట్టినంత పనిచేస్తూ.

కాసేపటికి లేటరేటరీ అధికారితో ఆ పిచ్చివాడు తిరిగొచ్చాడు. కొత్తగా వాచ్‌మన్‌గా చేరిన వ్యక్తి ఆశ్చర్యంగా చూస్తుండగా "నీకేమన్నా బుద్ధివుందా! ఈయన్ని లేబరేటరీలోకి అనుమతించక పోవటానికి నీకెన్ని గుండెలు. ఈయనే మన యజమాని థామస్ ఎడిసన్‌గారు!" అన్నాడు లేబరేటరీ అధికారి మండిపడుతూ.

ఒకరోజు ఎడిసన్ ఇంటికి రాగానే అతని భార్య "రేపే మన వివాహ వార్షికోత్సవం. మీకెక్కువ ఆనందం కలిగించే ప్రాంతానికి వెళదాం. కాదనకండీ!" అంది.

ఎడిసన్ "అలాగే తప్పకుండా వెళదాం. నీ మాట కాదనగలనా?" అన్నాడు లాలనగా.

రెండవ రోజు ఉదయమే ఎడిసన్ భార్య చక్కగా ముస్తాబై భర్తనూ ముస్తాబు చేసింది. భార్యాభర్తలు నాలుగు గుర్రాల బండి ఎక్కారు.

ఎడిసనే స్వయంగా ఆ బండి తోలుతున్నందుకు ఎడిసన్ భార్య మరీ సంతోషించింది. ఆ గుర్రపుబండి ఆగగానే ఆమె బయటకు తొంగిచూసి సంభ్రమాశ్చర్యాలతో నోటమాట రాక అలాగే చూస్తూ ఉండిపోయింది. అది ఎడిసన్ లాబొరేటరీ!

కాసేపటికి ఓ పనివాడు ఓ చిన్న కాగితం తెచ్చి ఆమె కిచ్చాడు. అందులో



"నాకెక్కువ ఆనందం కలిగించే ప్రదేశం ప్రపంచంలో ఇదే! యిదుకే అంక్కడికే వచ్చాను" అని ఎడిసన్ స్వహస్తంతో రాసిన అక్షరాలున్నాయి.

ఎడిసన్‌కు డిన్నర్ పార్టీల్లో గంటలు గంటలు గడిపి కాలక్షేపం చేయటం ఎప్పుడూ ఇష్టముండేది కాదు. అయినా బాగా సన్నిహిత మిత్రుల మాట కాదన లేక మొహమాటం కొద్దీ వెళుతుండేవాడు. ఒకసారి ఓ పెద్ద డిన్నర్ పార్టీకి వెళ్లిన ఎడిసన్ అక్కడి నుంచి మెల్లిగా తప్పుకోవాలని, ఎవరూ చూడకుండా బయటపడాలని దొడ్డిదారి ఎన్నుకున్నాడు. తీరా ఆ దారిన బయట పడుతుండగా డిన్నర్ పార్టీ యిచ్చిన యింటి యజమాని చూసి ఏమీ ఎరగనట్టు పలక

రిస్తూ "ఏం సార్ ఎడిసన్‌గారూ! ప్రస్తుతం ఏ ప్రయోగం చేస్తున్నారు? మీ ప్రయోగాలకు ఎప్పుడూ ఏదో ఒక ప్రాముఖ్యత వుంటుంది" అన్నాడు.

వెంటనే ఎడిసన్ "ప్రస్తుతం ఈ దొడ్డిదారిన బయటపడే ప్రయోగం చేస్తున్నాను దీని ప్రాముఖ్యత అప్పుడే తెలియటం కష్టం!" అన్నాడట చల్లగా జారుకుంటూ.

ఎలక్ట్రిక్ బల్బులో మాడిపోకుండా ఎక్కువ కాలం మన్నికగా ఉండే ఫిలమెంట్‌ని తయారుచేయటానికి ఎడిసన్ కొన్ని నెలలపాటు రాత్రింబవళ్లు కృషి చేయాల్సివచ్చింది. ఈ ప్రయత్నంలో యాభై వేల రకాల ప్రయోగాలు విఫలమై పోయాయి. అయినా ఎడిసన్ యింకా ప్రయోగాలు చేస్తూనే ఉన్నాడు. అయితే ఎడిసన్ దగ్గర అసిస్టెంట్‌గా చేరిన యువకుడికిది మరీచాదస్తం అనిపించింది. ఒక రోజు అతను ఎడిసన్ పద్ధతికి విసుక్కుంటూ "ఎడిసన్ అంటే గొప్పమేధావి అనీ, ఎన్నో వందల కొత్త వస్తువులు కనిపెట్టిన సైంటిస్ట్ అనీ అనుకున్నాను. కాని ఒక చిన్న ఫిలమెంట్ కనుక్కోడానికి యాభై వేల ప్రయోగాలు చేసే వ్యక్తి అనుకోలేదు." అన్నాడట.

వెంటనే ఎడిసన్ "బాబూ! చిన్నవాడివి. నీకు అనుభవం లేకపోవటంతో అలా అన్నావు. మేధావి అంటే తెలివితేటలు కాదు, కష్టపడటం మాత్రమే! ప్రపంచానికి నా విజయాల సంగతే తెలుసు. కాని ఒక్కో విజయం సాధించటానికి నేనెన్ని లక్షల, కోట్ల అపజయాలు చవిచూశానో, ఎంత నిరాశానిస్పృహలకు, మానసిక ఆవేదనకు గురయ్యానో, మళ్లీ రెట్టించిన ఉంత్సాహంతో ఎలా పని చేశానో నా అంతరాత్మకే తెలుసు" అన్నాడట భుజం తడుతూ.

ఎడిసన్ గొప్పతనం అప్పటికిగాని పూర్తిగా అర్థం కాలేదట ఆ అసిస్టెంట్‌కు.

* * *

ఉక్కుమనిషిగా విఖ్యాతుడైన సర్దార్ వల్లభాయిపటేల్ ఎంత రాజకీయ దురంధరుడో, అంతకు మించిన వినోద ప్రియుడు.

పటేల్ విద్యార్థిగా ఆరవ తరగతిలో ఉండగా, బరోడాలోని ఆ స్కూలులో ఛోటాలాల్ అనే గుజరాతీ అధ్యాపకుడుండేవాడు. ఆయనకు సంస్కృతం అంటే వల్లమాలిన అభిమానం! ఎవరైనా సంస్కృతం క్లాసు వద్దని గుజరాతీకి మారితే ఆయన ఆ విద్యార్థుల్ని



వ్యంగ్యంగా ఆటలు పట్టించేవాడట. ఆ అలవాటు చొప్పున ఆ అధ్యాపకుడు పటేల్‌ను కూడా ఓసారి "ఏమోయ్! సంస్కృతం రాందే గుజరాతీ భాషరాదనీ తెలియదా? మరి నువ్వు సంస్కృతం

వదలి గుజరాతీ క్లాసుకెందుకుమారావు?" అన్నాడట.

వెంటనే పటేల్ "మేమంతా సంస్కృతం తీసుకుంటే, మీ గుజరాతీ క్లాసులో ఎవరూ మిగలక మీ ఉద్యోగం ఊడే ప్రమాదం ఉంది కదండీ! అందుకని" అన్నాడట.

ఆ దెబ్బతో దిమ్మ తిరిగిన పంతులుగారు మండిపడి పటేల్‌ను బెంచీ ఎక్కించటమే కాకుండా "రేపు పది వరకు పాడాలు (ఎక్కాలు) వేసుకురా?" అంటూ శిక్ష వేశాడట.

కాని, పటేల్ ఆ శిక్షను లెక్కచేయక పోవటంతో మర్నాడు దాన్ని పెంచుతూ "నీ రోగం కుదరాలంటే రేపు రెండు వందల పాడాలు (ఎక్కాలు) సిద్ధం చేసుకురా" అంటూ శిక్ష పెంచాడటమళ్లీ.

రెండో రోజు పటేల్ స్కూలుకు రాగానే "ఏరా! పాడాలు(ఎక్కాలు)ఏవీ?" అంటూ గద్దించాడు పంతులుగారు.

గుజరాతీలో పాడా అంటే ఎక్కాలు అనీ, దున్న పిల్ల అనీ రెండర్థాలున్నాయి. అందుకని, పటేల్ "నేను ఇందాక రెండు వందల పాడాల్ని మన స్కూలు తలుపు వరకూ తోలుకొచ్చానండీ! అయితే అవి మీ పాఠం విని కాబోలు పారిపోయాయి" అన్నాడట.

వకీలుగా పటేల్ ఎలాంటి క్రిమినల్ కేసునైనా అవలీలగా గెలిచేవాడు. పటేల్ వాదనా పటిమ ఇందుకు కారణం.

ఒకసారి ఆయన ఉరిశిక్ష పడుతుందనుకొంటున్న ఒక నేరస్తుణ్ని రక్షించాలని హైకోర్టులో వాదిస్తున్నాడు. ప్రాసిక్యూషన్ వాదం బలంగా ఉంది. పటేల్ విజృంభించి విశ్వరూప ప్రదర్శన చేస్తే తప్ప ముద్దాయికి ఉరిశిక్ష ఖాయమనుకుంటున్నారు.

ఇంతలో పటేల్ ఉన్న కోర్టు గదిలోకే ఒక టెలిగ్రాం వచ్చింది. అది రెప్పపాటు కాలంలో చదువుకొని పటేల్ తన వాదన కొనసాగించి 'శభాష్' అనిపించుకొని బయటికొచ్చాడు. ముద్దాయికి శిక్ష తప్పింది!

తరువాత టెలిగ్రాంలోని విషయం తెలిసి ఒక మిత్రుడు "భార్య చనిపోయిందని తెలిసికూడా వాదన కొనసాగించావా?" అన్నాడట ఆశ్చర్యంతో.

పటేల్ ఆ మాటకు బాధపడకుండా "ఏం చేయను మిత్రమా? ఆమె ఎలాగూ చనిపోయింది. తిరిగి ఆమె రాదుకదా! ఆమెకోసం ఈ ముద్దాయిని కూడా ఎలా చంపను?" అన్నాడట.

ఒకసారి పటేల్ వాల్డో అనే గ్రామంలోని ఒక పెద్ద రైతుసభలో ఉపన్యసిస్తున్నారు. అది ప్రభుత్వం పెంచిన పన్నులకు వ్యతిరేకంగా రైతులు సాగిస్తున్న పోరాటాన్ని బలపరిచే సభ! రైతు కుటుంబంలో పుట్టి పెరిగి రైతు సాధకబాధలు తెలిసిన పటేల్ ప్రజాభిప్రాయాన్ని రైతులకు అనుకూలంగా మలచాలని తన అనర్గళ ఉపన్యాసం కొనసాగించాడు. ఆయన ఉపన్యాసం కాగానే అక్కడికి దగ్గర్లో పొలాల్లో మేస్తున్న గేదెలు కొన్ని గోలగా అరవటం సాగించాయట! వెంటనే పటేల్ "అదిగో వినండయ్యా రిపోర్టర్లూ! ఈ బ్రిటిషు పరిపాలనలో న్యాయం మంటగలిసిపోయిందని ఆ గేదెలు ఎలా వాపోతున్నాయో స్వయంగా చూడండి ... వినండి...రాయండి" అన్నాడట.

ఒకసారి గాంధీజీ కొబ్బరి తాడుతో నేసిన మంచంమీద పడుకోవటానికి

ఉద్యుక్తుడవుతున్నారు. పటేల్‌కు ఆ పని నచ్చక "ఈ మంచంలో నల్లులుంటాయి! వాటితో మీరెక్కడ వేగగలరని? ఏమీ అనుకోకండి! మీకో నవారు మంచం ఏర్పాటు చేస్తాను" అన్నాడట.

కాని గాంధీగారు నవారు మంచం వద్దని మొండికేశారు. గాంధీజీ సెక్రటరీ మహాదేవ దేశాయి కూడా గాంధీజీ నిర్ణయాన్నే బలపరచారు.

"అసలే గాంధీజీ ఎముకలగూడు కదా! మరి ఆ కొబ్బరితాటి మంచంలోని నల్లులు ఆ ఎముకలగూటి మీదున్న కాస్త



చర్మం కూడా తినివేయాలనా మీ ఉద్దేశం" అన్నాడట పటేల్ ఛలోక్తిగా.

గాంధీజీ వల్లభాయ్ హాస్యానికి గలగలా నవ్వారట కాస్త దిగివస్తూ.

ఒకసారి కొందరు యువకులు గాంధీజీని కలుసుకోడానికి వెళుతూ పటేల్‌కు తటసపడ్డారు.

"ఏమిటి గాంధీజీతో పని!" అడిగారు పటేల్. "గాంధీజీతో బ్రహ్మచర్యానికి సంబంధించిన విషయాలు చర్చించబోతున్నాం!" అన్నారట వాళ్లు.

వెంటనే పటేల్ "ఆయనకు భార్య వుంది! నలుగురు కొడుకులు. వాళ్ళకు అందరికీ పెళ్ళిళ్లయ్యాయి. పిల్లాజెల్లా కూడా ఉన్నారు. అలాంటి ఆయనతోనా బ్రహ్మచర్యానికి సంబంధించినవిషయాలు మాట్లాడేది? నా భార్య చనిపోయి చాలా ఏళ్లయింది. నాకు ఇద్దరే పిల్లలు. నేను మళ్ళీ వివాహ ప్రసక్తే ఎత్తలేదు. బ్రహ్మచర్యాన్ని గురించి నన్నడిగితే నేను చెప్పనా?" అన్నారట నవ్వుతూ.

ఒకసారి ఓ అతిచాదస్తుడు గాంధీజీ దగ్గరికొచ్చి "గాంధీజీ! మనం ఈ మూడు మణుగుల శరీర భారంతో భూమి మీద నడుస్తుంటే భూమి మీది జీవులు ఆ బరువు కిందపడి నలిగి ఎన్నెన్ని చనిపోతున్నాయోగదా?" అన్నాడట బాధగా.

గాంధీజీ ఆ మహా అహింసావాదికి ఏం సమాధానం చెప్పాలో తోచక సతమతమవుతుంటే అక్కడే ఉన్న వల్లభాయి అందుకొని "దీనికింత ఆలోచించే పనేముంది.కాళ్లు నెత్తిన పెట్టుకొని నడిస్తేసరి.

మీ సమస్య తీరిపోతుంది!" అన్నారట వ్యంగ్యంగా.

* * *

లోహియాను 'పండిత రాజకీయ నాయకుడు' అని చెప్పవచ్చు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన డాక్టర్ లోహియా సంభాషణాచతురుడు, హాస్యప్రియుడు.

జర్మనీలో డాక్టరేట్ సంపాదించిన లోహియా కార్మిక పక్షపాతి. ఒకసారి బొంబాయిలో సినిమారంగంలోని ఎక్స్ట్రా నటులంతా కలసి ఒక సంఘంగా




ఏర్పడ్డారు. కార్మిక సమస్యలను గురించి ఎక్కువగా పోరాడే లోహియానే వాళ్లు తమ సంఘ ప్రారంభోత్సవానికి ముఖ్య అతిథిగా పిలిచారు. లోహియా వాళ్ళ ఆహ్వానాన్ని మన్నించారు.

ఈ సంగతి ఓ ప్రముఖ రాజకీయ వేత్తకు తెలిసి "సినిమా ఎక్స్ట్రానటుల ప్రారంభోత్సవానికి మీరు ముఖ్య అతిథిగా వెళుతున్నారా? ఆశ్చర్యంగా ఉందే" అన్నాడట.

వెంటనే లోహియా "రాజకీయ నాయకుల మధ్య నేను ఎక్స్ట్రానటుణ్నే! అందుకే స్వజాతి అభిమానం చావక వాళ్ళ ఆహ్వానం స్వీకరించాను" అన్నారట నవ్వుతూ.

నెహ్రూ, లోహియా జాతీయోద్యమ కాలంనుంచీ మంచి స్నేహితులు. 1921 ప్రాంతాన ఫైజాబాద్ అనేచోట జరుగుతున్న రైతు ఉద్యమానికి నెహ్రూ నాయకత్వం వహించారట. అప్పుడు యువ నాయకుడైన లోహియా ఇంట్లో నెహ్రూ వుండటానికి భోజన వసతులతో సహా ఏర్పాట్లు జరిగాయి.

ఆయనకు లోహియా ఇంట్లో దువ్వెన, అద్దం కావల్సి వచ్చింది.

లోహియా ఆయనకు అద్దం, దువ్వెన ఇస్తూ "అయినా నెహ్రూజీ...మీదంతా బట్టతల కదా! మీకు దువ్వెనెందుకు?" అంటూ ప్రశ్నించారు. ఈ మాటలతో నెహ్రూజీ నివ్వెరపోయారట.

లోహియా నిర్భయుడు. ఆయన పార్లమెంటులో నెహ్రూజీనే గడగడలాడించేవాడు. ఒకసారి లోహియా చాలా తక్కువ మెజారిటీ వోట్లతో పార్లమెంటుకు ఎన్నికై, పార్లమెంట్ సభ్యుడిగా ప్రమాణస్వీకారం చేశారు. ఈయన ప్రతిపక్ష సభ్యుడైన కారణాన నెహ్రూజీ తమాషాగా "ఎంత మెజారిటీ తమది?" అన్నారట లోహియాతో వ్యంగ్యంగా, తక్కువ వోట్ల సంగతి గుర్తుచేస్తూ.

వెంటనే లోహియా "మీకు పార్లమెంటులో ఉన్న మెజారిటీకి రెట్టింపు లెండి" అన్నారట మరింత వ్యంగ్యంగా.

1962లో చైనా మనదేశం మీద

చేసిన దాడిలో భారతదేశ అపజయానికి కారణాల మీద పార్లమెంటులో చర్చ జరుగుతోంది. లోహియా వేసే చిక్కు ప్రశ్నలకు సమాధానం చెప్పటానికి నెహ్రూజీకి చెమటలు పడుతున్నాయి. ఇక మరో మార్గం లేక నెహ్రూజీ "స్పీకర్ గారూ! మన కొత్త పార్లమెంట్ సభ్యుడు డాక్టర్ లోహియాకు పార్లమెంట్ రూల్స్ తెలియవు" అన్నారట - అలాగన్నా దెబ్బతీసి నోరు మూయించాలని. అయితే లోహియా తక్కువ తిన్నాడా! వెంటనే లోహియా "నెహ్రూజీ! మీరు పార్లమెంటుకు ఒక సేవకులు మాత్రమే. దానికి యజమానిలా మాట్లాడకండి! ఇక్కడున్న ఏ సభ్యుడికైనా జరుగుతున్న చర్చనీయాంశంలోని ఏ విషయాన్నయినా ప్రశ్నించే హక్కున్నదన్న రూలు సంగతి మీకు తెలుసా?" అన్నారట.

అంతే! నెహ్రూజీ మళ్ళీ అలాంటి ఆరోపణ తలపెట్టలేదు.

అదే చర్చ సందర్భంగా నెహ్రూజీ "మనం లడక్ ప్రాంతంలో పోగొట్టుకున్నది మొక్క కూడా మొలవని మంచు ప్రాంతం" అన్నారట - చైనావాళ్ళు మనకు చెందిన భూభాగం ఆక్రమించటాన్ని గురించి బాధపడనవసరం లేదన్నట్లుగా.

వెంటనే లోహియా "అయితే వెంట్రుకలు పెరగవని మీ బట్టతల విషయంలో కూడా అలాగే పోతేపోయింది లెమ్మని వదిలిపెడతారా?" అన్నారట చురక అంటిస్తూ.

ఒకసారి లోహియా, తారాకేశ్వరిసిన్హా ఒకే కారులో పార్లమెంటు నుంచి బయలుదేరి వెళుతున్నారు. లోహియా ఒకచోట పెద్ద గుంపుగా ఉన్న జనసమూహాన్ని చూపి "ఇక్కడ కారాపండి! ఇక్కడ తేనీరు బాగుంటుంది. పైగా చౌకకూడా" అన్నారట.

తారకేశ్వరిసిన్హా ఆశ్చర్యపడుతూ. "ఇదేమిటి? ఈ గుంపులో కెళ్ళి తేనీరు తాగుతారా?" అన్నదట.

వెంటనే లోహియా "ఇక్కడే నేను రోజూ తేనీరు తాగేది! అసలు ఈ గుంపే మనని పార్లమెంటుకుపంపిందన్న సంగతి మరచిపోయారా?" అన్నారట మరింత వ్యంగ్యంగా.

స్టాలిన్ కూమార్తె స్వెత్‌లానా కొన్నాళ్ళు భారతదేశంలో వున్నప్పుడామె ఓ భారతీయ యువకుణ్ని ప్రేమించి వివాహం చేసుకుందామనుకుంది. తరువాత ఇక్కడే స్థిర నివాసం ఏర్పరచుకొని, భారతీయ పౌరసత్వం పొందాలనేది ఆమె అభిలాష. కాని రాజకీయ కారణాల చేత ఆమె రష్యాకు పంపివేయబడింది.

రష్యానుంచి స్వెత్‌లానా పార్లమెంట్ సభ్యుడైన లోహియాకు తన బాధామయ గాథను, ప్రియుడి ఎడబాటువల్ల కలిగిన మానసికమైన వ్యథను వివరించి సాయం కోరుతూ సుదీర్ఘమైన లేఖ రాసింది.

లోహియా ఈ విషయం పార్లమెంటులో లేవనెత్తి స్వెత్‌లానాకు ఆమె ప్రియుడి ఎడబాటువల్ల కలిగిన బాధామయగాథ వినిపిస్తున్నారట.

ఇంతలో తారకేశ్వరిసిన్హా లేచి నిలబడి "లోహియాగారూ! మీరు బ్రహ్మచారులు గదా? అలాంటప్పుడు ప్రియుడి ఎడబాటువల్ల కలిగే సంతోషం, వ్యథ మీరు చెబుతున్నట్టుగానే ఉంటాయని ఎలా అనుకోమంటారు!" అందట.

లోహియాకు వళ్ళు మండి "మీకంత

అనుమానమైతే మీరే నాకు ఒక అవకాశం కల్పించి నా మాటల్లోని నిజం – ధృవ పరచుకోవచ్చుగా!" అన్నారట.

తారకేశ్వరి సిన్హా మొహం చిన్న బోవటం, పార్లమెంట్ నవ్వులతో మునిగి పోవటం ఏక కాలంలో జరిగాయట.

* * *

జార్జివాషింగ్‌టన్ (1732-99) అమెరికాకు మొదటి ప్రెసిడెంట్. 'అమెరికా జాతిపిత'గా ప్రసిద్ధుడైన వాషింగ్‌టన్, మొదట చిన్నస్థాయిలో సైన్యాధికారిగా సైన్యంలో చేరి, తన ప్రతిభతో 'కల్నల్' రాంక్ పొందాడు. అనేక యుద్ధాలలో గెలిచిన ఈయన హాస్యప్రియుడు. వ్యంగ్య ఛలోక్తులు విసరటంలో ఘనాపాఠి.



ఒకసారి రాజ్యాంగ సమావేశం జరుగుతోంది. "దేశ స్వాతంత్ర్యరక్షణకు మనదేశ సైనికుల సంఖ్య అయిదు వేలకు మించి వుండటం అవసరం" అన్నాడు వాషింగ్‌టన్.

అయితే రాజ్యాంగ సమావేశంలో సభ్యులుమాత్రంనానారభసగావిషయాన్ని చర్చించి "ఎట్టి పరిస్థితుల్లోనూ సైనికుల సంఖ్య అయిదు వేలకు మించకుండా వుండాలి. అంతకంటే ఎక్కువైతే దేశా దాయం మొత్తందేశరక్షణకేసరిపోతుంది. కాబట్టి అయిదువేల సంఖ్య ఎట్టి పరిస్థితుల్లోనూ మించనివ్వటానికి ఒప్పుకోము" అన్నారు ఏకగ్రీవంగా తీర్మానంచేస్తూ.

యుద్ధరంగంలో ఆరితేరిన,నిపుణుడైన వాషింగ్‌టన్‌కు వళ్ళుమండి "అయితే మరో తీర్మానం కూడా చేయండి!" అన్నాడు.

"ఏమిటది?" అడిగారు సభ్యులు.

"మనదేశం మీదకు దండెత్తి వచ్చే ఏ పరాయి దేశమైనా, మనదేశ సైనికుల సంఖ్య అయిదు వేలు కాబట్టి, వాళ్ళు మూడు వేలకు మించని సైన్యంతో మాత్రమే మనదేశం మీదికి దండెత్తి రావాలని తీర్మానం చేసేయండి!" అన్నాడు.

సభ్యుల ముఖాలు ఆ దెబ్బతో మాడి పోయి, వాషింగ్‌టన్ కోరినంత సైన్యాన్ని పెంచుకోడానికి అనుమతించారు.

జార్జివాషింగ్‌టన్ కోటీశ్వరుడూ, యుద్ధనిపుణుడూ కూడా. నిజాయితీకి, కార్యదీక్షకు పెట్టింది పేరు.తన ప్రత్యర్థుల్లా ఓటర్ల అభిమానం సంపాదించటానికి లంచాలు యివ్వటం నా మోషీ అను కున్నాడు. పర్యవసానంగా వర్జీనియా

రాష్ట్రంలో ఒక సీటుకు పోటీచేసి చిత్తుగా ఓడిపోయాడు.

తరువాత తన ఓటమికి అసలు కారణం తెలుసుకున్నాడు. ప్రత్యర్థి ప్రతి పోలింగ్ బూతు దగ్గర పానశాలలు తెరిపించి "మీ యిష్టం వచ్చిన వారికి ఓటు వేయండి! అయితే ఈ సేవకుడు స్వెరింగ్టన్ యిస్తున్న మీ అభిమాన పానీయం మాత్రం స్వీకరించండి!" అంటూ కాన్వాస్ చేయించుకున్నాడు. పీపాలకు పీపాలు-రమ్ము, జిన్, బీర్, వైన్ లాంటి పానీయాలు ఎలా ఎలా ఖాళీఅయ్యాయో,అలాగే అతని పెట్టెలలో ఓట్లూ నిండిపోయాయి.

ఈ గుణపాఠం వాషింగ్టన్ మళ్ళీ అలాంటి పొరపాటు చేయకుండా కళ్ళు తెరిపించింది. తరువాత ఎలక్షన్‌లో తనూ అదే పద్ధతి అవలంబించి ఘనవిజయం సాధించాడు. ఈ సందర్భంగా ఓచోట వాషింగ్టన్‌కు ఘనంగా పౌర సన్మానం జరుగుతోంది.

అధ్యక్షుడు లేచి "చూశారా! నిజాయితీ నెగ్గింది. మన ప్రజలు అభ్యర్థి ఔన్నత్యం గ్రహించి, క్రితంసారి చేసిన పొరపాటు ఈ సారి దిద్దుకున్నారు" అన్నాడు.

తరువాత వాషింగ్టన్ కృతజ్ఞతలు చెబుతూ "పొరపాటు తెలుసుకుంది ఓటర్లు కాదు, నేను! నేను గెలవటానికి నలభై గాలన్ల రమ్ము; పద్దెనిమిది గాలన్ల వైన్; నలభైమూడు గ్యాలన్ల బీరు కావాలని తెలుసుకున్నాను-ఇదీ కేవలం ఒక్క బూత్ దగ్గరే!" అంటూ చెప్పి కూర్చున్నాడు.

జార్జి వాషింగ్టన్ ఏ విషయాన్నయినా సహించేవాడు. కాని ఆలస్యంగా ఆఫీసుకు రావటం లాంటివి చస్తే అంగీకరించేవాడు కాదు.

వాషింగ్టన్ ప్రెసిడెంటుగా ఉండగా ఆయనకార్యదర్శి ఒకడురోజూ ఆఫీసుకు ఆలస్యంగా రావటం గమనించాడు. కొన్నాళ్లు అతని వాలకం చూసి చూసి చివరికి "ఏమిటి సంగతి?" అంటూ అడిగాడు వాషింగ్టన్.

"ఏం చేయమంటారు సార్! ఈ దిక్కుమాలిన గడియారం నా పరువు తీస్తోంది" అన్నాడు సెక్రటరీ బాధపడి పోతూ.



"అయితే అంత పరువు తీసే నీ గడియారాన్ని మారుస్తావో, నిన్నే ఈ పని నుంచి శాశ్వతంగా మార్చమంటావో రేపటి లోపల తేల్చుకో!" అన్నాడు తన నిర్ణయం చెబుతూ.

సెక్రటరీ ఆ దెబ్బతో బుద్ధితెచ్చు

కున్నాడు. ఈ వాషింగ్టన్ మహాశయుణ్ణి గురించిన ఒక ఛలోక్తి వుంది.

అమెరికా స్వాతంత్ర్యయుద్ధం ముగిసిన తరువాత వివిధ దేశాల మంత్రి ప్రముఖులతో సభ జరుగుతోంది.

ముందుగా బ్రిటీషు మంత్రి లేచి "రవి అస్తమించని మా బ్రిటిషు సామ్రాజ్య వెలుగురేఖలు ప్రసరించిన తరువాతే ఏ దేశానికైనా స్వాతంత్ర్యకాంక్ష కలిగేది" అన్నాడు.

తరువాత ఫ్రెంచి మంత్రి లేచి "చరిత్రలో ఫ్రాన్సు దేశం వెన్నెల కురిపించే చందమామ వంటిది! ఆ చందమామ వెన్నెల సోకిన తరువాతే మా దేశంలో వచ్చినలాంటి తిరుగుబాటు మీ అమెరికాలో వచ్చింది" అన్నాడు.

తరువాత రూజ్‌వెల్ట్ అమెరికా మంత్రిగా మాట్లాడుతూ "మీరు చెప్పే ఆ సూర్యచంద్రులు ఎవరి హద్దుల్లో వారుండాలని మీ రెండు దేశాలకు పాఠం చెప్పింది మా వాషింగ్టన్ మహాశయుడు" అన్నాడు ఆయన గొప్పతనం వగ్గడిస్తూ.

* * *

ఆంగ్ల సాహిత్య చరిత్రలో ఆస్కార్ వైల్డ్‌కి (1856-1900) ఓ ప్రత్యేక స్థానం వుంది. తన రచనల ద్వారా ఆయన పొందిన ప్రసిద్ధి, గొప్పతనం చూసి ఓర్వలేని ప్రత్యర్థులు పన్నిన కుట్రకు గురై ఆయన హోమో సెక్సువల్‌గా ముద్రపడి, జైలుశిక్షపాలై, చివరికి ఫ్రాన్సులో దుర్భర దారిద్ర్యంలో మరణించాడు. అయినా ఆస్కార్ వైల్డ్ హాస్యప్రియుడుగా ఛలోక్తులు విసరటంలో ఆయనకు ఆయనే సాటిగా ప్రసిద్ధుడు.

ఒకసారి అమెరికా సాహిత్య ప్రియులు వైల్డ్‌ను తమదేశ పర్యటనకు ఆహ్వానించారు.

వైల్డ్ అమెరికాలో ఓడ దిగగానే అక్కడి కస్టమ్స్ అధికారి వైల్డ్‌ని గురించి కూడా "కస్టమ్స్ రూల్స్ ప్రకారం మీతో వున్నదంతా మీరు ప్రకటించారా?" అన్నారట.

వెంటనే వైల్డ్ "నా మేధావితనం తప్ప అన్నీ ప్రకటించాను" అన్నారట.

సర్ లీవిస్ మోరిస్ అనే కవి తన బాధను ఒకరోజు వైల్డ్‌కు చెబుతూ "ఈ పత్రికల వైఖరేమిటో నాకు అంతు పట్టటం లేదు నా రచనల్లో ఉన్న సాహిత్య ప్రతిభ విషయం లోకానికి చెప్పకుండా అలా మౌనం వహిసా యేమిటి! దీనికి నన్నేం చేయమంటారు?" అని అడిగాడట

వెంటనే వైల్డ్ "వాటి ధోరణికి నిరసనగా నువ్వు గట్టిగా మౌనం వహించు" అన్నాడట.

ఆస్కార్ వైల్డ్ నాటకం ఒకటి మొదటి ప్రదర్శనతోనే పూర్తి అపజయాన్ని పొందింది. ఆ నాటకం చూసి తిరిగి వస్తున్న వైల్డ్‌ను ఆటలు పట్టించాలని "ఈ నాటక భవిష్యత్తును గురించి మీరేం చెబుతారు?" అని అడిగాడు ఓ పాత్రికేయుడు.

వెంటనే వైల్డ్ "నాటకం గొప్ప హిట్టేనయ్యా!
అయితే ప్రేక్షకులు మాత్రం ఆనందించటంలో ఫెయిలయ్యారు" అన్నాడట.

ఒకప్పుడు వైల్డ్ అమెరికాలో పర్యటిస్తూ, వివిధ ప్రాంతాలలో సాహిత్య ప్రసంగాలు చేస్తూ ప్రేక్షకుల్ని అమితంగా

అలరిస్తున్నాడు. ఒకరోజు ఒకసాహిత్య సభ ముగిసి వెళ్ళబోతుండగా ఒక మహిళామణి గబగబా వచ్చి "మీరు గొప్ప సాహిత్యవేత్త గదా! నేను రైలు ప్రయాణాల్లో చదువుకోడానికి ఏది థ్రిల్ కలిగించేలా చదివిసుంది?" అని అడిగింది.

వైల్డ్ వెంటనే "సాహిత్యంలో అలాంటి ప్రత్యేక రచనలంటూ ఉండవు! పోనీ ఒక పని చేయండి! మీకు డైరీ రాసే అలవాటు వుంటే, వీలైనంత పాతడైరీ చదువుకోండి! అది తప్పక థ్రిల్ కలిగిస్తుంది" అన్నాడట.

అంతే ఆ మహిళామణి ఆ ఛాయల్లో లేకుండా మాయమైంది.

ఒకసారి ఆస్‌గుడ్ అనే ఓ ప్రచురణ కర్త వైల్డ్ రచనలను ఇంగ్లాండ్‌లో,



అమెరికాలో ఒకేసారి ముద్రించాడు. ఆ విషయం రెండు దేశాల్లోని పత్రికల్లో ప్రముఖంగా ప్రచురింపజేశాడు ప్రకటనల రూపంలో. తరువాత అతను అమెరికాలో చనిపోయాడట! ఇంగ్లండ్‌లో జరిగిన సంతాపసభలో ఆస్కార్ వైల్డ్ మాట్లాడుతూ "ఆస్‌గుడ్‌మరణం నిజంగా మనకు తీరని నష్టం. అయితే ఇతని మరణానికి సంతోషించే ప్రత్యర్థులైనపబ్లిషర్లు అతన్ని ఇక్కడ ఇంగ్లాండ్‌లో,అక్కడ అమెరికాలో రెండుసార్లు పాతిపెట్టికాని సంతృప్తి పడరనుకుంటా" అన్నాడట—రచయితల పట్ల పబ్లిషర్లు ఎంత క్రూరంగా ప్రవర్తి స్వారో ధ్వనింపజేస్తూ.

ఓ సారి అమెరికా పర్యటన ముగించిన వైల్డ్ ఇంగ్లాండ్ తిరిగిరాగానే,ప్రాతికేయుల సమావేశం జరిగింది.

అప్పుడొక ప్రాతికేయుడు లేచి "అమెరికాలో మీకు అత్యంత ఆశ్చర్యం కలిగించినదేది?" అని అడిగాడు.

వైల్డ్ వెంటనే "అమెరికావాళ్ళు ఛస్తే నిజం చెప్పరని తెలిసింది! ఉదాహరణకు అమెరికాను కొలంబస్ కనిపెట్టాడని ప్రపంచంలోని అందరిచేతా నమ్మించారు వాళ్ళు! అయితే, నా అనుమానం కనీసం ఓ డజను మందైనా కొలంబస్ చేసిన పని చేసివుంటారు! అయితే ఈ నిజాన్ని బయటపడకుండా వాళ్ళుదాచారని నా అనుమానం. కాబట్టి వాళ్ళెంతకైనా తగిన వాళ్ళేనని నా నమ్మకం" అన్నాడట.

—ఎం.డి. సౌజన్య

# ఫ్రెంచి సెక్సు

చతుర

నిగనిగలాడే పొడవాటి నల్లకాళ్ళు, ఆరడుగుల ఎత్తున్న ఆజానుబాహువులు, నల్లని క్రాపుల గురించి కలలుగనే అమ్మాయిలు మన ఆంధ్రదేశంలోనే కాదు ఫ్రాన్స్‌లోనూ వున్నారని 'ఫ్రెంచి స్త్రీల సెక్స్, ప్రేమ జీవితం' అనే పుస్తకం రుజువు చేస్తోంది. ఈ పుస్తకాన్ని రచించి,



ప్రచురించిన ఇద్దరు డాక్టర్ల పేర్లు ఫ్రాన్స్‌లో మారుమోగిపోయాయి.

ఈ పుస్తకాన్ని రచించడానికి వీరు చాలా శ్రమపడాల్సి వచ్చింది. ఫ్రెంచి స్త్రీల సెక్స్, ప్రేమ జీవితం గురించి సశాస్త్రీయంగా రాయడానికిగాను వీరు ప్రశ్నాపత్రాలను రూపొందించి దాదాపు 30 వేల మంది స్త్రీలకు పంపించారు. ఆ ప్రశ్నాపత్రాలను వారినుండి తిరిగి సేకరించేటపుడు ఆయా స్త్రీల భర్తల చివాట్లను కూడా భరించవలసి వచ్చిందట వీరు.

వీరు ఈ పుస్తకం రాయడానికి అన్ని తరగతుల స్త్రీలనుంచి వివరాలు రాబట్టారు. వివాహితులు, అవివాహితులు, విడాకులు తీసుకున్న స్త్రీలు, ప్రేమలో పడిన స్త్రీలు అందరి జవాబుల సారాంశం ఈ పుస్తకంలో వుంది. "ఫ్రెంచి పురుషులు తాము పెళ్ళాడబోయే స్త్రీలు కన్యలై వుండాలన్న విషయానికి ఎక్కువ ప్రాముఖ్యత నిస్తారు. తమ సెక్సు బలహీనతలు భార్యలకు తెలీడం కూడా వీరికిష్టం వుండదు. అందుకే మా ప్రశ్నావళికి తమ భార్యలు జవాబివ్వడానికి, చాలామంది ఇష్టపడలేదు" అని ముందుమాటలో వివరించారు.

కాని ఫ్రెంచి స్త్రీలు మాత్రం ప్రశ్నావళికి చాలా సూటిగా, వివరంగా జవాబులిచ్చారు. యుక్తవయసు వచ్చీరాని వారిలో 56 శాతం మంది అమ్మాయిలు ప్రథమ సంభోగం చాలా బాధాకరంగానూ, చాలా నొప్పిగానూ వుంటుందని చెపితే 38 శాతం అమ్మాయిలు పైన చెప్పిన వారికి విరుద్ధ

# ప్రపంచం

మైన భావాన్ని వ్యక్తపర్చారు. పదిశాతం మంది మాత్రమే అదొక అద్భుతమైన అనుభవమని ఒప్పుకున్నారు.

ఈ పుస్తకం అందించిన లెక్కల ప్రకారం ఫ్రెంచి స్త్రీలలో ఒకశాతం మాత్రమే వివాహ సమయానికి కన్యలుగా వున్నారు. చాలామంది ఫ్రెంచి యువతులు తమ శారీరక వాంఛను భర్తలు తృప్తిపరచ లేకపోవడం వల్లనే తాము పర పురుషుల వైపు కన్నెత్తి చూడాల్సి వస్తోందని తెలియ జేశారు. మరివారు భర్తలతో ఎందుకని తృప్తిపడలేకపోతున్నారంటే వారు కూడా సినీ హీరోల్లాంటి భర్తలు కావాలని కోరు కోవడమే అంటున్నారు పుస్తకం రాసిన వారు.

## దివ్యజలం

ఈమధ్య ఆస్తమా వ్యాధివున్నవారం దరూ కర్నాటకలోని ఓ జిల్లాకి పరుగులు పెడుతున్నారు. సదరు జిల్లాలో వున్న




ఓ బావినీరు ఉబ్బస వ్యాధిని నయం చేస్తోందన్న వార్తే ఈ హడావిడికి కారణం. విచిత్రమైన ఆ బావి బెంగుళూరు–హైదరాబాదు జాతీయరహదారిమీద బెంగుళూరుకు 50 కిలోమీటర్ల దూరాన బీర్‌సంద్రా గ్రామంలో వుంది.

ఈ గొట్టపు బావి చుట్టూ వందలకొలది ప్లాస్టిక్ బక్కెట్లు, కేన్లూ కన్పిస్తాయి. బావికి కుంకంబొట్లు పెట్టబడి వుంటాయి. పక్కన కొన్ని అగరువత్తులు వెలుగుతూ బావి సందర్శనార్థం వచ్చేవారి మనసుల్లో భక్తిభావనను పెంపొందించుతాయి.

బీర్‌సంద్రా గ్రామ ప్రెసిడెంటు బావి దగ్గిరే ఓ కుర్చీ వేసుకుని కూర్చుని ఉంటాడు. ఈయన కొండవీటి చాంతాడులా పెరిగే మనుషుల బారులను చూస్తూ చిద్విలాసంగా చిరునవ్వు లొలికిస్తుంటాడు. కర్నాటక రోడ్‌వేస్ వారు ఇక్కడికి వచ్చిపోయే వాహనాలకోసం మిని-బస్ స్టాప్‌ను కూడా నిర్మించారు. ఇక్కడికి మైసూరు, ఉడిపి, బొంబాయి, మద్రాస్ మొదలైన చోట్లనుంచికూడా జనం వస్తున్నారు. ఇప్పుడిక్కడ రెండు దుకాణాలు

కూడా వెలిశాయి. బావిదగ్గరున్న హుండీలో వేసిన డబ్బులను 'గంగమ్మ' గుడి నిర్మాణానికి ఉపయోగిస్తారు.

ఈ గొట్టపుబావి నీటిని 41 రోజులు సేవిస్తే వ్యాధి పూర్తిగా నయమవుతుం దన్న నమ్మకంవుంది. బావినీరు ఆస్తమానే గాక మనుషుల్ని దుర్భలుల్ని చేసి బలహీన పరిచే ఇతర వ్యాధులను కూడా నయం చేస్తుందని చాలామంది నమ్ముతున్నారు.

ఓసారి ఆ దారంట పోతున్న ముస లమ్మ దాహం వేసి ఈ బావినీరు తాగిందట. కొంతసేపు ఉబ్బసం నెమ్మదించింది. ఆ తర్వాత ఆమె ఆ బావినీరుమరికొన్నాళ్లు తాగింది. విచిత్రంగా వ్యాధి పూర్తిగా నయమయింది. అప్పటినుంచి ఈ ప్రచారం మొదలై జనం రావడంజరిగింది. ఈ బావి నీటి మహత్తు ఎంతో తెలుసుకుం దామని కొందరు శాస్త్రవేత్తలు ఈ బావి నీటిని తీసికెళ్ళారు పరీక్షల నిమిత్తం. ఆ పరీక్షలు పూర్తయితే ఈ గాలివార్త లోని నిజానిజాలు బయట పడతాయి.

# సిమెంటు పడవ



ఈ రోజుల్లో విశ్వవిద్యాలయాలు చదువు లకి గాక రాజకీయాలకి ఆలయాలుగా మారుతున్నాయి. విద్యార్థులకి చదువుమీద కన్నా చిల్లరమల్లర వ్యవహారాలమీదే ఎక్కువ ఆసక్తిగాఉన్నా ఆ చదివే కొద్ది చదువును సార్థకం చేసే ఉత్తమ విద్యార్థులూ లేకపోలేదు. ఈ మధ్య అన్నామలై విశ్వవిద్యాలయానికి చెందిన కొందరు విద్యార్థులు మనదేశానికే గర్వ కారణమనదగిన పనిచేసి 'శభాష్' అన్పించు కున్నారు.

మామూలుగా పడవలను కొయ్యతో కాని, ఇనుముతోగాని తయారుచేసారు. కొయ్యతో తయారుచేసినవి చాలా త్వరగా శిథిలమైపోతాయి. ఇక ఇనుముతో తయారు చేయడం చాలా వ్యయప్రయా సలతో కూడిన పని. ఒకవేళ అంత ఖర్చుచేసి పడవను తయారుచేసినా దాని నిర్వహణకు చాలా ఖర్చవుతుంది. కనుక అన్నామలై విశ్వవిద్యాలయానికి చెందిన ఈ విద్యార్థులు ఈ సమస్యలకి ప్రత్యా మ్నాయ మార్గాన్ని కనుగొన్నారు.

వీరు సిమెంటును మూల పదార్థంగా వాడి, ఇనుప కడ్డీలతో పోత పోయడం ద్వారా ఒక పడవను నిర్మించారు. అంటే కింద చెక్కలు ఆధారంగా వుంచి ఇనప కడ్డీల మీద కాంక్రీటుపోసి పై కప్పు వేసినట్లుగానే ఈ పడవను రూపొం దించారు. 3.2 మీటర్ల పొడవు, 1.33 మీటర్ల వెడల్పు వున్న దీని బరువు 500 కిలోలు. ఈ పడవ తయారీకి 3 బస్తాల

సిమెంటు, 6.75 ఘనపు అడుగుల ఇసుక, 40 కేజీల ఇనుము పట్టింది. మొత్తం ఖర్చు 400 రూపాయలు మాత్రమే. దీనిలో ఐదుగురు హాయిగా కూర్చొని విహరించవచ్చు. అవసరమయితే దీనికి మోటారును కూడా బిగించుకోవచ్చు.

సిమెంటు పడవలను తయారు చేయడంలో కొన్ని సౌలభ్యాలున్నాయి. సిమెంటు ధర చవక అవడమేగాక ఈ పడవల నిర్వహణ ఖర్చు కూడా అంత ఎక్కువగా వుండదు. కొన్ని పరీక్షల్లో ఈ పడవకు నీటిలో అరుగుదల వుండదనీ' సాంకేతికంగా తయారుచేయబడే ఇతర పడవలకన్నా బలమైనదనీ తేలింది. ఆ విద్యార్థులు 'చెట్టినాడు రాజా' అని పేరు పెట్టిన ఈ పడవ ప్రపంచంలోనే మొదటి సిమెంటు పడవట.

## ఏజెంట్ గోవు

క్షీర విప్లవం విజయవంతం కావడానికి ఒంగోలుజాతి పాడి పశు సంతతిని అభివృద్ధి చేసేందుకు,అంతరించి పోతున్న అపూర్వ వన్యమృగ జాతిని కాపాడేందుకు 'సంకర' పద్ధతులను అవలంబించడం అందరికీ తెలిసిన విషయమే. ఈ పద్ధతుల్లో ఇటీవల అమెరికాలో ఒక విచిత్ర ప్రయోగం జరిగింది. భారతదేశం జన్మభూమిగా గల ఒక అపూర్వమైన అడవి ఎద్దును అమెరికాకు చెందిన ఒక పాడియావు ఈనింది. విశేషం ఏమిటంటే, ఈ గోమాత కేవలం ఈ ప్రయోగంలో ఒక 'ఏజంటు'గా మాత్రమే వ్యవహరించింది. ముందుగా ఒక ఆడదున్నను ఎన్నుకుని దానికి హార్మోన్స్ సూదిద్వారా ఇచ్చి, దాని కడుపు పండేట్లుచేశారు. ఆపైన దాని పిండాలను సేకరించి ఈ ఆవు గర్భంలో ప్రవేశపెట్టారు. ఆ తర్వాత ఈ ఏజంటు ఆవు తన పనిని విజయవంతంగా పూర్తిచేసింది. 1980 ఆగస్టులో ప్రారంభమైన ఈ ప్రయోగం 1981 మే నెలలో పూర్తయింది. సాధారణంగా ప్రకృతిరీత్యా అయితే అడవి ఆడదున్న ఏడాదిలో ఒక్క దూడనే ఈనుతుంది. కానీ ఈ ప్రయోగం ఫలితంగా ఏడాదికి ఆరునుంచి ఎనిమిది పిల్లలను సంపాదించవచ్చునని తేలింది. ప్రయోగానికి మొదట నాలుగు ఆవులను ఎన్నుకోగా ఒక్కటే సత్ఫలితాన్నివ్వగలిగింది.లోగడ 1977లో ఒకసారి ఇలాగే పెంపుడు జాతి గొర్రెకు అడవి గొర్రెను పుట్టించగలిగిన విధానం చూసి, ఈ ప్రయోగం సమర్థవంతంగా నిర్వహించారట.



# జైలే స్వర్గం

కాలిఫోర్నియాలోని జైలు ఖైదీలు తమ కోరికలతో, అవి తీర్చుకోవడానికి తమకు గల హక్కులతో అధికారులను వేదిస్తున్నారట. ఈ ఖైదీలు హత్యలు, మాన భంగాలు, దోపిడీ, దొంగతనాలు చేసిన పెద్ద పెద్ద నేరస్తులైనా తివాచీలు పరచిన జైలు గదులలో, సంగీతం వింటూ, డిస్కో లైట్ల కింద నృత్యాలు చేస్తూ ఆట పాటలతో కాలం గడుపుతున్నారు. అయినా అదేమీ చాలదన్నట్లు ఈ నేరశిఖామణులు కొత్త కొత్త కోరికల జాబితాలు తెస్తూ, అదేమంటే కోర్టులకెక్కుతూ అధికారుల గుండెల్లో అలజడి సృష్టి



స్తున్నారు. వీరు నేరాలుచేసి నిర్బంధంలో ఉన్నప్పటికీ వారూ మనుషులేననీ, కారాగారాల భద్రతకు ముప్పురానంతవరకూ వారి కోరికలన్నిటినీ తీర్చవలసిందేననీ కోర్టులు తీర్పు ఇచ్చాయి. దాంతో ఈ పెద్ద మనుషుల హక్కులకు అంతులేకుండా పోతోంది. భోజనం షడ్రసోపేతంగా ఉండాలనీ, తమకు వచ్చే ఉత్తరాలను, సాహిత్యాన్ని తనిఖీచేయకుండానే అందించాలని వాదిస్తున్నారు. వీరికి ఇప్పటికే ఈ జైళ్ళలో లైబ్రరీలు, తోటలు, వ్యాయామశాలలు వగైరా లెన్నో ఉన్నాయి. అయినా తమపై జైలర్లు, గార్డులు మరీ అంత దగ్గర్నుంచి నిఘావేస్తూ తమ 'ఏకాంతా'నికి భంగం కలిగించడం న్యాయం కాదనీ, రోజూ ముప్పూటలా వేడివేడి భోజనం వడ్డించాలనీ, టి.వి. సెట్లు కావాలనీ పీరు గొడవచేస్తున్నారు. కాదంటే కోర్టులలో దావాలు వేస్తున్నారు. వీరి తరఫున సగటున రోజుకు నాలుగు పిటిషన్లయినా దాఖలవుతున్నాయని తెలుస్తోంది. ఇది ఇలా ఉంటే ఆ జైలులో లభిస్తున్న సౌకర్యాల గురించి వింటున్న జనం పోటీలుపడి వాటిలో ప్రవేశిస్తున్నారట. నిజానికి పదేళ్ళ కిందట ఖైదీలకు ఏ హక్కులూ ఉండేవికావు. 'అప్పుడే మాపని సులువుగా ఉండేది. ఇప్పుడీ కోర్టుల జోక్యంతో చట్టాలలో మార్పులు రావడంతో మాకు చచ్చేచావుగా ఉంద'ని అధికారులు వాపోతున్నారు.

# ఉక్కు మనిషి

జనం గుంపులుగా వున్నారు. వారిముందు ఒకతను వెనక్కు తిరిగి నిల్చొని వున్నాడు. అతని వీపుమీద గుండ్రటి వలయాలు చిత్రించబడి వున్నాయి. అక్కడున్నవారు చిన్న చిన్న బాణాలను తీసుకుని అతని వీపు మీదకి విసురుతున్నారు. అవి రివ్వునపోయి వీపులో దిగబడుతున్నాయి. అయినా అతను కదల్లేదు. రాయిలా పువ్వులు మీద పడుతున్నట్లుగా నిల్చున్నాడు.



అంత తీరిగ్గా నిల్చొని ఆ బాధ భరిస్తున్న అతని పేరు యోగి వసెల్స్. ఆ ప్రదర్శనలే అతని జీవనాధారం. ఇతని జన్మస్థానం జమైకా. అక్కడ ఒక నల్లజాతి దంపతులకు పుట్టిన ఇతను తెల్లవారి మధ్య గౌరవంగా బతకడానికి చాలా కష్టపడాల్సి వచ్చింది. తర్వాత ఇంగ్లండ్ చేరినా, అక్కడా తెల్లవారి మధ్య జీవనం కష్టంగానే వుండేది. స్త్రీగా పుట్టి వుంటే కనీసం శరీర సౌందర్యాన్ని ఎరగాచేసి ఆ తెల్లవాళ్ళ మధ్య నెగ్గుకొచ్చేవాడు. కాని మగవాడై పుట్టడాన మరో మార్గం వెతుక్కోక తప్పలేదు. అందుకని యోగ విద్యను అభ్యసించాడు.

11 ఏళ్ళ వయసులోనే వసెల్స్ కణకణమండే నిప్పులమీద, పగలిన గాజు ముక్కలమీద నడవగలిగాడు. తొమ్మిదో ఏటనుంచే మనసును తన అదుపులో వుంచుకోవడం సాధన చేశాడు. "అన్ని రకాల బాధలకు మనసే బాధ్యత వహిస్తుంది. మనసును అదుపు చేయగలిగితే మనల్ని నొప్పి, బాధ అన్న భావనలు బాధించవు" అని ఇతని నమ్మకం.

ఇతను తనకు నచ్చిన రీతిలో నచ్చిన విధంగా మనసును అదుపుచేసుకో గలడట. అందుకే "బాధ, నొప్పి అన్న పదాలకు నా నిఘంటువులో అర్థాలులేవు. ఎన్ని బాణాలు విసిరినా చీమ కుట్టినట్లయినా అన్పించదు" అంటాడు ప్రస్తుతం 41 ఏళ్ళ వయసున్న ఈ యోగి వసెల్స్. ఇతను లండన్‌లో స్థిరనివాసం ఏర్పరచుకొని అక్కడ నుంచి బ్రిటన్ అంతటా ప్రయాణిస్తూ ప్రదర్శనలిస్తూంటాడు. కూటి కోసం కోటి తిప్పలయినా పడాలీ ప్రపంచంలో.

FORM IV [See Rule 8]

Statement about ownership and other particulars of CHATURA

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India? | : Yes |
| | If Foreigner, state the country of origin | : ——— |
| | Address | : 6-3-570, Eenadu Compound Somajiguda, Hyderabad-500 004. |
| 4. | Publisher's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India? | : Yes |
| | If foreigner, state the country of origin | : ——— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 5. | Editor's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India? | : Yes |
| | If foreigner, state the country of origin | : ——— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |
| 6. | Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one percent of the total capital. | : VASUNDHARAPUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda, Hyderabad-500 004. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS.

Date : Sd/- RAMOJI RAO

March 1, 1982. Publisher.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd. No. H/HD/402